హనుమద్గ్రంథమాల. ద్వితీయసూనము.

శ్రీ మేథాదక్షిణామూర్తయేనమః.

"స్వధర్మే నిధనం శ్రేయః"

# నిరోష్ఠ్య తేటాంధ్ర దాశరథిచరిత్ర నిర్వచన

శ్రీమత్సుగ్రీవ పట్టాభిషేకాద్యాంధ్ర గ్రంథకర్తయు,

శ్రీద్వైతాద్వైత మతప్రవిష్టుఁడు

పెరవలిపు రోన్నతపాఠశా లాంధ్రోపాధ్యాయుఁడు నగు

అష్టావధాని

అ. హనుమంతరాయశర్మ పాకయాజిచే

రచియింపఁ బడినది.

ప్రథమముద్రణము ౫౦౦.

బెజవాడ:

ఆంధ్ర గ్రంథాలయ ముద్రాలయమున

బ్ర॥ కర్లపాలెము కోదండరామశర్మ చేత

ముద్రింపఁ బడియె.

శ్రీ దీక్షిత సంవత్ ౧౦౯.

౧౯౨౭.

సర్వస్వామ్య సంకలితము] వెల రు. ౧—౦—౦.





# తొలిపలుకు.

రసికవతంసులారా !

ఆంధ్రవాఙ్మయమునకుఁ గల ప్రత్యేక వ్యక్తిత్వము తెలుపు చిత్రకావ్యములలో అచ్చాంధ్ర, నిరోష్ఠ్య, నిర్గద్య దాశరథి చరిత్ర యొకటి. ఈతెగ పుస్తకము లాంధ్రభాషలోఁ జాలయరుదుగా నున్నవి. శుద్ధాంధ్ర గ్రంథరచనమే మిగులఁ గష్టము. ఆంధ్రపదములు నిఘంటు శరణ్యములుగ నున్నవి. నిజమగు తెనుఁగుకవిత శ్రీనాథుని కీవలి పాత్రములలోఁ గానరాదు. సమాసములు, శ్లేషలు, యమకములు లోనగు నాధునికకవుల కల్పనలన్నియు మూఁడుపాళ్లు సంస్కృతమునకుఁ జెందినవి. తేనెవలె దరితీపు గల మన తెనుఁగునకు వ్యక్తిత్వమును నిలువఁబెట్టుటకె కాఁబోలు తెలగన్న యవతరించినాఁడు. "అచ్చతెనుంగు పద్దె మొకటైనను గబ్బములోన నుండినన్ హెచ్చని యాడుచుందురు" అని సమకాలిక కవిలోకమునకు శుద్ధాంధ్రభాష యెడఁ గల ప్రేమను, శుద్ధాంధ్ర గ్రంథరచనమునందలి కష్టమును గూడఁ దెలగన్న పేర్కొనినాఁడు. రానురాను చిత్రకావ్యములు గూడ శుద్ధాంధ్రమున బయలువెడలుట భాషాభివృద్ధికి దార్కాణమని యొప్పుకొనకతప్పదు.

మనకుఁ దెలిసినంతలో శుద్ధాంధ్ర నిరోష్ఠ్య గ్రంథరచనమున మరింగంటి సింగరాచార్యులు ప్రథముఁడు. దాశరథిచరిత్ర రచయిత యగు ప్రకృతగ్రంథకర్త కడపటివాఁడని చెప్పనగును. నిరోష్ఠ్య శుద్ధాంధ్ర సీతాకల్యాణమున సింగరాచార్యులు గ్రంథరచనమునందలి కష్టము నీక్రిందివిధముగఁ జెప్పినాఁడు.

---

చ॥ తెనుఁగునఁ గొన్ని కావ్యములు • తెల్లముగా రచియింపవచ్చుఁ జే
ర్కొనఁగ నిరోష్ఠ్యకావ్యములు • కొన్ని యొనర్పఁగవచ్చుఁగాక చే

క్కన నివి రెండుచందములు ♦ గ్రుచ్చెఁ గూర్చెడు నేర్పుచేత నె
వ్వనికి రచింపశక్యమగు ♦ వాంఛ యొనర్చితి దానిఁ జేయఁగన్!

తే॥ చెప్పరానట్టి కావ్యంబుఁ ♦ జెప్పఁబూని
నాఁడ నుద్ధతగతి చేత ♦ నడచి నడవ
ముఃం విచారింపకయ యేగి ♦ జలధి దాఁట
జేరు సాహసి దొడ్డు కొం♦చెంబు లనునె ?

తే॥ ఒకరి తెఱువుఁ బోవ ♦ నొకరు నా తెఱువు రా
రీప్రబంధరచన ♦ మెన్నఁ దరమె॥

*　　　*　　　*　　　*

చ॥ ఇలఁ గవితాప్రయాసమగు ♦ నెన్నికరైయె యుభయార్థకావ్యముల్
గల విపు డట్లు విన్న యది ♦ గద్దికముంగఁ గల్గనేర్చునే
తెలుఁగు నిరోష్ఠ్యపుంగృతి యిం♦దే మఱి తక్కఁగ నిప్పటందులన్
గలుగదు వింటలేదె యిఁకఁ ♦ గాఁగలజాడల నెన్న నేటికిన్ ?

పై పద్యములవలన అచ్చతెనుగులో నిరోష్ఠ్య నియమము పాటించుట మిగులఁగష్టమని తెలియుచున్నది. పాపము సింగరాచార్య కవి, నిరోష్ఠ్య శుద్ధాంధ్రకావ్యము వేఱొకటి "నభూతో నభవిష్యతి" యనినాఁడు. "కాలోహ్యయం - నిరవధిర్విపులాచ పృథ్వీ" యన్నటుల అనంతమైన మహాంధ్రమండలమున నెందఱు మహాకవు లుదయించి నిర్వచన నియమముగూడఁ బాటించి అచ్చాంధ్ర నిరోష్ఠ్య నిర్గద్య కావ్యముల రచింపనుంటిరో యని తలంపఁడయ్యె. ఈచర్చయంతయుఁ బూర్వోక్త నియమ భూయిష్ఠ గ్రంథరచన మెంతో కష్టమని తెలుపుట కని సహృదయులు భావింపఁ బ్రార్థితులు.

యతిప్రాసలె కవితకు నిర్బంధశృంఖలలని భావింపఁబడు నీనవ యుగమున నిట్టి చిత్రకావ్యములు విడ్డూరముగఁ దోపవచ్చును. కవికిఁ గల స్వాతంత్ర్యము నవనాగరకుల యభిరుచికి లోనైనది గాదు. వాఙ్మయమునఁ దనకుఁగల యభినివేశము, అభిమానము, ఆసక్తిని బట్టి కవి విచిత్రకావ్యరచనమునకు దొరకొనును. "యేనామ కేచిదిహనః ప్రథయంత్యవజ్ఞాం । జానంతు తే కిమపి తాన్ ప్రతి నైష యత్నః ఉత్పద్యతే

మమతు కోపి సమానధర్మా:" అని భవభూతి చెప్పినట్లు ఏట్టికావ్యముల కేని కాలమునుబట్టి విలువ గలిగితీరును. ఈచిత్రకావ్యమున నిర్బంధములు మెండుగనుంటచేఁ గవికిఁగల స్వాతంత్ర్యము పెక్కుతావుల మరుగుపడినది. కవి తన సహజకౌశలము నూతగఁగొని గ్రంథనిర్మాణమునఁ గృతార్థుఁడయ్యెననుటకు సంతసమగుచున్నది. నిరోష్ఠ్య నిర్గద్య నియమములతోఁగూడ నాంధ్రవాఙ్మయమును పెంపునొందింపనగు ననుటకీ తెగ కావ్యములు సర్వవిధములఁ దార్కాణ కాఁగలవు.

ప్రకృతగ్రంథకర్త అబ్బరాజు హనుమంతరాయశర్మగారు. వీరింతకుమున్న శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన నృగచరిత్రము. సుగ్రీవపట్టాభిషేకము మొదలయిన ప్రబంధములను, వాణీశతకము; హరిహరనాథ శతకము, మున్నగు శతకములను రచించి యాంధ్రలోకమునకుఁ జిరకాలమునుండి పరిచయులై యున్నారు. నిరోష్ఠ్య నియమమును బాటించుచు నచ్చతెనుఁగున సీదాశరథిచరిత్రలో వ్రాయఁబడిన ద్వ్యర్థి, యమక, శ్లేషాదికములు, గర్భకవిత, సర్వలఘుసీసాదులు కవికిఁగల శుద్ధాంధ్ర కవితాశిల్ప పరమావధికిఁ దార్కాణములు. చక్కఁగఁదెలియుటకై లఘుటిప్పణము గూడఁ గవిగారు సమకూర్పించుటచే గ్రంథప్రశస్తి సామాన్యజనులుగూడ గ్రహింప నవకాశము కలిగినది. అచ్ఛాంధ్ర నిరోష్ఠ్య నిర్గద్య కావ్యములు వానియుత్పత్తి వికాసములనుగూర్చి గ్రంథకర్తగారు విపులముగఁ జెప్పియున్నారు. కవిగారు చెప్పవలను పడని యొక యంశమునుగూర్చి (కవితాప్రశస్తి) యించుక వ్రాయుట ప్రకృతము కాకపోదు.

కాళ్లు వ్రేళ్లు ఒడలు బిగించికట్టినను అంతలో నిర్బంధ బంధముల తొలంగించికొని ప్రేక్షకలోకమును దనుపు నింద్రజాలికుని వలె నీకవియు నిర్బంధముల నన్నింటిని పాటించియు నుత్తీర్ణుఁడై స్వతంత్రగ్రంథమువలె సీదాశరథిచరిత్రను రచించెననుట యొక విశేషము. "కటకటా రాఘవుఁడు సముత్కటకరీంద్ర।కటకలితదాన ధారార్ద్ర కటక మార్గ।గామి యెట్టుచరించు సుత్కటకరీంద్ర।కటకలితదాన ధారార్ద్ర కటకతటుల" అనుచో రామాభ్యుదయమున రామభద్రుఁడు చూపిన కౌశలమును అచ్చతెనుఁగు నిరోష్ఠ్యములో "హత్తిచెక్కిళ్ల నీటని-

"హా త్తితడిసి ! నట్టిరాదారి నడయాడి•నట్టిడచేట" "హా త్తిచెక్కిళ్ళ నీటిని హా త్తి తడిసి'నట్టి తాదారి నడయాడ•నయ్యెకట" యను మృదుమధుర భాషలోఁ గవిగారు లిఖించి తమకౌశలమును బ్రకటించిరి. ఇటులె నీ చిఱుపొత్తమునఁ బూర్వకవుల పోకడల కనుకరణములు గలవు. అవియు, .

"మదగజరాజముల్ చేనిదమార్గమునం గడు నింపునింప వే
మదగజరాజయాన మద మంథర బంధుర యానమానముల్"

అన్నట్లు మిగుల రమణీయములుగా నున్నవి. మచ్చున కుదాహరింతుము.

"సీ॥ తనభవ్యధామంబు • తనభవ్యధామంబు
కరణి మిత్రోన్మేష • కరముగాఁగ" (వసు)

"సీ॥ తనకడిందికడంక • తనకడిందికండక
కరణిగట్టంతయై • గండెసంగ" (దా. చ. ప్ర)

"సీ॥ కానకకన్న సం•తానంబు నేటికి
కానకే కన్న సం•తానమయ్యె
వివిధాగమాంత సం • వేద్యుండు గావున
వివిధాగమాంత సం•వేద్యుఁ డయ్యె"
(రామాభ్యుదయము)

"సీ॥ కానకకన్న సం•తానంగ నేటికిఁ
గానకకన్న సం• తాన నయ్యె
జెట్లంగదిరిగెడి • జెట్టి తా నేటికిఁ
జెట్లాడఁ దిరిగెడి • జెట్టి యయ్యె"
(దాశరథి చరిత్ర. ప్ర).

ఇటులె కొన్ని పోలికలఁ జూపవచ్చును. గ్రంథము సలక్షణమగు భాషలో సుక్తపద ప్రస్తబంధాది చిత్రరచనములతో నలరారి కవితాశిల్పలోలురహృదయము లాకర్షించునటులున్నది. గ్రంథకర్తగారు సుప్రసిద్ధకవివంశ సంజాతులు. ఆంధ్రకవితాకన్య నియోగులయింటి యాఁడుబిడుచు. అందుఁ బ్రత్యేకించి యాంధ్రకవితారచనమున సుప్ర

సిద్ధులగు మాకొండవీటిసీమ యాఱువేల నియోగులనుగూర్చి చెప్పవలసినపనియే లేదు.

నిరోష్ఠ్యాది నిర్బంధములులేని సరళ స్వతంత్రకవితారచనమున నీ గ్రంథకర్తగారు కృషిచేసి యుత్తమగ్రంథములు వ్రాసి యాంధ్రభారతికర్పించి ధన్యులు కాఁగోరుచు నీచిన్నిపొత్తమునకుఁ బీఠికవ్రాయ నవకాశము కలుగఁజేసియు విశ్రాంతిలేకున్న మాయెడఁ గనికరించి తొలిపలుకు ఆలస్యముగ నిచ్చినను బరిగ్రహించినగ్రంథకర్తగారి సద్భావముఁ గొనియాడుచున్నారము.

గ్రంథకర్తగారికి సత్కృతినిర్మాణమునకు వలయు దీర్ఘాయురారోగ్యాదికములు ప్రసాదింప భగవంతుఁడగు సర్వసాక్షినిఁ బ్రార్థించుచున్నారము.

చ॥ సరసము భావభాసురము • సన్నియమావృతమై తనర్చు "దా
శరథిచరిత్రముం" జదివి • సంతసమందితి, మచ్చుతెన్గులో
నెఱతనముం నిరోష్ఠ్యమును • నీవలెఁ గూర్చి ప్రబంధ మల్ల నె
వ్వరికిఁ దరంబు నేఁటి కవి•వర్గములో? "హనుమత్కవీశ్వరా!"

ఇట్లు భాషాసేవకులు,
☞ శేషాద్రిరమణకవులు,
శతావధానులు,

నందిగామ
1—2—27



# పండితాభిప్రాయములు

ఓం

"స్వధర్మే నిధనం శ్రేయః."

శ్లో॥ అబ్బరాజాన్వయోద్భూత హనుమచ్ఛర్మణా ముదా
అచ్ఛాంధ్రభాషాగ్రథితం చరితం రాఘవస్యతు
సతాం పరిహర్షణం భూయా దిత్యాశీః క్రియతే మయా॥

సత్యనారాయణపురాగ్రహారం
చిదానందాశ్రమం,
బెజవాడ.
౨౨—౩—౨౭.

ఇత్థం సతాంవిధేయః
శ్రీ॥ వై॥ మ॥
కోటీశ్వరశర్మశాస్త్రి.



శ్లో॥ సంశుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన రూపోద్భూత మత్యద్భుతం
పూతం దాశరథిశ్చరిత్ర మతులం విద్వత్ప్రబోధోదయం
కృత్యం దాశరథే రివాతిబహుళై శ్చిత్రై ర్విచిత్రైర్వృతం
జీయా దేతది "హాబ్బరాజ హనుమత్కావ్యాగ్ర"వక్త్రోద్గితమ్॥

మ॥ పస నింపా మణులుండ వార్థి నెరసుల్ పాటింప వైదుష్యమే
రసవద్గ్రంథ నిబంధనంబు గదుః గృచ్ఛ్రం, బందా నచ్ఛాంధ్రమా
ర్యసమీడ్యంబు నిరోష్ఠ్య నిర్వచనమం దాహాయనంజేయు నీ
యసదృగ్గ్రంథము "నబ్బరాజ హనుమంతాఖ్యుం డొనర్చెం బళీ!"

తాలూకా హైస్కూలు,
తెనాలి.

శతావధాని, ములుకుట్ల వేంకటకృష్ణశాస్త్రి,
ఆంధ్రపండితుఁడు.



చ॥ కయిఁగయిఁగూర్చి నేస్తమును • గాటముగా నొనరించి బత్తితోఁ
గయికొ, యితమ్ము దీరుపఁగఁ • గానలఁ గ్రుమ్మరు రాముఁ గొల్చువాఁ
గ యనుమఁ డోముఁ జేరిఁటిచో • కాటమున న్ననుబోటివాఁడె యీ
కయిసరుఁ డంచు నెంచి కడఁ • క న్విడకుండెడు మెండు పండరౌ॥ 1

చ॥ ఎవనికి తల్ చెఱింబడిన • నేలిక లేఁబొలదిండు లెక్కలం
జెవిగల యాండ్రీఁ గల్మెలను • సంతును, గూరుచు నేస్తకాండ్ర ను
ద్ధవిడిని నీడి గోడున నె • ద ల్వగులం బసవెత్తుచుందురా
దువదువ తెక్కలయ్యకత • తోఁ బుసడే పెరవెవ్వియేనియున్? 2

చ॥ ఎవనల రాముని దపసు • లేని తెలుంగుచు నుత్వఁజాల ర
న్నది నిజమంచుఁ దెల్పు రహి • నాతని సవ్వడు లెల్లఁ దెల్పుచోఁ
బెదవిఁ గదల్పకుండ, నొక • వెంటను మాటలు వెట్టకుండ, నొ
ప్పిదపుఁ దెలుంగుపుట్ట మలు • బిడ్డఁడుగాఁ బచరించెఁ గబ్బమున్॥ 3

గీ॥ ఎందు నేనుచ్చ లేక పెం • పొందియున్న
యొడయఁ డవ్వేఁడి వేల్పువం • గడపుఁగడలి
చేందురుండగు శ్రీరామ • చంద్రికతను
మంతునకుఁ దెచ్చితివి "హను • మంతరాయ" 4

గీ॥ తెనుఁగుబూదేనె వాయి నొ • వ్వని వితానఁ
జెదువునోటను బెవవినేఁ • గదులనీక
చెవులఁ దేలించి నోరూరఁ • జెలిపె నీదు
వింతయగు కైత "శ్రీ హను • మంతరాయ!" 5

ఏలూరు.
8—2—27

ఇట్లు విధేయుఁడు,
రాజా మంత్రిప్రెగడ భుజంగరావు.

---

దువదువ..........లయ్య=చతుర్భుజుఁడు (విష్ణువు)

# సు జ న ర ం జ ని

ఉ॥ శ్రీకమలాక్షు లీక్షితిని • శిష్టుల దుష్టులఁ బెంపఁ ద్రుంపఁగా
లోకము లెన్న సౌఖ్యము, ల • లోపముగా నిడి యింపునింప శో
భాకరులైన భూమితన•యా రఘురాములుగా వెలుంగు త
చ్ఛ్రీకరు లెప్డు నాహృదయ•సీమ వసింతురుగాతఁ బ్రీతిమై. (౧)

సీ॥ శ్రీమదుమా రమా • చిత్తాబ్జమిత్రులౌ
శివకేశవులభక్తిఁ • జెలఁగువారు,
స్వకులద్వయమునకు • వన్నెఁ దెచ్చినవారు,
మా తల్లిదండ్రుల • మాదిరివారు,
నగు నబ్బరాజు మం•గాంబికా శేషార్య
లకుఁ బుత్రుఁడగుచుఁ జె•లంగువాఁడు,
నుభయ భాషావిదుం • డురుగుణి బసవాంబ
కాశేషయకు నల్లుఁ • డైనవాఁడు,
శుభగుణ వేంకట • సుబ్బాంబికా చిత్త
పంకేజ భానుఁడై • పరగువాఁడు,
నాత్మధర్మ మెఱింగి • యాచరించెడువాఁడు
పాకయాజియనంగఁ • బడినవాఁడు,

తే॥గీ॥ వెలది వేంకట సీతాంబ, • వేంకట శివ
కామసుందరి, రంగాంబి • కా, సరస్వ
తులను గోదండపాణిని • దుల్యమైన
కూర్మిఁ గాంచి ముదమ్మునఁ • గులుకువాఁడు. ౨

తే॥గీ॥ ఐన "హనుమంతరాయ శ•ర్మాభిధానుఁ"
డలర వచ్చాంధ్రము నిరోష్ఠ్య • మగుచు నొప్పు

"దాశరథిశతక" రచింప • దానికేను
"సుజనరంజని" యను టీక • నొకవ్రాసి॥ ౩

తే॥ గీ॥ నేర్పులాగున మీచేతఁ • జేర్చినాఁడ
దీనిఁ గని చదువరులు సం•దియము వాసి
యర్థము గ్రహించి సంతస • మందుఁడంచు
నబ్బరాజు సీతారామ • యాఖ్యుఁ డనియు. ౪

క॥ హనుమఁడు రచించె రామా
యణము "సుజనరంజనముఁగ" • నలరఁగ మున్నే
హనుమఁడు రచించె రామా
యణము "సుజనరంజన" మిపు • డటు గాదన్నే?॥ ౫

ఇట్లు బుధజనవిధేయుఁడు,

అబ్బరాజు సీతారామశర్మ

పరశురామచరిత్రా ద్యనేకాంధ్రగ్రంథకర్త.



శ్రీ వృషసంవత్సరాశ్వయుజ శు ౫॥ సౌమ్యవాసరానూరాధా
నక్షత్రమున జననము.



గ్రంథకర్త:

అ. హనుమంతరాయశర్మ పాకయాజి.

# శ్రీ రాజశేఖరస్తుతి.



శ్లో॥ శ్రీమద్ధరాత్మజేశాయ
హార్యంబకధరాయచ
శరణాగత రక్షాయ
కృపామృతనిధే నమః.

## హనుమస్తుతి.



శ్రీ వేమన గ్రంథాలయము,
తెంప్రోలు.

క॥ అనునగు పరవస్త్వర్థము
హనుమచ్ఛర్మాభిధానుఁ • డౌ ననఁగ నిరా
శను జలిపిన కృతులను వసు
ధను నిలిపిన రామభక్త! • ధర్మాసక్తా!



# పీఠిక.

చదువరులారా!

శ్రీశైల, కాళేశ్వర (కాళహస్తి), దాక్షారామంబు లను నీ త్రిక్షేత్రంబులు, పుణ్యక్షేత్రంబులు నాఁబడు. సుక్షేత్రంబులైన యీ త్రిక్షేత్రంబులం బవిత్రంబులై వెలుఁగొందు లింగత్రయంబు త్రిలింగ సంజ్ఞ న్వ్యవహరింపంబడు. ఈత్రిలింగమధ్య ప్రదేశంబు, త్రైలింగ దేశంబు నాఁబడు. తత్త్రైలింగదేశనివేశులై తనరారువారు, త్రైలింగ్యులనియు, నాంధ్రులనియు, వారు వాడఁబడుభాష త్రైలింగభాష (త్రిలింగ=తెలుఁగు)యనియుఁ బలుకంబడు. ఈవిషయములను గుఱించి అప్పకవీయమున నిట్లు వ్రాయంబడినది.

క॥ శ్రీశైలతిధర కాళేశ్వర। దాక్షారామంబు లనఁగ॰వనరారెడు నీ
త్రిక్షేత్రంబుల లింగము। లీక్షితిని ద్రిలింగసంజ్ఞ॰నెన్నిక కెక్కెన్.

తే॥ తత్త్రిలింగనివాసమై॰తనరుకతన।నాంధ్రదేశంబు తాఁ ద్రిలిం॰గాఖ్య
మయ్యెఁ। దెలుఁగగుచుఁ దద్భవము దాని॰వలన బొడమె। వెనుకఁ
గొందఱు దానినె ॰ తెనుఁగు నండ్రు.

తత్త్రైలింగదేశస్థులయిన విద్వన్మహాకవీంద్రబృందంబులవలన రచింపబడి ఆంధ్రపద్యగద్యాత్మకంబు లయిన గ్రంథరాజంబులలోఁ గొన్ని రసప్రధానంబులనియు, మఱికొన్ని చిత్రప్రధానంబులనియు ద్వివిధంబులుగా రాజిల్లు.

<u>రసప్రధానంబులు:</u>—సర్వజ్ఞుఁ డనిపించుకొన్న సోముని హరివంశాదులు ఈతెగలోఁజేరినవి. ఇందుల కక్కబ్బమ్మలోని పద్యము నెత్తిచూపెద.

మ॥ అరిఁజూచున్ హరిఁజూచు సూచకములై॰ యందంద మందారకే
సరమాలామకరందబిందు సలిల॰స్యందంబు లందంబులై
తొరగం బయ్యెదకొం గొకింత తొలఁగం॰దోడ్తో శరాసారమున్
దరహాసామృతసారముం గురియుచుం ద॰న్వంగి కేలీగతిన్.

ఇతనితరువాతివాఁడైన బమ్మెర పోతరాజకృత భాగవతమున నిట్టి పద్దెమె కలదు చూడుఁడు.

మ॥ పరుఁజూచుఁ బరుజూచు నొంప నలరింపన్ రోషరాగోదయా
విరతభ్రూకుటి మందహాసములతో • వీరంబు శృంగారముం
జేరగం గన్నులఁ గెంపుసొంపుఁ బరగం• జండాస్త్రసందోహముం
బరసాలోక సమూహముం నెఱవుచుం•జందాస్య హేలాగతిం

చిత్రప్రధానంబులు:—ప్రబంధ రాజ వేంకటేశ్వర విలాసాదు లీరెండవ తెగలోనివి. ఇందుల కా గ్రంథ రాజములోని పద్యము నొక్కదానినిఁ జదివి చూడుఁడు.

చ॥ తగున నృపాలకన్యలకు • దవ్వులనవ్వులబువ్వులాట లీ
వగలఁజరింప నిందుఁ దగ • వా మగువా మగవార లుండఁగా
మగుడిపురంబుజేర జను•మా వినుమా యనుమానమేల నీ
సొగసు విలాసమందమును • సొంపును నింపును పెంపుమీరగన్.

చిత్రప్రబంధంబు లర్థచిత్రంబు లనియు, శబ్దచిత్రంబు లనియు, నుభయచిత్రంబు లనియు ముత్తెఱంగుల విలసిల్లుచుండు. అందు ద్వ్యర్థి, త్ర్యర్థి మొదలగు నర్థచిత్రంబులుఁగల రాఘవపాండవీయాదు లీ తెగలోఁ జేరినవి. అర్థచిత్రంబునకు రాఘవపాండవీయముచూడుఁడు.

క॥ ఏనుంగని కరమరయక।పూనితిఁగాకిట్టియెడలఁ బోఁనగునే? యేయం
గానమె కాలనియమగతి। తోనా వేట మునియుగముఁద్రుంగించెదుదన్

శబ్దచిత్రములు:—యమకాదిశబ్దవైచిత్ర్యమ్ములంగల వసుచరిత్రాదు లీ తెగలో చేరినవి. ఇందుల కక్కబ్బమ్ములోని ఈక్రిందిపద్య మ్ము నుదాహరణమ్ముగఁ గైకొనుఁడు.

ఉ॥ నా కులదైవతమ్ము లల•నాకులభూషణ మీల తాంగి, మే
నాకుల భూధరేంద్రుల య • నాకులనిర్మలభాగ్యరాశి, మై
నాకులముద్దుకూతురు వి • నాకులకోడ లనంగఁ దెల్పి, నా
నా కులపాలికల్ పొగడ • నాకుల మొ్రక్కఁగఁ బంచెఁ గన్నియన్.

ఈతని తరువాతి వాఁడైన కాణాదము పెద్దన సోమయాజికృత ముకుందవిలాసములోని పద్దెముంజూడుఁడు.

ఉ॥ కౌనన కౌ నభంబుసిరి • కావిజేగా విలసిల్లు మోవి కిం
పానఁగఁ బానకంబు సమ • మా నన మాననవిల్తుమేనమా
మే నన, మేననం గనక•మే నన మీనననఁ గన్గవం దగుఁజా
వేనలి వేనలిన్ విరుల • వేయుఁజువే యువతీమతల్లికిఁజా.

ఉభయచిత్రింబులు:—అనులోమము చేతను విలోమము చేతను శ్లోకంబు లగుచుండ వానియందుఁ దిరుగ రెండర్థంబులు తోఁచుచుండు రామకృష్ణానులోమ విలోమకావ్యాదు లీమూఁడవతెగలోఁ జేరినవి. ఇందుల కష్పొత్తమ్మునం జూడుఁడు.

శ్లో॥ తంభూసుతాముక్తి ముదారహాసం।వందేయతో భవ్యభవందయాశ్రీ
శ్రీయాదవంభవ్యభతోయదేవం।సంహారదాముక్తిము తాసుభూతం॥
శ్లో॥ చిరంవిరం చిర్నచిరం విరంచిః । సాకారతాసత్య సతారకాసా
సాకారతాసత్య సతారకాసా । చిరంవిరం చిర్నచిరం విరంచిః॥

శబ్దచిత్రింబులు:—గర్భకవిత్వమనియు, బంధకవిత్వమనియు, నియమకవిత్వమనియు ముత్తెఱంగుల నలరారు. గర్భకవిత్వము. ఒక పద్యమునం దొకటిగాని యంతకంటె నెక్కుడుగఁగాని పద్యము లిమిడియుండి, లక్షణోజితములై పైకొకే పద్యముగాఁ గనుపించినను, విడిగ దీసి చదివినచో వేరువేరు పద్యములుగా నగునది గర్భకవిత్వము నాఁబడు. ఇందులకు నప్పకవీయమునందలి ఈపద్యము జేదువుఁడు.

చ॥ నరహరి కేశవా వనజ•నాభ రమాధవ వంశహస్త బం
ధురసుగుణాకరా దురిత•దూర జనార్దన దోర్బలాఢ్య గి
ర్వర గిరిజస్తుతా మురహ • రాసుర పూజిత ముఖ్యపాద సుం
దరపురుషాగ్రిణీభుజగ • తల్పశచీపతిపుత్రిరక్షణా॥

బంధకవిత్వము:—శక్తికొలఁది నామగోపనములనుంచి చక్రి, స్యందన, భుజంగ, పుష్పమాలికాది రీతులఁ బద్యములం దిప్పివ్రాసిన బంధకవిత్వము నాఁబడు. ఇందులకుఁ జిత్రికవి సింగరార్యకృత బిల్హాణీయము నందలి చక్రిబంధము.

శా॥ ధన్యాస్సిం హాభచంద్రకీర్తి వరపి•ద్యాపండితార్యక్రిమా
గణ్యాగ ర్వభసంజయా శివదము•క్తా కృత్ప్రిగం క ప్రిభూ

జన్యా రా జితభూరిశాత్రవ సుభ్రాజ్జావిక్రమా వి క్రమా
మాన్యారా ధనత్యాగ భోగ జయధామా నవ్యభాగోత్తమా॥

నియమకవిత్వము:—ప్రాసనియమ మనియు, నక్షరనియమ మనియు, నిరుదెఱంగులం బరఁగు.

ప్రాసనియమము. సమ, దుష్కర, ద్వి, త్రి, చతు, ర్లాటాను ప్రాసాదు లనేకంబు లనేకగ్రంథ రాజంబుల రాజిల్లుచున్నయవి. కావున వాని కన్నింటికి నుదాహరణంబు లీయమికిం గనక యొక్కలాటాను ప్రాసంబునకుమాత్రము మత్కృత కవికర్ణపేయమునందలి యీక్రింది పద్యము నుదాహరణముగాఁ గొండు.

చ॥ మెలఁతల మైనుయిం బెనఁగు • మేనులు మేనులు, మించుబోండ్లగు
బ్బలసిరి చెందనంబలఁదు • బాహులు బాహులు, పూవుబోండ్ల క
న్నులసిరిగుల్క ముద్దుఁగొను • నోరులు నోరులు కూర్మిబోంట్ల సే
టిలఁగల కాఁ ముంగలయు • తీవ్రలు తీవులువో తలంపఁగన్.

అక్షరనియమము. ఇప్పుడు నాచేతవ్రాయఁబడిన ఈక్రొత్త పొత్తంబు నీ నియమకవిత్వంబులోనిదిగాఁజెప్పనొప్పు. ఇందు నచ్ఛాంధ్ర, నిరోష్ఠ్య, నిర్గద్యము లను నియమత్రయము విరాజిల్లుచుండు. ఇందులో మొదటిది.

2 అచ్ఛాంధ్రము:—ఈయబ్బురంపు బాసకుంగలవర్ణంబు లెవ్వి యనగా, (అఆ, ఇఈ, ఉఊ, ఎఏఐ, ఒఓఔ, ఁ, ం, క, గ, చ, చే, జ, జే, ట, డ, ణ, త, ద, న, ప, బ, మ, య, ర, ఱ, ల, ళ వ, స, హ) అని ముప్పదియేడు. ఈ యచ్చరములచేత మచ్చుపైటి మెచ్చువచ్చు బాస యే తెలుఁగుబాస నాఁబడు. కాని మనభరతఖండమునఁ బెక్కుదేశ ము లక్కడక్కడఁ డెక్కుమీరి యొక్కొక్కదేశమ్మున కొక్కొక్కబాస వాడుచుండుటంబట్టి ప్రతిభాషలో దేశీయపదములని కొన్ని పదములం గాలానుగుణమ్ముగ మహాకవులువాడినట్లె ఈ తెనుంగుబాస లోఁ గూడఁ గొందఱు కవు లట్లు ప్రయోగించుచుండిరి. చూడుఁడు.
"సీ॥ బిజమాడుదేవర•నిజకృపామహిమఁ జెన్నారునాయిల్లు బి•డారుసీ
ను" అని కాళహస్తిమాహాత్మ్యకృతికర్తయైన ధూర్జటిమహాకవియు;

"శా॥ రాయగ్రామణి కృష్ణరాయభవ దుగ్రక్రూర ఖడ్గాహిచే
రాయంబూడ్చి కళింగదేశనృపతుల్ • రా నిర్ఝరీ పోషణీ
మాయాభీకుముటూకుటోకు కుహూటూ • మాయాసటాజాహరే"
అని పెద్దన్నయు;

"సీ॥ ఇమ్ములై మరుహజా•రమ్ములైపొదలుండ" అని రామరాజభూషణుఁడు
ను; కన్నడహిందూస్థానిభాషలను ప్రయోగించుచున్నారు. దేశీయ
పదములే యననేల? కొన్ని తత్సమపదములనుగూడ శుద్ధాంధ్రగ్రంథ
ములం బ్రయోగించువాడుక కలదు. అవే వనఁ దిలకింపుఁడు.

"ఉ॥ రక్కసిరాయ! యేవినుము • రంభను మిక్కిలినవ్వుకత్తెనై"
అని తనయయాతిచరిత్రమునఁ బొన్నిగంటి తెలగనార్యుఁడును;

"సీ॥ శార్దూలముఖుఁడీలె • స్తనితహస్తుఁడు సెల్లె దీర్ఘజిహ్వుఁడు గడ •
తేరిపోయె । శూలదంష్ట్రుఁడుమ్రగ్గెఁ • గూలెఁ బింగళనేత్రు డశ్మ
వక్షుఁడు దెగ • టారిచేనియె"

అని తనరామాయణమందుఁ గూచిమంచి తిమ్మకవిసార్వ
భౌముఁడును; బ్రయోగించుటకుఁ గారణంబేద్దియా? యని వారిపాత్త
ము లారయఁబ్రప్రథమమున యయాతిచరిత్ర కృతికర్తయైన పొన్నిగంటి
తెలగనార్యుఁడీవిషయమై కొంతవట్టుచింతించి తుద కీవితముగ్రన నిర్ణ
యించుకొన్నవాఁడయ్యె.

క॥ తెనుఁగుననుమారుబేల్లిడి। పెనిచిన వినఁగూడదనుచు•బిరుదులుపేళ్లం
మును పేల్పుబాసవెంబడి।నుసిచెడఁగాదనకుఁడయ్య•యుల్లమునందుక్

దానిన ప్రమాణముగాఁ గొని నాఁటినుండి నేఁటివరకు నచ్చతె
నుంగుగబ్బంపుగూర్పరులెల్ల రీతెనుఁగుబాసలోలేని వర్ణకలిత లలిత పద
మిళితములైనపేరులు బిరుదుపేరులు, నచ్చాంధ్రమునఁ బ్రయోగించు
చుండిరి. అట్లు ప్రయోగించినవారిలో మొదటివాఁడు తిమ్మకవిసార్వ
భౌముఁడు. ఆయన గ్రంథస్థపద్య మిదివరకెత్తిచూపితి. ఇంక నటుతరు
వాతివారిలో నేనెఱిఁగినంతవరకు మఱింగంటి సింగరాచార్యులవారు
రెండవవారు. వీరు శుద్ధాంధ్రనిరోష్ఠ్య సీతాకళ్యాణమును వ్రాసిరి.
ఇందుఁ దెలగనార్య, తిమ్మకవిరాయలకంటె నిరోష్ఠ్యనేమ మెక్కుడుగఁ

బెట్టుకొనిరి. కాన దాని కనుగుణ్యముగఁ బేరులు సాంస్కృతికపదము లతో నమర్చుకొని వ్రాసిరి చూడుఁడు.

తే॥ "ధాతృనందనజటి" యానఁ • దాల్చి శాంతఁ । గలయనా"ఋష్యశృంగర్షి" • గడఁకఁదెచ్చి । చేరిజేన్నాన కెవగల్గి • చేయసాగెఁ । జాలసిరి నిండఁ జాలర • దాలదిట్ట॥

కావున నే నీకబ్బంబున సందర్భానుసారంబుగ నుంచి పద్యంబుల నల్లఁబడిన శ్రీ, కౌండిన్యర్షి, ఆజి, దశరథధరాధినేత, ఋశ్యశృంగర్షి దాశరథి, సాకేతనగరి, సీత, ఆంజనేయ, కేసరి, ఆర్కి, ఐంద్రి, ఘటకర్ణ త్రిదశాంతక, నరాంతక, అతికాయ, అక్ష, త్రిజట మొదలైన పదములు సాధువులే కాని, అసాధువులు కావని పెద్దలెఱుంగునది.

యయాతిచరిత్ర: ఇక్కబ్బం బబ్బురంపుశైలిం గుబ్బటిల్లిన రసం బుల, నతిమనోహరంబుగఁ బొన్నిగంటి తెలగనార్యుఁడు వ్రాసినవాఁడు.

ఈమహాకవికిఁ దరువాతివాఁడైన కాకునూర్యప్పకవిచంద్రుఁడు దనయప్పకవీయమున, నీగ్రంథ రాజమునందలి (యయాతిచరిత్ర) దైన "సీ॥ వలఁబడ్డజక్కవల్ • వలెనున్న జిలుగుపయ్యెదలోని గుబ్బపా • లిండ్లు మెఱయ"

అనుసీసపాదము లక్ష్యముగాఁగొనిన హేతువున నీకావ్యము సుమారుగ ౩౦౦సంవత్సరములకుమున్ను వ్రాసినదనిన సత్యమున కెంతయు దూరము కాదు. ఇది యమీనుఖానురాయఁ డనుతురకదొర కంకిత మీఁబడినది. ఈ కావ్యరత్నము శుద్ధాంధ్రగ్రంథములఁ బ్రాశస్త్య యముతో విరాజిల్లుచున్న యది.

శుద్ధాంధ్ర రామాయణము. ఇది అడిదము బాలభాస్కరకృతము. ఈయన కుమారుఁడైన సూరకవికృత కవిసంశయ విచ్ఛేదము.

"చ॥ నిగి డిరువైపుల న్మిగుల • నేఁటయి నీటయి వీటికోపులక్"

అను చంపకమాలికా పాదమొక్కటి కానఁబడుటయె తప్ప మిగి లిన గ్రంథమంతయు నామమాత్రావశిష్టముగ నశించెను.

నీలాసుందరీ పరిణయము. ఇది కూచిమంచి తిమ్మకవికృతము. ఈతని కృత రామాయణ మంత, ప్రౌఢము కాకపోయినను మృదు మధురపద సంపదలం బొదలినది.

రామాయణము. ఇది పైకవితల్లజునిచే వ్రాయఁబడినదై యన్ని వితముల మిన్నయై చెన్నుమీరి అచ్చతెనుఁగుకబ్బంపురతనంబునా నొప్పుచున్నది.

అచ్చాంధ్రభాగవతము: ఇయ్యది అల్లమరాజు రామకృష్ణకవి కృతము. దీనిశైలిచవఁ తాఁ గాదుల నారయుటకు గ్రంథ మంతయుఁ జిక్కక పోయినను, కవిచరిత్రములోని ఈక్రిందిపద్యమును దిలకించిన నిది ప్రౌఢతమమైన కావ్యమని తోపకమాన దని తలంచెద.

"సీ॥ కూఁకటిమూలడాల్ • గొనబెల్ల నవలించి జెమిలిముక్కాలిరా • సొరు కుంచి" ఇఁకమత్సమకాలీనులైనవారిపొత్తము లనేకములుకలవు. వానిలో నాయెఱిగిన వానిని, ముందఱ నిరోష్ఠ్యమును గూర్చి వ్రాయునెడ వక్కాణించెద.

8 (ఎ) ప్రాచీను లచ్చతెలుఁగుకబ్బములు వ్రాయుచున్నను స్వకీయమిశ్రప్రబంధముల నానియమముచేతఁ బద్యము లల్లువాడుక కలిగి యున్నది. ఎట్లన్నఁ జూడుఁడు.

"ఉ॥ ఏనికతోలు పచ్చడము • నెమ్ముల గుబ్బసరమ్ము లంపపూ"
అని నాచన సోమనాథుఁడు తన యుత్తరహరివంశమునను;

"ఉ॥ కాటుకకంటినీరు చనుకట్టుపయింబడ నేల యేడ్చెదో"
అని బమ్మెర పోతనామాత్యుమణి తన చాటువు నందును;

"ఉ॥ ఏనిక మోముతాల్పెలుక • నెక్కిన రావుతు రాజుసారసే"
అని శ్రీనాథమహాకవి తన భీమఖండపురాణమందును;

'సీ॥ వెడదకన్నులవాని • వేనాఁడుముల వాని వ్రేతలవలపించు • వెరపువాని'
అని తెనాలి రామకృష్ణకవినాథుఁడుదనపాండురంగమాహాత్మ్యమందును.

"సీ॥ కొప్పునఁజుట్టిన • గొజ్జంగి విరిదండ నటనతో వీపున • నాట్యమాడ"
అని కంసాలి రుద్రయమహాకవి తన సరసజనమనోరంజన మందును;

"సీ॥పంటముత్తైదువగంటలమొలనూలుపడమటిదొరయేలునిడుదప్రోలు
అని కనుపర్తి అబ్బయామాత్యమణి తన పురూరవశ్చరిత్రమునను!

"ఉ॥ ఆఁటలు పాఁటలుంగలుగు • నందఁపుఁగందఁపుఁగూటవాటముల్"
అని కాణాదము పెద్దన సోమయాజి తనముకుందవిలాసమునను;

ఈవిధముగఁ బలుదెఱంగుల వ్రాయుచుండఁగా నిటీవలి కవి వృషభులు తన్నియమముతోఁ బొత్తమ్ముల హత్తుకొని వ్రాయ మొదలిడిరి.

మిశ్రకావ్యమ్ములం దెన్నివిధములయిన చిత్రతమములయిన పద్దెములు జూపట్టుచున్నవో శుద్ధాంధ్రకావ్యములఁగూడ నట్లె విరాజిల్లుచున్నవి.

"సీ॥ కప్పుకుత్తుకవాఁడు • గాలిమేఁతరియందె
జోఁటివాఁ డఱమెయి • జోఁటివాఁడు
విన్నుకొమ్ముమ్రడివాఁడు • వెండిగుబ్బలిగూడె
మేలువాఁ డుడివోని • మేలువాఁడు
గిత్తతత్తడివాఁడు • బుత్తిముత్తులిడంగ
జాలువాఁ డౌదల • జాలువాఁడు
మొనలకైదువవాఁడు • మినుకుకైవారముల్
మెచ్చువాఁ డనిబీర • మెచ్చువాఁడు
తే॥ గీ॥ సంకుజగివాఁడు వలకేల • జింకవాఁడు
ప్రాఁతమగవాఁడు వెలిబూది • పూఁతవాఁడు
మిక్కుటంబగు మక్కువ • నొక్కనాఁడు
దనరఁ గలలోన మ్రోలఁ గన్గొనఁగనయ్యె."

ఇట్టిపద్యములు యయాతిచరిత్రమునఁ గానరాకున్నను శుద్ధాంధ్రరామాయణాది గ్రంథములం గానుపించును. యయాతిచరిత్రమున

"సీ॥ జగములు గలిగింపఁ • జాలు నల్వకుఁబుట్టి
నిమ్మైన పొక్కిటి • తమ్మివాని
తొలుకారుమొగులుపై • నలరు మించనమేనఁ
గడునొప్పు పసిడిపచ్చడమువాని
గలిమిదేవేరియక్కలికితోఁ బుట్టిన
కెంపు నక్కనదాల్చు • సొంపువాని
గొలువవచ్చిన ప్రొద్దు • నెలయు నాఁ జేదోయి
జుట్లుగ్గ జిందంబు • సొగయువాని

గీ॥ నాలిఁగన్నయ్య దనయంప • కోలముల్కి
కట్టకడ నొంపమించిన • కడిమివానిఁ
బ్రాఁతచేదువులఁ దుదల నేర్పడఁగ నొప్పు
నడకగలవానిఁ దమబ్రాతి • నడచువాని."

ఇట్లనేకపద్యంబు లొప్పియున్నయవి. ఇంక సిటీవలివారు కేవల పండితామోదకరంబైన యయాతిచరిత్రశైలింబోనాడి శ్రుతిమనోహరమైన రామాయణశైలిం బూనినవారైరి.

"సీ॥ గ్రుడ్డుకానుపుఱేఁడు • గ్రుడ్డుకానుపుతేఁడు। గుఱ్ఱంబుపానుపై •
కొమరు మిగుల"

అని ఇత్యాదిపద్యముల వ్రాసిన తిమ్మకవింగాంచి కం॥ వీరేశలింగము గారు తమ రసికజనమనోరంజనమున

"సీ॥ పక్కిగుఱ్ఱపురౌతు • పక్కిగుఱ్ఱపురౌతు దాయయుకొడుకునై •
తళుకుగుల్క"

ఉ॥ నాయనుఁగున్వెలంది తగు • నాయను నీవెత సైచువాఁడనే।

ఇట్టిమనోహరములైన పద్యము లేకాక వీరికవనమున సౌకుమార్య గుణమును సూచించు పద్యమున్నది చూడుడు.

ఉ॥ చెందొవవిందుదండడిని • జిందర వందర చెంది కుందఁగాఁ
జిందురుచిందఁ గొందలము • చెందఁగి డెందముకందుఁ దందఁపుం
గెందలిరుం దగం దొడుగఁ • గ్రిందుపడందగు పొందికం దొగల్
సందడిచిందఁ దుందుడుకు • చెందముఁ బొందివెలంది వందురున్.

ఇట్టిపదలాలిత్యములై శ్రుతిపేయములైన పద్యములు అయ్యన కోట పార్థసారథి కృత సత్యవిజయము (హరిశ్చంద్రోపాఖ్యానము)న వేనవేలున్నయవి. అయిన నొక్కపద్యమున నొక్కపాద మిం దెత్తి వ్రాసెదను.

సీ॥ కడిమిరావులదండ • నడరనుంటిమికాన
గడిమిరావులఁదండ • నడరఁగలిగె

3 (బి) అచ్చాంధ్రమున నైఘంటికగ్రంథములందునానార్థవర్గులున్నను శుద్ధాంధ్రద్వ్యర్థికావ్యములుగాని, పూర్ణశ్లేషకావ్యంబులుగాని నేటివరకు వెలువడలేదు. కాని రామాయణమున

"సీ|| పలుమరు జేలువతాం వులఁజేరి పొరలుచు
వంకరవడలచే • వరలి యరిది"

అనియెడు శ్లేషప్రధానపద్య మొక్కటికలదు. ఇట్టిపద్దెములతోఁ దెలుఁగుబాస వాసిఁజెందె.

(4) అచ్చాంధ్రమునకు నైఘంటికగ్రంథము లత్యల్పముగ నుండినవి. అందు మొదటిది పైడిపాటి లక్ష్మణామాత్యమణికృతాంధ్రనామ సంగ్రహము. రెండవది అడిదము సూరకవిప్రణీతాంధ్రనామశేషము. ఇందు మొదటిదానను లేని తెనుఁగుపదాల్కొన్ని గలవు. మూఁడవది కస్తూరి రంగకవికృత సాంబనిఘంటువు. ఇది యాంధ్రనామసంగ్రహమువంటిదె; కాని యంతనిర్దుష్టమైన నైఘంటువు కాకున్నయది. నాల్గవదిగణపవరపు వెంకటకవికృత వేంకటేశ్వరాంధ్రము. ఇది నిఘంటువుల మిన్నయైనదె. అయిదవది మాతృభూతస్వామి భర్తగాను, కోటి వెంకనార్యుఁడు గర్తగాను గలఆంధ్రభాషార్ణవము. ఈపొత్తమున కిది సార్థకనామమైయున్నది. దీని నాంధ్రామరమందురు. అమరమునసున్న ట్లిందువర్గములలోఁగల కాండత్రయముకలదు. ఇం దవ్యయవనౌషధి నానార్థవర్గువులు విపులముగా వ్రాసియున్నవి. ఆరవది లక్ష్మీనారాయణీయ మనుపర్యాయపదశుద్ధాంధ్రనిఘంటు వొక్కం డిటీవల వెలువడినది. వీనియాధారమున శుద్ధాంధ్రగ్రంథములు వెలువడుచున్నవి.

5 (ఎ) నిరోష్ఠ్యము. ఈనియమము బహుకాలమునుండి ప్రాచీనులవలన వెలుపులబాసలో వాడబడుచున్నది. అందు నక్కడక్కడ యొకటి రెండుశ్లోకంబులు దక్క పుస్తకమంతయుఁ గాని, కొంతయు గాని యెవ్వరు నిరోష్ఠ్యమున వ్రాసినట్టు కనుపట్టదు. కాని మొట్టమొదట సంస్కృతమున నీనియమము నూనినవాఁడు దండిమహాకవి. ఈకవితల్లజుఁడు తన దశకుమారచరిత్రమున నొక్క యుచ్ఛ్వాసమంతయు నిరోష్ఠ్యమున వ్రాయుటయేకాక యట్లు వ్రాయుటకుఁ గారణముకూడ నుడివినాఁడు. "వక్తయగు మంత్రిగుప్తుఁడు లలితవల్లభారభస దత్తదంతక్షత వ్యసనవిహ్వలాధరమణి" యయి యుండుటచేతఁ బెదవు లొండొంటితో నొరసినఁ గష్ట మను తలంపున నట్లు చెప్పఁబడెనని నుడివెను. ఇందు ఉ ఊ ఓ ఔ ప ఫ బ భ మ లు

విడువఁబడి యున్నవి. కాని వకారముమాత్రము గ్రహింపఁబడినది. ఉ ఊ ప ఫ బ భ మ లు కేవలోష్ఠ్యములు. (ఉపూపధ్మానీయానా మోష్ఠౌ) ఓ ఔలు కంఠోష్ఠ్యములు. (ఓదౌతోః కంఠోష్ఠం) వకారము దంతోష్ఠ్యము. (వకారస్య దంతౌష్ఠం)

5 (బి) ఇట్లు వేల్పులబాసం జెన్నుమీరియున్న యిన్నియమమ్మునఁ బ్రప్రథమమున వైష్ణవశిఖామణియైన మఱింగంటి సింగరాచార్యమణి "దశరథ రాజనందనచరిత్ర" మనునిరోష్ఠ్యరామాయణమహాకావ్యము నొకండు వ్రాసిరి. చూడుఁడు.

చ॥ కరిఘటలేల, చిత్రగణి • కాచ్ఛటలేల, హిరణ్యశాటికా
హరిధన ధాన్యరత్న ఘటి • తాచ్ఛదలంక్రియలేల, నల్దిశల్
స్థిరగతి నేలఁ గాఁదగిన • తేజదియేల, యనేకచర్యలన్
సిరిఁ గలయట్టి సంతతిని • జెందిన యాఁయెడ లెస్స లన్నిటన్.

ఈకవిసింహుఁ డింతటితోఁ దృప్తివహింపఁజాలక మిశ్రాంధ్ర వాణింబోలె, అచ్ఛాంధ్రవాణింగూడ, నీనియమమున నడిపింపనెంచిన వాఁడయి యాశ్వాసాద్యంతపద్యములు, నవతారికయు మిశ్రమకావ్యం బులంబోలె వ్రాయుచు నిరోష్ఠ్యాచ్ఛాంధ్రములకు తామేర్పరచిన వర్ణ సమామ్నాయ మీక్రిందిలాగునఁ దెల్పె.

"తే॥ అరయఁగ గ చ జ ట డ త ద • నాయిలసహ
రద్వయమె కాని యొండక్షరములు చేరవు
మఱియు నౌష్ఠ్యోత్వములు కొమ్ము • మానుడియును
వలవ దామీఁద సురభాష • నిలుపరాదు."

అని ఇట్లు నియమమేర్పరచి నిష్కళంకముగ శుద్ధాంధ్రనిరోష్ఠ్య సీతాకళ్యాణ మను ప్రొత్తమును వ్రాసిరి.

మ॥ జిగిచేనక్కట్లసియాఁడఁ దీగయిన లే • చెక్కిళ్లచెక్కిన్ నిగ
న్నిగ లీనంగఁ గడిందికంటి నెఱిడాల్ • నిండంగఁ గైచిన్నియల్
తెగనైన నల్దెసలాని చేకఁగ జికిల్ • నేయన్ నెఱాసి గ్గదం
దగలన్ రానెలఁజేరి, కాళ్ళకడ చెం • తన్నాగిలెం జేడెతాన్.

ఈకరణి, ఉఊ ఓఔ ప ఫ బ భ మ లతోఁబాటు వకారముం గూడ వదలి నిరోష్ఠ్యగ్రంథములను వ్రాసిన వీరినిఁగాంచి, కొత్తలంక

మృత్యుంజయుఁడు మిశ్రగ్రంథమున నిరోష్ఠ్యనలరాజచరిత్ర మను గ్రంథమును వ్రాసెను. ఇదియు నిర్దుష్ట కవనమే. వీరిరువుర కుపబలముగఁ బైవ్రాసినసూత్రముల కనుగుణ్యముగాఁ గొందఱు మహాకవులు పూర్వమున అ ఆ ఇ ఈ ఎ ఏ ఐ ఁ ం లతోఁ గూడిన క గ చ చే జ జే ట డ ణ త ద న య ర ఱ ల ళ స హ లు నిరోష్ఠ్యములనియును, ఉ ఊ ఓ ఔ లతోఁ గూడిన విశిష్టహల్లులు ప ఫ బ భ వ లును కేవలోష్ఠ్యము లనియు నిర్ణయించినవారయి కేవలోష్ఠ్య పద్యములువ్రాసిరి.చూడుఁడు.

(నరసభూపాలీయము. ద్వి. ఆ 175 పద్యము. ఓష్ఠ్యకందము)

క॥ భూమిసుమ నోమరుద్రుమ! వామాప్రద్యుమ్న భాను • వంశోద్భవపో
లోమీవిభు శుభవైభవ। భీమోపమ భీమభీమ • పృథుదోర్విభవా.

శ్రీ ప్రబంధ రాజ వేంకటేశ్వర విజయవిలాసము 832 పద్యము సోష్ఠ్యభుజంగప్రయాతము.

భు॥ పయోముగ్విభా భవ్య • భాభాగ్విభావా
వయోభావయుగ్గోప • వామా విభావ్యా
భయోగోప్య మాకుంభి • పాపాపభీమా
వయోగోప వాగ్భామ• వాగ్భామ భూమీ.

ముకుంద విలాసము. తృ. ఆ. 295 సోష్ఠ్యకందము:—

క॥ భూమామా వామాభవ్య
ప్రేమానుభవాభవాప్త • పృథుభావిభవా
భౌమాభిను_త్తభామా
స్తోమ వివాహోపభావ్య • సుమనోభావ్యా!

భరతాభ్యుదయము. ప్ర. ఆ. 91 వ సర్వోష్ఠ్యకందము:—

క॥ భవవినుతోరు ప్రాభవ। భవభవ భీభీత్స్వభావ • భావ్యానుపమా
త్మవిభవ వసుప్రభుప్రభ । పవిభృత్పాపానుస్వ•పత్పద్మశుభా!

పైపద్యములలో, సు, నో, దు్ర, ద్యు, ను, శో, దు, యో, గో, కు, గ్గో, ను, గు, స్తో, హో, తో, రు, శు, ను, అను నక్షరములు నిరోష్ఠ్యములయ్యె నేని సోష్ఠ్యములని యేల ప్రయోగించినారో చెేదు వరులె యోజించునది.

5 (సి) మఱియు నిప్పమ్రహాకవిపుంగవులు వ్రాసిన నిరోష్ఠ్యపద్య ములం దన్నిఁట నిట్టివర్ణసమూహ మగపడకుండెను. ఇది యిట్లుండ వెంకయ్యవ్యాకరణమున (ఉ ఊ. ప. ఫ బ. భ. మ) లు కేవలోష్ఠ్యము లనియు, (ఒ. ఓ. ఔ) లు కంఠోష్ఠ్యము లనియు, (వ) దంతోష్ఠ్య మనియు వక్కాణించి యుండుటంజూడఁ బైకృతికర్తల నిర్ణయమునకుఁ దార్కాణగానున్నది. ఇన్ని విధముల లక్షణలక్ష్యములు కనుపట్టుచుండఁ గాకునూ రప్పకవివర్యుఁడు:

క॥ పావన పాఫా బాభా
మావాయను నారులిఫులు ♦ మఱి పద్యములో
భావింప దొరలకుండిన
భూవలయమునన్ నిరోష్ఠ్య♦ము పిసాళించున్.

అని తనగ్రంథమున వ్రాయుట కాధారమెద్దియో నాకుఁ దోప కున్నయది. అయిన నీవిషయమింకను బండితకవులు విచారింపఁదగి యున్నయది.

5 (డి) ఈయప్పకవి త్రొక్కిన త్రోవ నవలంబించి, ఈవల సంస్కృత వాణికిం బొడమిన అచ్చాంధ్రవాణి పిన్నతనము వదలి మవ్వంపుజవ్వన మున నివ్వటిల్లినతోడనె ఈనేమమున నవనాగరికులు కొందఱు నడ పింపఁబూనిరి. వీరిలోఁ బ్రథముఁడైన కూచిమంచి తిమ్మకవి తన రామాయణమున నిట్లు వ్రాసెను.

సీ॥ చెలియిక్కదిండియం ♦ దెలతేని జిగిచేఁగ
సింగాణిఁ జెరచిన ♦ చేఁగకాడ
జేడదారి నెలదండఁ ♦ చేని క్రొచ్చెరగయాళి
రాకాసిఁ జెండిన ♦ రాచకంద
తలఁగని కడగండ్లఁ ♦ దగిలి చేట్లైనట్టి
చానదేనిన నెఱ♦జాణరాయ
సీటారనేదిన ♦ నేల జేజేదంట
తేజెల్ల నడచిన ♦ దిట్టలెంక
గీ॥ తండ్రి నైనట్టి నాయాన ♦ దాటలేక
కడిది కాణాచిరాసిరి ♦ యెడలఁజేసి

హాళి కానల కరిగిన • యందకాడ
తలచే నిన్గాంచేకేఁ డాళి•గలన యింక.

ఈయనకుఁ దరువాతివాఁడైన నాయెఱేఁగినంతవరకు నిప్పటి వారిలోఁ దొలుతొల్త రావుబహదూరు కం. వీరేశలింగముపంతులు వారీమార్గము నవలంబించి, 1 శుద్ధాంధ్రనిరోష్ఠ్య నిర్వచననైషధము, 2 శుద్ధాంధ్రరసికజనమనోరంజనము, 3 శుద్ధాంధ్రభారతసంగ్రహము వ్రాసిరి. ఇందు నైషధము భారతమందలి నలచరిత్రకథను ప్రధానముగా నుంచుకొని అప్పకవిచూపిన నిరోష్ఠ్యమార్గము ననుసరించి వ్రాసిరి. ఇందలి పద్యమొం డిలకింపుఁడు.

క॥ సిరియెదఁగలదొర జేజే
దొరయు, నెలఁత నోరనుండు • దొర జేజే లె
ల్లరుఁ గొలుచుతేఁడ త్రాచుల
సరులుగలుగు జెక్కులదొర • సంగడికాఁడా!

వీరి వెనుక, మచ్చ వెంకటకవిరాయలు శుద్ధాంధ్రనిరోష్ఠ్య కుశ చరిత్ర మను ప్రబంధరత్నమును వ్రాసిరి. వీరును పంతులవారి నైషధ నియమత్రయము ననుసరించిరి.

క॥ కలికంటుఁడు, దాతయు న
త్తెలిగంటుల దొరయు జోగి • తెగలును గడు న
క్కలినిడు గండా లలఁదుక
గుత్తినేనుఁగుగొంగకొండఁ • గులికెడు తేఁడా!

ఈ తెలగాణ్యాలంపురతనంబయిన వేంకటకవి వెనుకఁ, గులాల కుల సంభూతుండయిన అయ్యనకోట పార్థసారథిశ్రేష్ఠి సత్యవిజయ నామాంతరముఁగల శుద్ధాంధ్రనిర్వచన హరిశ్చంద్రోపాఖ్యానము నానొప్పు కబ్బంపుమానికంబు నొక్కండు నబ్బురంబుగఁ, బండితకవి కర్ణపేయంబుగఁ గల్పించి వ్రాసి యచ్ఛాంధ్రవాణిం బోషించె. ఈయన తన పొత్తమున నక్కడక్కడ నిరోష్ఠ్యపద్యములు వ్రాసెను. కాని వానిని మఱింగంటి సింగరాచార్యమణి ఫక్కినే వ్రాయఁబడిన వాఁడయ్యెను. ఈయనకుఁ దరువాత దేవులపల్లి నృసింహశాస్త్రిగారు ఉ ఊ ప ఫ బ భ మ వ లను వదలియు ఓ ఔలతోఁ జేరిన విశిష్ట

హల్లులను జేర్చికొని కొంతవర కప్పకవిమార్గమును వదలియువదలఁ జాలక "అచ్చాంధ్రనిరోష్ఠ్యనిర్గద్యసారంగధరచరిత్ర" యను పాత్త్ర మును ముద్దులుమూటగట్టున ట్లొనర్చిన వారయిరి. అందలి యొక్క పద్యమోఁ జూడుఁడు.

క॥ సిరిచెలగఁగఁ దిగ కందార
నెరసింగిణి రెండొనర్చి ♦ నీఁ టలరారన్
దొరయంగ నేలకన్నెన్
సరగం గేల్గొన్న యట్టి ♦ చక్కనిజెట్టీ.

అప్పకవి చూపిన నిరోష్ఠ్యమార్గము ననుసరించి వ్రాసిన వీరేశ లింగముగారి నైషధఫక్కిని నిరోష్ఠ్యపితృశతక మను నొక్క శతక మును, దేవులపల్లి నృసింహశాస్త్రిగారి సారంగధరచరిత్రమాదిరిగ అచ్చాంధ్రనిరోష్ఠ్యనిర్గద్యనృగచరిత్ర మను మూఁడాశ్వాసముల చిన్ని పాత్త్రమును, మఱింగంటి సింగరాచార్యమణిగారి శుద్ధాంధ్ర నిరోష్ఠ్య సీతాకళ్యాణ ఫక్కి నీ ప్రకృతప్రబంధమును వ్రాసితిని.

5 (ఇ) ఒక్క నియమముతోఁ బ్రబంధమువ్రాయుట మిగులకష్ట ముగదా? ఇదియిట్లుండ నియమత్రయముతోఁ గబ్బంబులగూర్చుట ప్రయాసమగును కాదా? యని యడుగవలయునా? ఇట్టి నియమత్ర యముతోఁ బ్రబంధముల నల్లినవారయిన మచ్చ వేంకటకవిరాయలు మొదలయినవారు మిగులఁ బొగడందగువారు. ఇది యొక సాహసమా? అపంచవర్గీయముగ నవఁగాఁ గాదివర్ణంబులన్నింటి విడి, మిగిలిన "య, ర ల, వ, శ, ష, స హ, ళ" యను తొమ్మిదివర్ణంబులతో "శేషశైలేశ లీల" యను గ్రంథరత్నమును రచియించిన కాణాదము పెద్దనసోమ యాజిమహాకవిశ్రేష్ఠుం డుండ, సత్కవుల కొక యసాధ్యమగుపనియుం డునే? అపంచవర్గీయమున కా "శేషశైలేశలీల" నుండి యొక్కపద్య ముం దిలకింపుఁడు.

ముక్తపదకందము॥ సరసావంశీ సురవా
సురవారా శంసి శౌర్య ♦ శూరాశరహా
శరహారి హరిస్వరయా
స్వరయాహవలీల యాస్య ♦ వశహా సరసా.

6 నిర్గద్యము:—శ్రీమ దుభయకవిమిత్రి, కొమ్మనామాత్యపుత్ర బుధారాధన విరాజి తిక్కనసోమయాజి ఇన్నియమమునకుఁ బ్రథమమున మార్గదర్శియైనవాఁడు. కంకంటి పాపయామాత్యమణికిఁ బూర్వమీకవిబ్రహ్మ నిర్వచనోత్తరరామాయణము వ్రాసినవాఁడయ్యెను. వచనములేకుండ గ్రంథస్థకథాభాగమంతయుఁ బద్యరూపకంబుగ వ్రాయుట నిర్గద్యకావ్యము నా నొప్పు. ఇట్టిగ్రంథములు చాలఁగలవు. ఇట్లు వ్రాసినవారిలో నాకుఁ దెలిసినవాఱిలో నాంధ్రవాల్మీకి నాఁబడిన బ్రహ్మశ్రీ వావిలికొలను సుబ్బరాయకవిశిరోభూషణ కృతాంధ్రవాల్మీకిరామాయణమహాకావ్య మగ్రగణ్యమైన దని చెప్పనొప్పు. ఇందు పదునాలుగువేలపద్యరత్నములుకలవు. ఇట్టి నిర్వచనకావ్యము నింతకుఁబూర్వమే, మహామహోపాధ్యాయ కొ. వెంకటరత్నముగారు బిల్వేశ్వరీయ మని వ్రాసిరి. ఇందు మూఁడువేలపద్యములుకలవు.

7. ఈప్రబంధ మీ నియమత్రయముతో వ్రాయఁబడినదై యున్నది. ఇచ్చట మచ్చరిత్రాదు లొక్కింత ముచ్చటించిన వెనుక ప్రస్తుతకార్యాంశమునకు వత్తము. మదీయపితృపితామహాదుల జన్మస్థానము నరసరావుపేటతాలూకా చిలుకలూరుపేట యొద్దనుండు వేలూరు. నేను వృషనామ సంవత్స రాశ్వీయుజ శుద్ధపంచమీ బుధవాసరంబున వినుకొండతాలూకా వీపూరున మాజ్యేష్ఠమాతృగృహంబునఁ గలిగినాఁడ. తదాది మదీయపూర్వనివాసమైన వినుకొండతాలూకా చిరాపురాగ్రహారము శివారు కొత్తపాలెమునఁ బెరిగి పెద్దవాఁడ నయినాఁడ. తదుపరి తెనాలితాలూకా దోనెపూడినినివసించి తదనంతరము రేపల్లెతాలూకా ఐలవరగ్రామమున నారంభవిద్యాశాలయందుఁ బ్రథానోపాధ్యాయుఁడుగ నున్నవాఁడ. ప్రస్తుతము తెనాలి తాలూకా పెరవలి గ్రామమందలి బోర్డు హైస్కూలునందు నాంధ్రపండితుఁడుగ నున్నవాఁడ. ఆంధ్రపండితుఁడు వైకృతమాఘ మాహాత్మ్యాది కృతికర్తయు మజ్జనకుఁడునైన అబ్బరాజు శేషాచలా మాత్యమణియొద్ద ననవరతవిద్యాభ్యాస మొనర్చి, కవిత్వ మలవడఁజేసికొని, కొందఱిపెద్దల సత్సహవాసమున నవధానములఁ జేయనేర్చి కొన్ని యెడలఁజేసి, తత్సూ

ర్వాపరంబుల, 1 వాణీశతకము, 2 హరిహరనాథశతకము, 3 నిరోష్ఠ్య పితృశతకము, 4 అచ్ఛాంధ్రనిరోష్ఠ్య నిర్గద్య నృగచరిత్ర 5 కవికర్ణ పేయము, 6 అంబరీషచరిత్రల, నొనర్చితి. అటువెనుక శంకరకృత లక్ష్మీనృసింహ స్తవమార్కండేయకృత శివస్తవాదులు తెనిగించితి. అటుమీఁద శ్రీమత్సుగ్రీవ పట్టాభిషేక మను నైదాశ్వాసముల పద్య కావ్యము నొనర్చితి. వీనిశైలిం దిలకింపుఁడు.

క॥ తినుదానియందుఁగొంతై। ననునతిథికి నిడుటవలన • నరుఁడు ఫలముగన్
విననే పెట్టినవారికి। ననయము పుట్టుట యెసాక్షి • యనఁగా వాణీ॥

6. వాణీశతకము

క॥ సూరివరేణ్యుసిద్రోహుని। గారవమున సేన కధిపుఁ • గాఁ జేసెను గాం
ధారీతనయాగ్రేసరుఁ। డారూఢిగభీష్ము వెన్క • హరిహరనాథా!.

67. హరిహరనాథ శతకము

ఉ॥ ఊరను గుఱ్ఱలం గలసి • యొక్కట నాఁడెడుచోట నాఁటలన్
సీరను జిడ్డులాగెనసి • నిల్చి చరించెఁగఁ జెల్లునీకు, నా
తీరుననుండకున్న నినుఁ • దిట్టుదురంచలుఁ గొట్టఁజొత్తురం
చారసి సారెసారె రహి • నాడెదు తండ్రికిఁజాలరేయనున్.

6. నిరోష్ఠ్యపితృశతకము

సుగంధి॥ టక్కుకొండొనర్చి గిడ్డిఁ • డక్కఁజేసికొగ నో
తెక్కలీఁడ! కాంచెదిట్టి • తెక్కలీండ్రినంగనే
లెక్కసేయనింతయేని • లేచితేఽరోరి నీ
నక్కజత్తెఱంగి తింక • నస్నెఱంగితే యిసీ.

అచ్ఛాంధ్రనిరోష్ఠ్య నృగచరిత్ర తృ. ఆ. 15

తోటక॥ కనకాంగిరో! మోమున • గస్తురిబొ
ట్టును జారదు చీరము • డుంగదు చం
దనముం జెనులంజెడ • దాయె గన
గ్గొనితో? ధవుఁ డజ్ఞుఁడొ • కో యనవే. 6. కవికర్ణపేయము.

శా॥ కంటే మింటికి మంటి కొక్కటిగ ము • క్కంటీ! దయంగెంటి వె
న్నంటే వచ్చెడిఁ, దమ్మికంటిసుడివా • లాదచ్చికంటిం, దమిం

గంటే నాపని కాదటంటె నీక మీ•కంటెన్ రిపుం గెంటఁజాల్
దంటలేఁడని వచ్చితిం దెలియొడల్ • దఁటా! రహీం గావవే?॥

6. అంబరీషచరిత్ర

ఉ॥ చందురుతాలమేడలఁ బ•సందగు కుందవనంపువాఁకలం
గందపుఁజెట్లనీడలఁ జ•గాజిగి తమ్మికొలంకు జోడలం
గందు దురంపుటాటలఁ జో•కాటపుఁ బాటల వింతమాటలం
జందనగంధి తార కపి•చంద్రుఁడు వాలిచెలంగి రెంతయేన్.

శ్రీమత్సుగ్రీవ పట్టాభిషేకము. ద్వి ఆ. 29

ఉ॥ నేవనితందొలంగనె, వ•నింజరియింపనె, వీఁడువీడనే
లావరివీవు నావురన • లాతులుమాన్పెడు వారె, చూడు నా
లా వవనీసుతం గన కి•లంతిగవచ్చిననాఁడు వీఁడు సు
గ్రీవుఁడ! పద్మినీధవుని•కిం బ్రియపుత్రుఁడ! నీకు మిత్రుఁడా?

చ. ఆ. 153

అఁటమీఁద నీ "అచ్చాంధ్రసిరోభూష్య నిగణవ్య దాశరథిచరిత్ర" మూఁడాశ్వాసముల ప్రబంధముగ వ్రాసినవాఁడనైతి. ఇందు ప్రథమమున నవతారికాదులతోను జేర్చి బాలకాండము, నయోధ్యకాండము నరణ్యకాండములందుగలకథ సంగ్రహముగ బ్రథమాశ్వాసము సుమారు 150 పద్యములతోను, కిష్కింధాకాండము, సుందరాకాండముల గల కథ ద్వితీయాశ్వాసము సుమారు 110 పద్యములతోను, యుద్ధకాండమున గల కథ తృతీయాశ్వాసము సుమారు 280 పద్యములతోను మొత్తము 550 పద్యములకు మీఁగకుండ నా కీశ్వరుఁడిచ్చిన తెలివిఁదేఁటలతో వ్రాసితిని.

8 ఈగ్రంథముయొక్క ఆశ్వాసాదులంగల పద్యములమొదల శ్రీకారముం బ్రయోగింపఁబడినవి. అచ్ఛాంధ్రలిపులంగనుపట్టసి శవర్ణమెట్లు ప్రయోగార్హమగునని సంశయించుచెడ శ్రీ యనఁగా శ్రీనామధేయముఁగల స్త్రీయని యర్థముఁ జెప్ప శ్రీనాఁబడు నామమేర్పడుచున్నది. కాన.

క॥ తెనుఁగునను మూరుపేళ్ళడి
పెనచిన వినఁగూడదనుచు • బిరుదులుపేళ్లన్

మును వేల్పు బాసవెంబడి
నునిచెన గా దనకుఁడయ్యె • యుల్లములందుఁ. అని తెలగన్నయు,

తే॥ ఒనరఁ బేరులు బిరుదుల • దెనుఁగు సేయఁ
బోలదని మున్నె పెద్దలు • పూనిత్రోవ
సిడిరి కావునఁ గూరుపు • మిదియు నిట్లు
తెనుఁగు తెలుఁగెల్ల నేర్పుతఁ • దిమ్మప్రెగడ! అని తిమ్మకవియు,

బలికినట్లు సూత్రములు ఘోషిల్లుచున్నవి, కాన నట్లు ప్రయోగించుట తప్పుకాదని యెఱుంగునది. ఇదియునుంగాక ప్రయోగనిదర్శనములుఁగూడ కలవు, ఎట్లన్న "శ్రీనల కౌగిఁటందనియఁజేర్చి" యని మచ్చ వేంకటకవిరాయలు ప్రయోగించె. వీరు నావలె శ్రీ నామధేయస్త్రీ యని అర్థముఁజెప్పి శ్రీకారము గ్రంథాదినుంచిరి. ఇంకను జాలచంది ప్రయోగములు కలవు. కాని అవియన్నియు నిట చేర్కొనుట యనావశ్యకము.

9 క॥ తరుమక ప్రతిపదమును ప
ల్కరునరయుచు సముచితోక్త • మార్గంబులనుం
దెలుఁగులు తెలియుచు నర్థం
బెలుఁగఁగఁ దగు నుభయసంధు • లెనయుటకతనఁ॥

అని ప్రప్రథమమున "నచ్చాంధ్రనిరోష్ఠ్యగ్రంథ" రచనకు మార్గదర్శియైన మఱింగంటి సింగరాచార్యమణి నుడివినట్లు ప్రకృత గ్రంథమున నుభయసంధులు గలసియున్నవి. కాన నర్థమారయునెడ సందర్భానుసారముగ విచారింప నుభయకవులు ప్రార్థితులు.

10 ఈ పాత్రమున కథాభాగమున నక్కడక్కడ సంస్కృతపదంబులఁ దెనిగింపఁబడినవి. ఇఁతియకాక కొన్ని సోష్ఠ్యశబ్దంబుల నర్థంబు చెడకుడ నిరోష్ఠ్యముగ మార్పంబడినవి. సర్పరోముడు. ఇన్నామము సోష్ఠ్యమాటచే "గాలిదిండ్ల నెఱకలగలరక్కసి" అని నిరోష్ఠ్యముగ మార్పఁబడినది. ఇట్లె "వృశ్చికరోముఁడు" "తేళ్ళనెఱకలరాకాసి" యనియు, అగ్నికర్ణుఁడనుదాని "గాలిచెలిచాయరాకాసి" యనియు రముఁడు=లక్ష్మణాగ్రజుఁడు=లచ్చనన్నయనియు మార్పఁబడినవి.

సాధారణముగా రామపర్యాయపదముల నన్నింటిని తేఁడని, పలికయని, రాచనెలయని, నేలతేఁడనివాడితి. రావణపర్యాయపదముల లంకతేఁడని, రక్కసితేఁడని చోలత్తేఁడని చోత్తిలల గయాళియని వాడితి. కాన సందర్భానుసారముగఁ జదువరు లూహించుకొందురు గాక!

11 ఇందు శక్త్యానుసారంబుగఁ గొన్నియెడల వృత్తభేదములఁ జూపితి. మఱియు రామలక్ష్మణులు నాగపాశబద్ధులయి యున్నతరి నారదమహర్షి వచ్చి వినుతించునెడ దండకమొక్కండువ్రాసితి పాండురంగమాహాత్మ్యమునందలి దండకశయ్యననుసరించి యిద్దానిని వ్రాయనయ్యె. చండవృష్ట్యాదిదండకాష్టభేదంబు లప్పకవీయమునఁ జెప్పఁబడినవి కాన నందుఁ జూడఁదగును

12 ఈకావ్యమునందు, నాశ్వాసాంతములఁ గద్యనువ్రాయుటలో గద్య గ్రంథస్థ కథాభాగముగా నున్నను దానినిగూడ నాచేతనైనంతవరకు పద్యరూపముగనె వ్రాసి చిట్టచివర మిశ్రమభాషతో గద్యవ్రాసితిని.

13 "ఉ॥ ఎవ్వని కొంతబుద్ధి పర • మేశుఁడు దాఁగృపచేసె నట్టివై
సివ్వటిలుం గవిత్వరుచి • నేరుపుచాలిన చాలకుండినన్
నవ్యక వర్తమాన కవి • నాథులు చేకొనగయ్య మత్కృతిన్
బువ్వులుగందకుండ రస • ముంగొను తేఁటులవంటి నేర్పునన్"

అని కనుపర్తి అబ్బయామాత్యమణి నుడివినట్లు నాకీశ్వరుఁడిచ్చిన బుద్ధికొలంది నేర్పుకలిమినో లేమినో గ్రంథమువ్రాసితి. మత్సమకాలికులైన వర్తమానకవిచంద్రులందఱు నవ్యక గ్రంథపీఠికలలో నాలోపశతమ్ములఁ బోనాడి యొప్పులమట్టునకు గ్రహించి నన్నానందింపఁజేసి నాకుఁ బ్రోత్సాహముసేయఁ బ్రార్థించుచున్నవాఁడ.

విలసరము 24-2-1914

ఇట్లు విద్యార్థియుఁను,
గ్రంథకర్త.



శ్రీ మేధాదక్షిణామూర్తయే నమః.

# అచ్ఛాంధ్రి, నిరోష్ఠ్య, నిర్గద్య, దాశరథిచరిత్ర.

## ప్రథమాశ్వాసము

### అవతారిక

—ఇష్టదేవతాస్తుతిః—



శ్రీ సిరిచేత, నే, దరినిఁ జెన్నలరారఁగ నేలకల్కియం
దే, సరిఁగాన,'నట్టి నెఱి నించితి, నాఁటినెలంతకా? యనం
గా, సిరినిన్న, కన్నదని కాంచితినట్లని, సీతఁదేర్చఁగ,
న్గాసరిలేని రాచనెల యక్కటికాన జేగాలనేలెడిన్.

టీక— శ్రీ, ఇది లక్ష్మీపర్యాయనామముగా నిందు వాడఁబడియె.

నేన్=నేను, శ్రీ=లక్ష్మి యొక్క, సిరిచేతన్=సంపదచేత, దరిని=దగ్గరగా, చెన్ను+అలరారఁగన్=అందముచే నొప్పుచుండఁగా, నేలకల్కియందే=భూకాంతయందే, సరికానట్టి=ఈఁడు లేని, నెఱిన్=ప్రేమను, నించితి=(నీవు) నిండించితివి. నాఁటినెలంతకా?=నీవు హిరణ్యాక్షునిఁగొట్టు వరాహరూపమును ధరించినప్పుడు భార్యగానున్నదనియా,

అనంగాఁ=అనునప్పటికి, సిరిఁ=శోభచేత, నిన్న=నిన్నే, కన్నదని=కుమా ర్తెగాఁబడసినదని, అట్లు=ఆవిధముగా, కాంచితిఁ=చూచితిని, అని= ఇట్లుపలికి, సీతఁ=సీతాదేవిని, తేర్పఁ=సమాధానపెట్టుటకు, కల్గు= చేతనైనవాఁడు, ఆ=వెల్లడియైనవాఁడైన, సరిలేని=సమానరహితుఁడైన, రాచనెల=రాజచంద్రుఁడు, (రాముఁడు) అక్కటికానఁ=దయతో, జేగాలఁ=లోకములను, ఏలెడిఁ=రక్షించుఁగాత!

తా—నేను దగ్గరనుండఁగాఁ బూర్వపుభార్యయని భూమినిఁ బ్రే మించితివనిన సీతను, నీకుఁ దల్లియైనదని యట్లు ప్రీతినిఁజూపితినని సమాధానపరచు శ్రీరాముఁడు కరుణచేత లోకములను గాపాడును.

—♦ సీ తా స్తు తి ♦—

ఉ. నా, కల తల్లితల్లికిని, ♦ నల్లనినాతికిఁ జేరికేనఁటం,
చా, కలసంతసం, దెలియ ♦ నాఁడగనా? సిరిగద్దెఁగల్గి తా
నా, కడ నేలఁజేరి, యఁట ♦ నయ్యకడందగె; నద్దిరాయఁటం
చే, కడ నెల్లరెన్న సిరి ♦ హెచ్చిన సీత నెదం దలంచెదన్.

టీక—తల్లితల్లి=లక్ష్మి. నల్లనినాఁతి=భూమి, సంతన=విధము, సిరిగద్దె= పద్మము, అయ్య=జనకుఁడు, అనఁగా జనకమహారాజు. 2

—♦ శి వ స్తు తి ♦—

చ. తలఁగలచేఁడెయేఁడదది? ♦ దంట! చెలీ! నెలరేఁక; యెట్టిదా
నెలఁతలఁదంటసన్న? తల ♦ నిల్చినయాతనిఁ గాంచలేద? లే
నెలఁదలఁచేన్, నెలంతనన; ♦ నేననఁగాదనె దాడరాద? యం
చేలతలయేఁటి దాచేఁగల ♦ యాతని లేనెలదారి నెంచెదన్.

టీక—చేఁడె=స్త్రీ, దంట=నేర్పరి, నెలరేఁక=చంద్రరేఖ; సన్న= సంజ్ఞ అనగాపేరు, లేనెల=బాలచంద్రుఁడు, తలయేఱు=శివుని శిరస్సున నుండుగంగ, లేనెలదారి=బాలచంద్రధారి. 3

—♦ పా ర్వ తీ స్తు తి ♦—

ఉ. కాలికిఁ జేయిసాచి నెఱిఁ ♦ గాంచనెఱంగెర, జింకదారి యి
ల్లాలికిఁ దెల్లతత్తడి గ♦యాలికి రక్కసి. నీటిదారిచాల్
గాలికి నల్ల గారడి కి♦లారికి గాదిలిచెల్లెలైన యి
ల్లాలికి గిట్టజియ్య నెద ♦ నానఁగఁగన్న జేగాలతల్లికిన్.

టీక___జింకదారి=మృగధారి,(శివుఁడు) తెల్లతత్తడిగయాళి=తెల్లని సింహమే గుఱ్ఱముగాగలిగినపార్వతి, నీటిదారిచాల్=జలధరసముదాయము (మేఘములగుంపు), గారడికిలారి=మాయాగోపకుఁడు, (విష్ణువు) గిట్టజియ్య=పొట్టిదొర (వినాయకుఁడు) 4.

—• బ్రహ్మస్తుతి •—

చ॥ తెలియఁగనయ్యె నీకడఁక • తేఁటగఁ జెల్లెలిచేతఁ దల్లిచేఁ
గలయ, గయాళిచానయని • క్రిన్నన, నన్ననఁజేయ నేయెడం
దలఁగదించితన్న, నెలఁ•తా! కఱదల్చెలిఁగాఁగఁ జేసి నిం
దలలగదించి, తేనని యెఁ•దం జెలిఁజేర్చిన తాతనెంచెదన్.

టీక—బ్రహ్మ యొక్క చెల్లెలు గంగ. తల్లి లక్ష్మి. కఱదల్చెలి=పలుకులచాన (సరస్వతి). తాత=బ్రహ్మ, కడక=పూనిక. 5

—• భారతీస్తుతి. •—

ఉ. కాలికడ, న్నడం, గఱఁచే•గా నడయాడఁగ రాచేయంచె కెం
గేలి కడానికిన్నెర న•గించెడి యెల్గిడి నల్కతల్న,డా
కేలి కడంటి తేనిఁ గఱఁ•గించిన తాతనెలంతదంట, నా
తేలిక, నాల్క, లాలి, జేత • దీఁటఁగఁ దేఁటగ నాఁట లాడెడిన్.

టీక—నడ= నడక, కఱచు= నేర్చు, రాచేయంచే= రాజహంస, కడాని= బంగారము, ఎల్గు = గొంతుచేప్పుడు, నల్కతల్= చతుర్వేదములు, డాకేలు = ఎడమచేయి, తాతనెలంతేదఁట= బ్రహ్మయొక్క రమణీమణి (సరస్వతి) లాలి=డోల (ఉయ్యెల). 6

—• వినాయకస్తుతి •—

ఉ. ఆ నెలదిండ్ల దండ్లదణి • నాయిలరాయల దాయగెల్చినన్
లే, నెలదారికల్కితఱ•లించెఁగ, దాయనెదిర్చి, గెల్చి, తా,
నా, నెలదిండ్లదండ్లదణి • నక్కటికాల్లని, తల్లిఁదేర్చె, నేఁ,
డా నెలదారి, గిట్టదణి • సంకిలిచాళ్ళ నడంచే నెంచెదన్.

టీ.—నెలదిండ్లదండ్లు=దంప్రికళలను భక్షించు దేవతాసమూహము, దణి= సేనానాయకుఁడు, ఇలరాయలదాయ= క్షత్రియ వైరియగు పరశురాముఁడు. నెలదారి కల్కి=పార్వతి, ఏఁడు=ఎవఁడు, గిట్టదణి=పొట్టివేల్పు, అంకిలిచాళ్లు=విఘ్న సమూహము. 7

## — ♦ ఆంజనేయస్తుతి ♦ —

సీ. కలఁగించెఁ గాయెతం ♦ డలచాయరాకిచ్చ,
సత్తిచే, నేర్పెడి ♦ సత్తిచేతఁ
దలఁగించెఁ గాయెతం ♦ డిలకం దడల్ నగ
చిన్నెచే రాలెంక ♦ చిన్నెచేత
నలఁగించెఁ గాయెతం ♦ డల లంక లంకిణి
నగ్గిచే గిన్కనా ♦ నగ్గిచేతఁ
జెలఁగించెఁ గాయెతం ♦ డిలయెల్లఁగీరితి
గడఁకచేఁ దాటెడి ♦ కడకచేత

గీ. నలఁచె నెతఁడెల్ల రాకాసి ♦ హత్తితెగల
గడఁక, ననికయికట్లచే ♦ గట్లచేతఁ
దలఁచెద నె♦డంద నాదిట్ట ♦ నలర నతని
చిన్నెచేనటదాసరి ♦ చిన్నెచేత.

టీ.—చాయరా=ఛాయాపతి, (సూర్యుఁడు) ఇచ్చసత్తి=ఇచ్ఛాశక్తి, (బలమైన కోరిక). నేర్పెడి సత్తి=అభ్యాసశక్తి, నగచిన్నె=భూషణ చిహ్నము, రాలెంకచిన్నె=రాజభట చిహ్నము, ఇలకందు = భూకన్య (సీత) కిన్కానగ్గి=కోపమనుమంట, కీరితి=కీర్తి, (కీర్తిభవము). రాకాసి హత్తితెగలు=రాక్షసహస్తిసమూహము, అనికైకట్లు=యుద్ధధర్మములు అతనిచిన్నె=ఆహనుమంతునిపేరు. దాసరిచిన్నె=భటునిగురుతు.

## — ♦ సంస్కృతాంధ్రవర్తమానకవిస్తుతి ♦ —

కం. అలరఁగ నేరినిఁ దలఁచినఁ । దలఁచేక చెన్న నెదదల్చె♦దం దిట్టలటం
చేల గాలిదిండ్ల టెంకిని। గలిగినకయి న క్కలావఁ♦గలిగిన కయిరాల్.

క. ఎద యఱదానం జేర్చెద । నెదయిత్తిగ నీటిలిట్ట♦నేఁ దేల్చెద, నా
యొదచే దలఁజెలఁగఁగాఁజే। సెదఁదిక్కన, సిరిదణి, నెల♦చిన్నెఁగలానిల్.

క. తలఁచెద నెద, నిలఁజిట్టలఁ। గలిగినకతలల్. యయాతి♦కథకత తేనెల్
జిలికెడి. కఱదలదానిం। దెలిఁగించెంగఁదెలఁగన్నె♦తెల్గన్ననినేల్. 11

క. ఇలజేతయయి జేతకాకయ, కలకయి తెగలెంద తేని♦గలరందఱు, స
న్నలదెలిసి యెన్నఁగలనా?। చెలఁగఁగనని యొదఁదలంచి♦జేజేలిడదల్.

టీక:—గాలిదిండ్లటెంకి = వాయుభక్షణఁజేయు పాములయిల్లు (పుట్ట); కయి=కవి, కలా...రాణ్ = పడవయందుఁబుట్టిన కవిశ్రేష్ఠుని (వ్యాసుని) అరదము=రథము, ఇత్తిగనీటిలిట్ట=(రెండు×మూడు) ఆరవసముద్రము. చేదలు=ఆకాశము, సిరిదణి=శ్రీనాథుఁడు, నెలచిన్నెగలానిణ్=సోముని, చిట్టలు=చిత్రములు, జేజేలు=నమస్కారములు.

## —॥ గురుస్తుతి ॥—

చ. చేలితతి, నేనెలం, జేనెడి ♦ జేక్కటిలం, జేలకాల నాఁడి, చె
న్నలరఁగ గట్లదాయనఁగ♦రందఁదలంచెద రెట్టిరైన, నా
నెలకత లాఁతికడ్డలన ♦ నిల్చినఁదెల్లలరంగఁజేసె, నేఁ
డల కయిదిట్ట నం గనిన ♦ యట్టిడి శేషయనెంచి తేల్చెదణ్.

టీక—చేలితతి=చలికాలము, జేక్కటిలు=నదులు, గట్లదాయనగరు=ఇంద్రపట్టణము, కయిదిట్ట=కవిశ్రేష్ఠుఁడు, తేల్చెదణ్=కొల్చెదను

## —॥ ప్రభుస్మరణ ॥—

చ. సిరిగల లండనణ్నగరఁ ♦ జెన్నలరారఁగఁగల్గి, ఢిల్లి రా
సిరి జేతగాఁగ డాకడన ♦ చేడియదంట చెలంగదిట్టంకై
సిరి నిలఁగేలఁదాల్చి, దరిఁ ♦ జేరినయేలిక లెన్నఁగా జేగా
సిరిఁ జెలగంగ నంపతినిఁ ♦ జెచ్చెరనేలెడి జార్జి నెంచెదణ్.

టీక:—రాసిరి=రాజ్యలక్ష్మి; చేడియదంట=స్త్రీలయందు నేర్పరికత్తె (మేరి), ఏలికలు=రాజులు.

## —॥ ప్రాజ్ఞుల కొకవిజ్ఞప్తి ॥—

క. అల జేజేలాడెడి కటిదఁనల్లినకైతకైత ♦ దానికిఁ గంధై
కలిగిన తెల్గేటికినని! తెలియంగా ననఁడె దీనిఁ ♦ డెలియనతఁ డిలణ్.
ఉ. తల్లియదే, నిజాన కిఁక ♦ దానికిఁ గట్టిన కంద దట్టిదే,
తల్లియనైనఁ గందయినఁ ♦ దన్నలరారఁగఁ గన్నతండ్రి, నా,
తల్లిని దాతనాతి నెదఁ ♦ దక్కఁగ నే రహిఁ సంతరించె, నా
తల్లికిఁ గన్నె కక్కరణిఁ ♦ దళ్కెడి సాకెడి నాతఁ డెంతయేన్. 16
వ. కనఁగా రాజేగజెట్టి యెట్టియెదఁ గఁ్గరంజేసెఁ దానట్టిదై
తనరంగాఁగల, ధేనికైతయాయినం ♦ దంటైనఁ గాఁకేగినన్

గనఁగానే, నగ కానరయ్య నెఱి నా • కైతం జేగాతేనియల్
ననలం గందగనీక తేనియల నాఁ•నంగన్న తేంట్లాయనన్. 17

టీ—జేజేలాఁడెడికఱదలు=దేవతలుపలుకుసంస్కృతపుమాటలు, కయిత=కవిత్వము, దానికి......తెన్గేటికి=ఆసంస్కృతమునందుఁ బుట్టి కిశుద్ధాంధ్రమెందుకు, తల్లియదే=ఆసంస్కృతమే మాతృభాష, దాని కిగల్గినకందు=ఆసంస్కృతమునందుఁ బుట్టినయాంధ్రము, తన్నలరారఁ గఁగన్నతండ్రి=ఆభాషారూపకమైన కావ్యమును వ్రాసినకర్త, తాత నాఁతి=బ్రహ్మభార్య, తల్లి=సంస్కృతము, కన్నె=ఆంధ్రము, తళుకు=మెఱుఁగు, రాజేగజెట్టి=రాజశ్రేష్ఠుఁడు (రాముఁడు), ననలు=పూలు, తేంట్లు=తుమ్మెదలు.

—• కృతికర్తృవంశానుక్రమణిక •—

సీ. సిరిచెలిరా, తెలి • సింగారిరాఁ గనె;
నాతనిజాతియం • దతనికంటె
గట్టిడంచేనియెన్నఁ • గౌండిన్యఋషి కల్గె,
నతనిసం తిలయెల్ల • హత్తియంటె
నాజేగాజాఁతిని • నయ్యరాజనియెడి,
నెలగ కల్గెం దాన • శేషయ యనె
నేలజేజే కల్గె • నెఱి నాతఁడట నర
సయ్య నాఁ జిన్నికం•వలరఁగఁ గనె
గీ. నతనికింగల్గె శేషయ్య • యాయన తన
రాణియైనట్టి • సతగట్టురాయని నెఱి
కలికి సన్న కలికియంద • గాలికం దిడంగ
నన్గాంచి యతనిసఁన్నం గడ కిడె.
ఉత్సాహ. కన్నయయ్యచెంత నన్ని • కైతలట్టనేర్చి, నీ
కన్న నయ్యగారినే జే•గానఁ దేగలాన, ఒ
చ్చన్నయన్న! యంచేషంప • నాతనిన్దలంచి, నే
నన్నసన్న దెల్పి, సౌన రె•సంగగాంచియాపటన్॥

టీ—సిరిచెలిరా=లక్ష్మిభర్త, తెలిసింగారిరా = సరస్వతీభర్త, సంతు=గోత్రము, నేలజేజే=భూసురుఁడు, సతిగట్టురాయనినెఱికల్కి=

ఏడుకొండలరేని చక్కనినాఁతి, (అలమేలుమంగాంబ) గాలికందు=హనుమంతుఁడు, అతనిసన్న=అతని పేరు. (హనుమంతరాయఁడు) కన్నయయ్య=కన్నతండ్రి, అయ్యగారు=బోధగురువు, లచ్చన్నయన్న=లక్ష్మణాగ్రజుఁడు, (రాముఁడు) ; నెనరు=కరుణ.

—• పూర్వగ్రంథపట్టిక •—

క. చేసితిని నృగచరిత్రను । జేసితి నర్కజచరిత్రఁ • జెన్నలరారం
జేసితి శతకాల్చరితలఁ। జేసితి హెచ్చరిక దచ్చి • చేతల నెన్నేన్.

టీ.—నృగచరిత్ర=అచ్ఛాంద్ర నిరోష్ఠ్య, నిర్గద్య నృగచరిత్ర. అర్కజ చరిత్ర= సుగ్రీవ పట్టాభిషేకము, శతకాల్ = వాణీశతకము, హరిహరనాథశతకము, నిరోష్ఠ్య పితృశతకము, హెచ్చరిక దచ్చిచేతలు=అష్టావధానములు.

—* శ్రీరామచంద్రప్రభావము *—

ద్వ్యర్థి సీ. తడయక నెత్తాల • నడయాఁడి చేల్లని
యెడలఁ గలికిచేత • లడరనిలిచి
తేజార తలలెత్తి • తిరిగి రెంటగలిగి
నట్టిదిట్టల కెద • నళికి డాఁగి
జేతనాల్కలఁదలిర్చి • సరిలేని నడకల
నేలన కాలిడ • నేరకేరి
నైనఁ జీదరచేత • నలగాఁగనియింత
కంటె దంట లికేడఁ • గలరని సరి
గీ. సన్నకాండ్రఁ దలంగించి • సరగ నిక్క
లంది చెలఁగెడి జేతనాల్క • లడరినట్టి
షేండ్ర, కాషేండ్రదారి సం•జేగినయట్టి
రికి గయిత చెలినిడఁగ దళలకినిలంగ.

టీ —తడయక=ఆలస్యముఁజేయక, నెత్తాలన్= మేడలయందు, (కొండలమీఁద,) చేల్లనియెడలన్=చేలువతాల కట్టడములందు. (చల్లనిచోట్ల) కలికిచేతలు=స్త్రీలతోఁ గూడుటలు (మసకలాఁడుట) తేజారఁ తలలెత్తితిరిగి=కిరీటధారులై ప్రకాశించుచు సంచరించి (పడగలెత్తితిరిగి) రెంట......నళికి = ద్విజులకు జేడిసి (గరుడపక్షులకుజేడిసి) జేత......

దలిర్చి=ఒకటిపలికి వేఱొకటిచేసి (రెండు నాల్కలతో నుండి) సరిలేని నడకల=వంకరనడకల, నేలన కాలిడనేరక=భూమిమీఁద సరిగా నడువలేక (పొట్టతోఁబ్రాకుచు) ఏరి...గని = ఎవరినైన నోర్వలేకచూచి, ఇంత...లంది=మాకంటె మొనఁగాండ్రులేరని ఒకరిచోటులను బొంది, జెత...త్తేండ్రు=రెండునాల్కలుగల రాజులు, పాములు

సీ. డక్కఁగాఁ జెక్కఁగా ♦ డాకడ నిలకన్నె
లచ్చిచేత, న్నెఱె ♦ లచ్చిచేత
నక్కఁగా, గాలికం ♦ దక్కాలి కడలెంక
చిన్నె చే దాసరి ♦ చిన్నె చేత
నిక్కఁగా లచ్చెన్న ♦ నీటిరా, కడ, రాచె
చిన్నె చే హరిసెజ్జ ♦ చిన్నె చేతఁ
జెక్కఁగా నిల, నల్ల ♦ జెత యీకడాకడ
సత్తిచేఁ దెఱగంట్ల ♦ సత్తిచేత

గీ. చిక్కనట్టి కడిఁది ♦ చెట్లఁ దిరింగెడి
దిట్టలదణి, యెఱచిఁ ♦ దినెడిదిట్ట
లదణి చెంగట న్నిలంగ నేలఁజెలంగ
నిచ్చ నేలినట్టి ♦ లచ్చెనన్న.

టీ.—ఇలకన్నె=భూమికన్య,డక్కఁగా=దక్కియుండఁగా, డాకడ=వామభాగము, లచ్చి=లక్ష్మి, నెఱెలచ్చి= సౌందర్యలక్ష్మి,గాలికందు=వాయుసుతుఁడు (హనుమంతుఁడు) కాలికడ=పాదముదగ్గర,నక్కఁగా=పొంచియుండఁగా, లెంకచిన్నె=భటలక్షణము, దాసరిచిన్నె =దాసలక్షణము, నీటిరాకడ=వరుణదిక్కున, హరిసెజ్జ=విష్ణుశయ్య, జెత=ద్వయము (భరతశత్రుఘ్నులు), తెఱఁగంట్లు=దేవతలు, చెట్లదిరింగెడిదిట్టలదణి=వృక్షచరులందు మొనగాఁడు (సుగ్రీవుఁడు), ఎఱచిదినెడిదిట్టలదణి=మాంసాశనశ్రేష్ఠుడు=విభీషణుఁడు.

సీ॥ తనకడిందికడంక ♦ తనకడిందికడంక
కరణి గట్టంతయై ♦ గండెసంగఁ
దనకల్కి సిరిచేన ♦ తనకల్కి సిరిచేన
కరణినెద్దడిదీర్ప ♦ గంటిడంగఁ

దననెఱసరి చిన్నె • తననెరసరిచిన్నె
కరణి నెదిరియేనిఁ కలఁగ గలంచఁ
దనదండఁగలసత్తి • తనదండఁ గలసత్తి
కరణి రక్కసిదండ్ల • గండడంచేఁ
గీ. దగినయిలదారి, సింగాణిఁదారి, నెఱిని,
గాంచి నం జేరి తనకత • కైంతనెలఁతఁ
దన కిడెడి యెదనిడెగాన • దానినిచ్చి
యల్లతనిఁ జేసెదంగాక • యని యతనిని.

టీ—కడిందికడంక=పెద్దదియైన ప్రయత్నము లేక పెద్దదైనధైర్యము, కల్కిసిరిచాన=ఇంపైన సంపత్కాంత లేక భార్యయైన లక్ష్మీకాంత, నెరసరిచిన్నె=సింహలక్షణము (శూరలక్షణము) దండగలసత్తి=బాహుబలము. (దగ్గరనున్న సీతాశక్తి) గట్టు=కొండ, ఎద్దడి=దరిద్రము, గంటు=ముల్లె.

—• షష్ఠ్యంతములు •—

క. అట్టిజెగజెట్టికిని, దిగ। జెట్టిండ్రి తెగంజెలఁగెడి • జెట్టికి, నిలరా
జెట్టిండ్రినెట్టి, రాల్చిన। కట్టిడి గండడచినట్టి • గద్దరిదణికిన్.
క. దిరిసెననసజిగి సిరినిం। దరిసి, నగెడిచాయచేత • దగి నట్టిడికిన్
అఱచెలియెద సిరిగద్దియ। నెఱదేటినిదెల్పినట్టి • నెరసరిదణికిన్.
క. నెఱినంజన కిందాతఁడే। దరిజేరిచెనని యతనిని • దరిజేర్చంగా
సరిగనెద నెంచి, తనయం। తెరిగించిన నేలకన్నె • యెదరాయనికిన్

టీక—తిగజెట్టిండ్రి తెగ=ముగ్గురు వేల్పులయందు వరుసగ, ఇలరా... దణికిన్=రాజులనుపడఁద్రోసి చంపిన పరశురాముని హెచ్చునణచిన ప్రఖ్యాతిఁజెందిన రాజేనకు, దిరిసెన...నట్టిడికిన్=దిరిసెనపువ్వు కాంతిని నవ్వు కాంతిచేత నొప్పునట్టివానికి, అఱచెలి...వణికిన్=అర్ధనారియైన పార్వతి హృదయపద్మమునకు దుమ్మెదయైన శివునిగొల్చినవానికి, నెఱినంజన...రాయనికిన్=హనుమంతుఁడు తనకుసహాయమొనర్చెనని యతనికిఁ దనయాత్మస్వరూపమును దెలిపిన భూమికన్యాభర్తకు.

---

# కథాప్రారంభము

తే॥ గీ॥ చెంద నా నేర్పినట్ల నేఁ • జేయనైన
యతెదిదాశరథిచరిత్రి • కఱయఁగఁ గత
తెఱఁగదెట్టిదనంగ నా • తెలిజిగిజడ
దారికిన్, జేతనాల్కల • దారిటెంకిఁ
గలిగినట్టిజడలదారి • కడఁక ననియె.

టీ—దాశరథిచరిత్రి=రామాయణము, తెలిజిగిజడదారి=తెల్లని ముని (నారదుఁడు) జేతనాల్కల...దారి=రెండునాల్కలు గలిగిన పాములపుట్టయందుఁ బుట్టినవాఁడు (వాల్మీకి)

క. జడదారిరాయ! చెదరని । కడకం, దే, జడరఁగల్ల • కల్లగ, నిలయె
ద్దడియెద్దడిగా, నలజడి । జడిఁదడియఁగనీకయెల్ల • జాతితెగఁలదాన్.

టీ—జడదారిరాయ=మునినాథా, కల్ల=అబద్ధము, కల్లగన్=లేకుండన్, ఎద్దడి=దరిద్రము, ఎద్దడిగాన్=లేకుండఁగా, అలజడి=కష్టము జడి=వాన.

ఆ॥ కనికరాననేలఁ • గనినట్టిరానెల । నేలఁగలిగనేని • నెఱిఁదెలియఁగ
నాడఁగదెయటన్న • నాజడదారికిఁ। దెల్లనిజడదారి • దిట్టయనియె. 29

టీ—కనికరానన్=దయచేత, తెల్లని...దిట్ట=తెల్లనిముని శ్రేష్ఠుఁడు (నారదుఁడు)

ఆ॥ గాలిదిండ్లటెంకిఁ • గలిగినజడదారి । రాయ! నీయడిగిన • రాచదిట్ట
కలిగె, నతనికతనె • తెలియంగనాడెద। నాలకిం, చేడంద • యానఁజెంద॥

టీ—గాలిదిండ్లటెంకి=వాయుభక్షణసేయుపాములకిల్లు (పుట్ట)

## సీత పేని కత

—• పురవర్ణన •—

కం॥ సిరియొదఁగల జేజే దా । శరథిగఁ గలిగి చెరలాడఁ • జాలఁగ లచ్చిం
గరగరికఁగాంచినిల్చిన। కరణిని "సాకేతనగరి" • కడిఁదిసిరిఁ దగెన్. 31

టీ—సిరి...జేజే=విష్ణువు, లచ్చి=సంపద, కడిఁదిసిరి=ఎక్కువ భాగ్యము.

సీ॥ తెలిగంట్ల గిడిగిళ్ళఁ • దెలిచెడిలెంకలే
యెడఁ గాయఁదగిన, య•ట్టడలచేత
నగరిచౌనల జేత • నాల్కాల చౌనల
జేతసేయఁజో లగ•డితలచేత
దిన్నునిరతనాలఁ • దీర్చికట్టంగనై
డా లదరెడి కట్ట•డాలచేత
నెక్కి నాతనికి గ్గైఁ•జిక్కి నాతనికి నా
తటి ల గ్గిడెడి యఱ•దాలచేత
తే॥ నింగి జోలానఁదగిన యే•నికలచేత
జెలఁగి, కదలిఁగడచెడి తే•జీలచేత
దనర, నగరెల్లజేసిన • తాతచేత
చేతఁగాదాయె నెన్నఁగా • లాతిచేత. 82

టీ—తెలిగంట్ల=దేవతలయొక్క, గిడిగిళ్ళ=నమస్కారములచేత, అట్టడల=కోటబురుజులయిండ్ల జేత...చౌనల = నాగకన్యల, అగడిత= అగడ్త, లగ్గు+ఇడెడి=మేలొసఁగు, నింగిజోలు=ఆకాశవాహిని (గంగా) తాతచేత=బ్రహ్మసృష్టి, లాతి=ఇతరుఁడు.

—• బ్రాహ్మణాది వర్ణన •—

సీ॥ నేలజేజేలైరి • నెఱిజన్నిగట్లెల్లఁ
దీరార నిచ్చెలఁ • దీర్చనేర్చి
నేల యేలికలైరి • నెఱరాచనెలలెల్ల
నేలయెల్ల నిజోన • నేలనేర్చి
నాణెకాండ్రైరి, తిం•న్ననిసెట్టి తెగలెల్ల
రతనాలనేర్చి చే•ర్చంగనేర్చి
సేద్యగాండ్రైరి హె • చ్చిన హాజ్జనంబెల్ల
నెంచి గింజెల సంత•రించనేర్చి
తే॥ చెలియ లందకత్తియలైరి • చెలఁగనేర్చి
జెట్టి చేడియలై రాట • చౌనలేర్చి
సిరిని జెక్కట్లచేతనే • చేర్చనేర్చి
నగర, నయ్యారె! కలదె? సాన్ననిదియేర్చ॥ 83

టీ—నేలజేజేలు=భూసురులు, జన్నిగట్టు=యజ్ఞోపవీతధారులు, ఇచ్చెలు=కోర్కెలు, హజ్జనంతు=పాదజులు (శూద్రులు) జెట్టి=వెల, చెక్కట్లు=మాటలు, సన్ననిది=స్వల్పమైనది.

క॥ సత్తినిదాల్చిన నెఱసరిఁ । గత్తినిదెగడి తగెనపటఁ • గల్క త్తిదెగల్
సత్తినిదాల్చిన నెఱసరి।గత్తిని దెగడి తగెనచేట•గలలెంకతెగల్ ॥24

టీ—సత్తి...సరి=శివుఁడు, వానికత్తి శూలము, కత్తితెగ=ఆయుధములగుంపు, సత్తి...సరి=కుమారస్వామి, లెంకతెగలు=భటుల గుంపు.

—• పుష్పలావికావర్ణన •—

సీ॥ గంటిడియెదఁ దెలి • గంటి! చెండ్లీఁగదే
గంటీక చెండ్లంటఁ • గలరటయ్య!
కలయంగ నీయకే • కలికి! సంతానాలఁ
గఁయక సంతానఁ • గలరటయ్య!
తలఁచినదిడెద, నీ • దండ, నాకీఁగదే
తలఁచిన దిచేట, నీఁ•గలరటయ్య!
యడిఁగిన దిడెద. నే • నడిగిన దిడియదే
యడిగెడి దిందేది • యనఁగదయ్య!
తే॥ యని యచేటఁ గలయుంగళ్ళ • ననలజెట్టి
కిడెడి కాగ్రిల్లంట్ల కెంతే రఁ•హింందలిర్చ
లంజకాండ్రనియెద, రెదఁ•లం గలట్టి
రహినిదీరలాతి దెలియ • రానిదారి ॥ 35

టీ—గంటు=దంతక్షతము, (సొమ్ము), తెలిగంటి=ధవళాక్షి, సంతానాలు=బిడ్డలు (సంతానపుష్పములు), దండ=సమీపము (పూదండ) లంజకాండ్రు=విటులు, రహి=కోరిక, లాతి...దారి=నర్మగర్భవిధము.

క॥ సిరిచేఁ, దాళికచే, నెరి । సిరిచే, నల్తెగలరాచే • సిరి చే, నెనరన్
సిరిచే, నా, నగరనియెడి। సిరిచేడియనేలె, నాజి • సిరితేఁ డలరన్ ॥ 36

టీ—సిరి=సంపద, తాళిక=శాంతము, నెఱిసిరి=సౌందర్యసంపద, నల్...సిరి=చతురంగబలసంపద, నెనరన్సిరి=దయాసంపద, నగ... సిరి=పురలక్ష్మి, అజిసిరితేఁడు=దశరథుఁడనెడి విష్ణువు.

ఉ॥ కైసిరిచేత, నాజి, తన • కైజేత నీయిలఁ జేర్చియేలఁగాఁ
గైసిరిచేత హత్తితెగ • కైకయిదారిచి యాఁటలాడె, నెం
తేసిరిఁ గాలిదిండ్లదణి • తేఁటగఁ జెక్కెరదిండి రాచతే
జేసిరిఁగల్గినట్టిఁ డనిఁ • జెచ్చెరఁ దేల్చె నెలంత లందఱన్॥ 37

టీ—కైసిరి=హస్తసంపద, హత్తితెగ=అష్టదిగ్గజములు, ఎంతే సిరి=ఎంతో శోభ, గాలిదిండ్లదణి=సర్పరాజు, చెక్కెర...డని=శుకరథ సంపదగల మన్మథక్రీడ, తేల్చెన్=కఱగించె.

క॥ తిగచేడియదంటల, నల।రఁగ నాండ్రింజేసియేలె • రా, రే, ఱేఁ, డా
తిగచేడియదంటల, దన।రఁగ నాండ్రింజేసియేల్న • రహరి కరణిగన్॥

టీ—తిగ...టలన్=కౌసల్యాసుమిత్రా కైకలను, రా, రే, ఱేఁడు=రాజచంద్రుడు, (దశరథుఁడు), తిగ...టలన్=శ్రీ, భూ, నీళలను, నరహరి=విష్ణువు.

శా. ఆరాకాసి తెగల్ గలంచెఁ దెరగం• ట్లంతంత సాయానకై
చీరంగాఁజేని, రక్కసీండ్రితెగలం • జెండాడి క్రిచ్చెందఁడే
గారానం జెలితేరిత త్తడిజేతం • గైసేసిసాగించఁ, జె
న్నారంగాఁ దనదైనకైసిరిజేగా•నం గ్రాల ఱేఁడెంతయేన్. 39

టీక—సాయానకున్ ఐ=సహాయమునకు, క్రిచ్చెందఁడే=వరము నందఁడా? గారానన్-సాగించె=ముద్దుచేతఁ గైక రథముఁదోలఁగా, జేగానఁగ్రాల=లోకమునఁ బ్రకాశింపఁగా;

—• వసంతర్తు వర్ణన •—

చ॥ ఎలననతీఁగటెఁకి సిరి • యేలికరానయినట్టి యత్తఱిం
గలననతీఁగచాన, లెసఁ•గం, గయిసేసినత్రైకచిట్ల, ని
క్కలననగీఁగఁజాలకయ • క్రిచ్చెలనిక్కెన చేంటిజేంట నా
నెలననతీఁగ చిట్లె నన•లెత్తగ.నా "ననకా" ర్గనం దగెన్॥ 40

టీక—ఎల...సిరి=పూలతీఁగలకిల్లైన వనలక్ష్మి, ఏలిక=వసంతుడు, నన...చానలు=పుష్పలతాంగనలు, కయిసేసిన=అలంకరించిన, ఇక్కలన్=స్థానములను అనగి+ఈగ...య=అణఁగియుండక, అనలు=చిగురు, ననకారు=పూలకారు (వసంతకాలము)

ఉ॥ డాయఁగదీసి, దాదియయి • తన్నెఱిఁగాచినకాకి, తాచినం
డాయగనెంచి దానిని గ•నందగ, నల్లనితెక్కదారి కం
దే, యలకండచెక్కెరల • దిండ్లలరారఁగఁ, దేఁ్రిచ్చెఁ దేంట్లచాల్
తీయనితేనెలాని, నెఱిఁ•దిన్నఁగఁ నా "వనకార్గనఁ" దగెన్॥ 41

టీక—తాచినన్=తన్నిన, నల్లనితెక్కదారికందే=కోవెలపిల్లయే, కండచెక్కెరలదిండ్లు=చిలుకలు, తేంట్లు=తుమ్మెదలు.

క॥ చీఁకటిచెట్లఁ జిగిర్చిన। యాఁకజ్జెడి నీటిదారి • యనియెంచి, జెగా
యీఁకతెగసాచియాడెం। డీఁకలరంగ సిగదారి• నెఱిన య్యెడలన్॥

టీక—చీఁకటిచెట్లన్ = తమాలవృక్షములందు, జడినీటిదారి = వర్షాకాలమేఘము, సిగదారి=శిఖి. (నెమలి)

—• వేఁట, వర్ణన •—

క॥ రాయనికానయెడఁగానల। రాయనిఁగని,యచేటిహత్తి•రాయిడికాండ్రిం
రా,యని,చీరియడఁచి,యిల। రాయనిదేటికనితలఁచె•రహినైజోనన్॥

టీ—కానలరాయని=అరణ్యశ్రేష్ఠమును, హత్తి...కాండ్రిన్=సింహములను, ఇలరాయనిది=భూమినిబెట్టిరాచేనిది, నైజోనన్=స్వభావముచేత.

శా॥ జేజేరాయనినేస్తి సిస్తయిన తేఁజీనెక్కిలెంకల్ జతం
జే, జే, రాయఁడ! నీకటంచెనఁజెగా • చిల్కిడ్డసింగాణి నెం
తేఁజేఁదాలిచి, కానకేగి నెఱిహా•త్తిం, గణ్తెని, న్లేడినిం
దేజీదాయల, హత్తిదాయతెగఁ దా•నే చెండె నాయాయెడన్॥ 43

టీ—జేజే...నేస్తి=దేవేంద్రుని స్నేహితుఁడు, (దశరథుఁడు) జే, జే,=జయము, జయము, హత్తి=హస్తి, దాయ=పగవాఁడు.

క॥ తనలెంక లరసితెచ్చిన। తనరారిన చౌని తెక్క • దార్లకలరి, యం
తనఁజేలలిచ్చి లెంకికిఁ। జెననెంచి తడాల్ననింత•సడి నాలించెన్॥44

టీ—లెంకలు=భటులు, చౌని=చావని, తెక్కదార్లు=పక్షులు, సడి=చప్పుడు.

—• దశరథ శాపము •—

క॥ ఆలించి, హత్తి తనచేఁ। గిలించినసీటిని గలి•గిన నడియని తా
గిలించి సింగిణింబిల్కాలించిన దెస నిగిడ్చె • నాజి కయిసిరిన్॥ 45

ఉ॥ కానకయేసి యీకరణిఁ • గ్రిచ్చేరఁ డగ్గరఁజేరి, వేలజే
జే, నకటా! యడంచెనిటఁ • జేరితికాయని చేలఁగంది, తాఁ
గానకయేసితం చేతనిఁ • గాంచినయట్టిరికాడి, యట్టి, నే
రానక, తిట్టినంగలఁగి • రానెలబెంకికి నేగి యాడటన్॥ 46

టీ—ఆతనిఁగాంచిన యట్టిరికిన్=వానినిగన్న తల్లిదండ్రులకు.

ఉ॥ ఏటికి యీకడాని, యిఁక • నేటికి యీనెలతాలసజ్జె, లిం
కేటికి యీజెగానగ, లిఁక • కేటికి యీననసెజ్జె, లింతఁగా
నేటికి యీనెలంత, లిఁక • నేటికిరాసిరి, సంతెనంగ నే
నేటికియీగనైతినని • యేడ్తెరసాగిలె సత్తితండ్రికిన్॥ 47

టీ—నెలతాలసజ్జెలు=చంద్రకాంతమణులచేఁ గట్టినమేడలు,నన
సెజ్జెలు=పుష్పములపాన్పులు, రాసిరి=రాజ్యలక్ష్మి, సత్తితండ్రి=శక్తిము
నిజనకుఁడు (వసిష్ఠుఁడు)

—• పుత్రకామేష్ఠి •—

క॥ రం, గలర నంత ఋష్యశృంగర్షినిదెచ్చి సరగఁ • జేసిన జేన్నా
నం, గలిగెడి సం,తని సత్తింగన్నట్టి జేడదారి • తెలియంజేయన్॥

టీక—జేన్నానం=యజ్ఞమున, సంతు=బిడ్డలు, సత్తిం...దారి=వసి
ష్ఠుఁడు.

ఉ॥ ఆజేడదారిదారి నతఁ • డాడిన యాజేడదారిఁజీరి, తాఁ
దేజేడరంగజేన్నియఁ గఁదించి కడిందిగ, నెల్ల నేలజే
జేజేడదారితేండ్రతెగఁ • జేరిచి యెక్కటియేటిచెంత రా
రా జేడరించె; లంకఁగల • రక్కసిరాయఁ డెసంగ నత్తఱిన్॥ 49

టీక—ఆజేడ...దారి = వసిష్ఠుఁడు వలికినమార్గమున, అతఁ...
జీరి=అతఁడువల్కిన ఋష్యశృంగమునిని బిలిచి, ఎక్కటియేటిచెంతన్=
ఒకనదిదగ్గర, ఎల్ల...తెగ=సమస్తభూసురుల, మునులగుంపు.

—• రావణునిదుశ్చేష్టలు •—

సీ॥ తెఱగంటిరాయనిఁ • దెగడి సిరినిగాంచి
కినిసినట్టిడిని, నగ్గినిఁగలంచి
చాయరాకం, దనిఁ, • డాయరాగ, నలంచి
యెఱచిదిండి నెదిర్చి • హెచ్చేడంచి

నీళ్లరాయని నీళ్ళ • నేడాగఁ గావించి
జింక తత్తడికాని • చేగడించి
చెలిచెక్కరాయని • నలినలిగఁ గలంచి
కడకడ రాయని • జెడలఁ ద్రెంచి

తే॥ అచ్చెరల నందఱం జెక్క • నయ్యయాట
లంగలఁచి చేరరాక, దలఁగినయాఁట
కత్తియలఁ జెరవిడి తిగ • కడలనీట
లరగ గెల్చిన లా గాన • లనిదెః జోట. 50

టీ—తెఱగంటిరాయని=దేవేంద్రుని, అగ్గి=అగ్ని, చాయరాకందు=ఛాయాపతియైన సూర్యుని కొడుకగు యముఁడు, ఎఱచిదిండి=మాంసభక్షకుఁడు (నిర్ఋతి), నీళ్ళరాయని=అపాంపతి=వరుణుఁడు, జింక తత్తడికానిన్=హరిణవాహనుఁడగు వాయువును, చెలిచెక్కరాయని=ఉత్తరదిక్పతి=కుబేరుని, కడకడరాయని=అంత్యదిశాధిపతిని (ఈశానుని) చెక్కనయ్యయాట=మన్మథక్రీడ.

—• బ్రహ్మాదిదేవతలు విష్ణుతోఁ దమకష్టములు చెప్పుకొనుట. •—

క॥ తెల్లని జేజేరాయనిఁ, । దెల్లని చెలితేనిఁ గలసి • తెఱగంట్లంతన్
నల్లని జెక్కర నేలిన, । నల్లనితేని కెఱిగించె • నడచి, రలజేడిన్॥ 51

టీ—తెల్ల...యని=శివుని, తెల్ల...తేని=బ్రహ్మను, నల్ల...తేనిన్=కాళిందినేలిన కృష్ణుని, అలజేడిన్=కష్టముచేత,

క॥ నడచియొనలేని యిత్తిగ, । కడలినిఁ జెలిగాలిదిండిఁ • గద్దరి సెజ్జం
జేడదార్లలతిగ జేజేల్ । కడతేఁడని యెన్నఁదగిన • గద్దరికానిన్॥ 52

టీ—ఇత్తిగకడలి = (రెండు×మూడు=ఆరు) క్షీరసముద్రము, తిగ...డని=త్రిమూర్తుల కవ్వలివాఁడని.

క॥ తానటఁ జీఁకటిచెట్టై । దానికి నెదవండలాలిఁ • దగిలిచి, లచ్చిం
దానవిడి నేల నీలల । దానిఁగదల్పఁ దటనిడిన • దారిగఁలానిన్॥ 53

టీ—చీఁకటిచెట్టై = తమాలవృక్షమై, ఎదవండలాలి=వక్షస్థల వనమాలికా డోలపైని, లచ్చి=లక్ష్మి, నేల, నీలల=భూనీళల.

క॥ ఈకరణిఁ దనరనిలిచిన । ఆకటిజేజేఁగనంగ • నాతని యానం
గైకయి రాయఁగఁజనితా। రాకటిచెలిగాంచి యెఱిఁగి•యగ్గించి రిటే॥
టీ—కటిజేజే=కృష్ణుఁడు, కటిచెలి=అర్జున స్నేహితుఁడు.

—• విష్ణుస్తుతి •—

క॥ అన్నియయితాన, తనయం। దన్నిటినిడి, తనరనిలిపి•యన్నిఁటఁ దానే
యన్నిఁటి సాకిరిశానై । యన్నిఁటి సాకఁదగినట్టి • యన్నిఁటిజేజే॥
టీ—అన్నిఁటి సాకిరి=సర్వసాక్షి, అన్నిఁటి జేజే=అందఱికి దైవము.

క॥ గీ॥ గర్భ॥ చ॥

ఇల, సిరిరాయఁడా! కడలి • నే, నెఱిటెంకిగ, గన్న తేఁడ! నీ
టలరతేఁడా! జెగా, లడర • నన్నిటనాడెడి యాఁటకాఁడ! డా
ల్గల, కటినాయఁడా! జెడలఁ • గాఁపిల్, తెలిగంటికిసంగడీఁడ! తి
ట్లడఁచేతఁడా! రహిం దడయ • కన్నిఁటిఁగాచెడి దంటకాఁడ! జే!56

గర్భకందము

సిరిరాయఁడా! కడలినే । నెఱిటెంకిఁగఁ గన్నతేఁడ! • నీటలరతేఁడా!
కటినాయఁడా! జెడలగాఁపిల్। తెలిఁగంటికిసంగడీఁడ!•తిట్లడఁచేతఁడా.

గర్భగీతము

కడలి నేనెఱిటెంకిగఁ • గన్నతేఁడ! । అడర నన్నిఁటనాడెడి • యాఁటకాఁడ!
జెడలగాఁపిల్ తెలిగంటికి•సంగడీఁడ!।తడయ కన్నిఁటిఁగాచెడి•దంటకాఁడ!

టీ—కడలి...తేఁడ=క్షీరసముద్రవాసుఁడ! అడర...కాఁడ=సర్వవ్యాపకుఁడ!

మ॥ అని యగ్గించి కడింది జియ్య! యని, ము•య్యా! చెక్కనేలంగదే
యని, యంతంగల సంతనందెలియఁజే•యం, దాయఁద్రెళ్ళించెదే
నని, జేజేలనెసంగఁ గాంచి, యిఁకనీ • రాచెట్ల దిర్గయ్యలై
యనికిండాసిన నాజిరాచేనెలకే • నై కందనిండానెదన్॥ 57

టీ—ఈరు=మీరు, ఆచెట్ల దిర్గయ్యలై=ప్రశస్తమైన వృక్షచరులగుచు, ఆజి...నేరెదన్=దశరథపుత్రుఁడనై యుద్ధమున (రావణుఁ) జేరెద.

## —• దాశరథుల జననాదికము •—

మ॥ అని యిట్లాడిన నల్లనయ్యఁగని తా • రంతంతఁ జేజేల చేం
దనియం జేసి, కడానిచేలదణి యా • నం, జేరి రిట్లాడటన్
నెనరారం గటిరాయఁ డాజినెఱజే • న్నైన్ గాలికందిడ్డ తి
య్యనితిండిం గలయంగఁ జేరి సరిగా • నయ్యాజి క్రోల్గంట్రిదన్॥ 58

టీ—జేజేలచేన్=నమస్కారములచేత, కడానిచేలదణియాన=కనకచేలుఁడైన ప్రభువు (విష్ణువు) యొక్కయాజ్ఞ, జేన్నై=జేన్నము(యజ్ఞశబ్దభవము) గాలికందు=అగ్ని, (ఆకాశాద్వాయుః, వాయోరగ్నిః, అగ్నేరాపః, ఆపఃపృథివి) తైత్తిరీయము. తియ్యనితిండి=పాయసము.

చ॥ నెలనెలకెంతయే, నెదిగి • నేటిలనల్ తెగలందగంగ న
న్నెలఁతలయంద చిన్నియల • నిండిన సాళ్ళనకల్గి, చిన్నిలే
నెలలనఁ జాలఁగానెదిగి • నీటలరారఁగఁ దల్లిఁదండ్రిఁ జి
న్నెల నెఱియాటలందనియ • నించి జెగాజిగిఁ జేఁ జెలంగఁగన్॥ 59

టీ—చిన్నియ...కల్గి=శుభలక్షణములు గల్గిన చైత్ర శు ౯ లు పునర్వసు నక్షత్రమున జన్మించి, చిన్నిలేనెలలు=చిన్నవైన చంద్రకళలు, జెగాజిగి=శ్రేష్ఠమైనకాంతి.

తే॥ అలర నాల్గేళ్ళయొక్కటి • యైనయట్టి
అక్కరన్ రాకడంజేర్చి • దక్కినాన
నాఁడనే సన్నయయ్యెదా • నట్టి సన్న
కన్నయయ్యలఁ గడిదయ్య • కెన్ననిడియో॥ 60

టీ—నాల్గేళ్ళ యొక్కటియైనయట్టి యక్కరన్=నాలుగేడులు నిరువదెనిమిది, యొకటి (ఇరువదితొమ్మిది) 29 వ. రాకడంజేర్చి దక్కినాన=రాకు దక్షిణముననుంచినయే పేరగునో యది. (రాముఁడు)

తే॥ కైకగన్నట్టి యతనికి • గడకనిండి
నాతఁడని లెస్సనెచ్చెలి • యాఁగఁగన్న
యన్నలిద్దఱ కంత ల • చ్చన్న, యెదిరి
నడఁ చేతండనియెడి నన్న • లడరనిడెయో॥ 61

టీ—నిండినాతఁడు=భరతుఁడు, లెస్సనెచ్చెలి=సుమిత్ర, లచ్చన్న=లక్ష్మణుఁడు, ఎదిరినడఁ చేతండు=శత్రుఘ్నుఁడు.

ఉ॥ చాలఁబదాలరాచనెల • సంతలరారఁగఁ గాంచి, నన్నలం
గ్రాలఁగఁజేసి యంతట జేగా లగనానన యేన్నిగల్ దగం
గ్రాలఁగఁ జేన్ని దాలిడియెఁ • గ్రిచ్చెబ నల్కత లట్టనేర్చితే
జీ, లబదాల నెక్కియనిఁ • జేయఁగఁ జేసెఁదనంతగా, నటన్॥ 62

టీ—జేన్నిదాలిడియె=యజ్ఞోపవీతము లిచ్చెను, లగనానన్=లగ్నమందు, నల్కత లట్టనేర్చి=చతుర్వేదములు వింతగానేర్చి, తేజీ... నటన్=తరువాత గజారోహణాదులఁ దనవలె నేర్పించె.

క॥ ఆనత్తైగ లయ్యలఁదే। జానంగ్రాల్ కడిదియయ్య• నలరఁగ నెంతే
జానయిన నన్నఁజీరినఁ। గానఁగరాక యడఁగెడని • కడగండ్లెల్లన్. 63

టీ—నత్తైగల...యయ్య=రాముఁడు, జాన...రిన=రామాయని పిల్చిన, కాన...డ్లెల్లన్=కష్టములన్ని పోవును.

చ॥ తనకడ కంత రాచజేడ•దారి దడాదడిరాగ, నాయనం
దన, కడరంగనైన నేల•దారి నలర్చఁ, గడింది చిన్నలం
దనకడ జేన్నెగాయఁ, దన•దారిని నంచె, నడింగినంతనే
తన, కడ, లెత్తి కీలెఱిఁగి • దంటలచే, నలరాయఁడంచినన్॥ 64

టీ—రాచజేడదారి=రాజర్షి (విశ్వామిత్రుఁడు), కడింది, చిన్నలన్=పెద్దవానిని, చిన్నవానిని (రామలక్ష్మణులను), జేన్నెఁగాయన్= యజ్ఞరక్షణసేయను, దంటలచే=నేర్పరులచేత, అలరాయఁడు=ఆదశరథుఁడు.

## —• తాటకవధ •—

ఉ॥ తారటనేగి, రేగికనఁ • దాటకఁ గీటడఁగించి, లెస్సకే
లారఁగలట్టి దిట్ట, నిల • నారిచి, యాతనియన్న రెచ్చఁ, దీ
రారఁగ లచ్చినన్న నెల • యయ్యకడన్నిలఁజేసె, నాదటం
జేరఁగఁదీసి సంతసిలి • చిల్కిడె రానెల కాతఁడిచ్చచేన్॥ 65

టీక—లెస్స...దిట్ట=సుబాహుఁడు, ఆతనియన్న=మారీచుఁడు, లచ్చినన్న=రాముఁడు, నెలయయ్య=చంద్రునిజనకుఁడు (సముద్రుఁడు) రానెఁ=రాజచంద్రుఁడు (రాముఁడు) ఆతఁడు=విశ్వామిత్రుఁడు, ఇచ్చచేన్=కోర్కెచేత.

క॥ రాజేడదారి, తనంతటఁ। దేజేడరఁగఁ జేయనైన • తిన్ననిజేన్నెం
బాజెడకచేసిరానెల। లాజేడియని లాగెనంద • నతఁడగ్గించెన్॥ 66

తే॥ అంత, నానేలతెఱఁగంటి • యనియె లచ్చె
నన్నకన్న! యీదరినేల•నయ్యనన్న
రాచనెలకలఁ, డాతని • రాచదాని
చిన్నియల నెన్నఁజాల రే • యన్నలైన॥ 67

టీ—అయ్య...నెఁ=తండ్రిపేరిటి రాజచంద్రుండు (జనకరాజు)
రాచదాని=రాజధాని, చిన్నియ=చిహ్నము.

—* సీతాజననాదికము *—

సీ॥ రాకాసిరాయని • రాచదానిని సిరి
గద్దెలనీటియి•క్కఁదగి రక్క
సినిచేఁ గడలిని • జేర్చనై యలతండ్రి
నన్నరారాయని • జన్నె నేలఁ
జిక్కియారాయని • చేసాఁకఁగానయి
సీతనాగా నన్న • చేతఁ దనరి
నట్టి కన్నెంగన్న • యట్టి రానెల దన
తెంకినిగల, నేల • తేరిజేని

తే॥ సింగిణిం గండ్రికలఁజేసి • చెలఁగినట్టి
రాచరేజేని కిడియెద • రహినిఁగన్నె
దంట,నని తిగనేలల • దనరఁజాట
నని చె లెంకల నేలజేం • డ్రిఱిగి రంత॥ 68

టీ—రాకా...నిని=రాక్షసేంద్రుఁడైన రావణు రాజధానిని, సిరి
యిక్క=పద్మాకరము, తండ్రి నన్నరారాయని=జనక మహారాజు యొక్క,
తెంకి=ఇల్లు, నేల...సింగిణి=భూరంధుఁడైన శివునివిల్లు, గండ్రికలఁజేసి=
ఖండించి, తిగనేలల=ముచ్చోటులు (త్రిజగములు)

క॥ ఆక న్నాచె న్నాచె న్నా, కన్నాకైన కన్నె • కలరె నినంగా
నాకన్నియ సిరికన్నియ। కా కన్నెఱిగలదె లాతి • కన్నెలకన్నా!

టీ—కన్నాకైనకన్నె=శ్రేష్ఠమైనకన్య, సిరికన్నియ=లక్ష్మి, లాతి
కన్నె=ఇతరకన్య.

—• అహల్యాశాపవిమోచనము •—

మ॥ అననిట్లానెఱరాచకేదానిఁ గనఁగా • నారాయ లేగంగ, దా
రిని, గాల్డాకిన,ఱా, నెఱానెలతయై • రేతేనిరేకా? కరం
గిన విన్నైనకడానిరేక? యిఁక నా • గేదంగిరేకా? యనం
గ, నిలంగాఁ, గని, లచ్చెనన్న తెలియం•గా నడ్గఁగా, నింతి, నా
న, ననంజాల కనెం, దగం, దనకతం • దాచెంగలే కింతయేఁ॥ 70

టీ—ఆనెఱ...దాని=ఆరాజధాని, ఆరాయిలు=ఆరాజేలు, ఱా=బండ, నెఱానెలఁతయై=సంపూర్ణయౌవనవతియైన కాంతయై,(అహల్య) రేతేనిరేకా=చంద్రరేఖయా? కరం...రేక=కఱగిపోసిన బంగారు రేకా? గేదంగిరేక=మొగలిరేక? నాన=సిగ్గు.

క॥ అనికెంగేలిఁ దలంజేర్చి, నిలచి రాచేనెలకెఱఁగి • చెచ్చెరఁదన కా
చినరాయలెఱఁగ నగ్గిం చి, నడఁచెఁ, దనతేనిఁజేరఁ•జిన్నతఁ డలరన్.

టీ—ఎఱఁగి=నమస్కరించి, అగ్గించి పొగడి, చిన్నతఁడు=చిన్న రాముడు.

—• రామఁడు శివునివిల్లు విఱచుట •—

సుగంధి॥ చెంగలిం, చేడంద, నంతఁ • జేరి రల్లతండ్రిస
న్నం, గలట్టి నేలతే, న్గ•నంగఁదా, రతండటం
జెంగటందలిర్చఁదార్చి • సింగిణి, న్నెలంతఁ గా
నంగఁజేసి యిద్ది, లగ్గ • నంగ నెల్లరాదటన్॥ 72

టీ—తండ్రి...తేన్ = తండ్రిపేరిటిరాజేను (జనకరాజేను) సింగిణి=విల్లు, లగ్గు=మేలు.

శా. ఈసింగాణిని నెక్కిడం గలయతం • డీచిన్నిసింగారిఁ దా
నాసించెం దగినట్టి డన్న, నిలతేం • డ్రింతేసి నెత్తంగలే
కాసింగాణికడ, న్నిలంగ, నెదఁద•న్నాసించేఁ గాసీత, రా
కాస్నింజెండిన రాఁయఁడెక్కిడియెఁ జె•క్కుల్గాఁగ సింగాణినిన్. 73

టీ—సింగాణి = విల్లు, చిన్నిసింగారి = చిన్నదైన శృంగారవతి, రాకా...యఁడు=రామఁడు, చెక్కుల్గాగ=తునుకలుగాఁగా, ఎక్కిడియె=ఎక్కుఁబెట్టె.

సుగంధి. తండ్రిసన్న నేలతేఁ, డొదంజెలంగి సింగిణిం
గండ్రికల్లఁజేసినట్టి • గట్టి చిన్ని నేలరా
తండ్రిరాగఁజేసి లెస్స • తగ్గఁగట్టినాట, రా
తేండ్రినందఱుం, దగంద • రెచ్చఁజేర్చి లగ్గనన్. 74

టీ__సింగిణిం...తండ్రి =విల్లువిఱిచిన చిన్నరాజుతండ్రి = దశరథుఁడు.

—• సీతాకల్యాణము. •—

ఆ॥ నె॥ లచ్చె సన్నచేత • లలిసీత, కఁటఁ దన
కడన, గలిగినదణి • కన్నెల, కల
లచ్చెనన్నకడఁ జెలఁగఁ, గల్గినట్టిరి
చేతఁ దాళ్ళఁగట్టఁ • జేసి కడఁక॥ 75

టీ__లచ్చె...చేతన్=రాముని చేత, తన...దణి=(జనకు) తన చివరగల్గినవాఁడు (తమ్ముఁడు) కన్నెలకున్=ఊర్మిళామాండవీశ్రుతకీర్తులకు, లచ్చె...చేతన్ రాముని వెన్కగల్గినవారు లక్ష్మణభరత శత్రుఘ్నులచేతను, తాళ్ళన్=తాళిబొట్లను.

పంచచామరము.

కడాని జీనిచేలల న్నిఁగన్నిగ న్నగల్తైగ
ల్కడాని తేర్ల, హత్తి, కత్తలాని లెంకదండ్ల, రా
య, డాని నట్టిసంతసాన • నాజిగన్న చిన్నితేం
డ్రి, డాయఁదీసి యీయఁజేసి : నాడెకాండ్రచేతనే॥ 76

టీ॥హత్తి=హస్తి, కత్తలాని=గుఱ్ఱము, రాయఁడు=జనకమహారాజు,

తోటకము॥ తనరం, దనకన్నెలఁ • దాయఁగఁజే
ర్చి, నడం, దగినట్టిది • చెచ్చెర, నా
డి, నగల్ నెఱిచీర, లడింగినయ
ట్లన నానిడి యంచు: జెలంగియెదన్॥ 77

టీ__నడం దగినట్టిది=నడుపదగినట్టిమంచిదారిని, అడింగిన=అడిగిన.

—* భృగురామగర్వభంగము. *—

ఉ॥ అంచిన నాండ్రఁదా రెనసి • హాళినిఁగాంచి చేసంగ దారినం
కించిన కిన్కరాచె లెగఁ • గీటడఁగించిన జెన్నిగట్ట టే

తెంచిన సీతఁ దేఁడెఱిఁగి ♦ తేర్చెఁగఁ దాననిఁ జేయఁడాయ, నేఁ
తెంచినజోడ నాతఁ డనఁ ♦ దేఁటగఁ, గండడఁగించె దేఁ, డనిన్॥78

టీ—రాచే...గట్టు=రాజసమూహమునుద్రుంచిన పరశురాముఁడు, అనిఁజేయన్=యుద్ధముఁజేయను, తేఁడు=రాముఁడు, అనిన్=యుద్ధమందు.

స్రగ్విణి. నేలజేజే కడిం♦ దిం దగం, డించియ
న్నేలకన్నిం జేతం ♦ దేరనేచేర్చి, తేఁ
డేల గల్ నేల్కకై ♦ యేగె దానెంతయేం
గ్రాలఁగా నిచ్చసం♦ద్రాన కన్నయ్యతాన్. 79

టీ—నేలజేజే=భూసురుఁడు (బ్రాహ్మణుఁడైన పరశురాముని యొక్క) కడిందిన్=ఘనతను, తేఁడే...యేగె=అయోధ్యకు వెళ్లెను, ఇచ్చసంద్రానన్=ఇచ్ఛాసముద్రము, కన్నయ్య=దశరథుఁడు.

ఉ. సజ్జల నిల్చి రానగర ♦ సన్నని చీనికడానిచేల, లా
హజ్జల దాకఁదాల్చి, నెఱ ♦ హాళిని జెక్కునిరాయఁడెక్కుగల్
గజ్జెలకట్టలాని తెగ♦లా? యనఁ జేడియ లానిచెల్లిరా
యజ్జెలసెం గదాయనిచు ♦ య, య్యిలరాయలయంద నేసలన్. 80

టీ—సజ్జలన్ = మేడలందు, హజ్జలదాకన్ = పాదములదనుక, చెక్కునిరాయఁడు=మన్మథుండు (అతడు) ఎక్కు...తెగలా=ఎక్కునట్టి గజ్జియలుగట్టినచిలుకలు, అజ్జెలసెన్=సమయము చిక్కెను, అయ్యిల...యంద=ఆరామలక్ష్మణభరతశత్రుఘ్నులందు, నేసలన్=లాజలు.

.. వనమయూరము.

హత్తినకడిందినెఱి ♦ నాజినెఱసంతా
సత్తినలరం గనిన ♦ జోణయొఱిగించేన్
హత్తిననెలంత లల♦రారఁ జెతరా; గే
ల్లెత్తిలలి తల్లితెగ ♦ నెంచిరి గిడిగిళ్ళన్. 81

టీ—ఆజినెఱసంతు=రాముఁడు మొదలైనవారు, సత్తి...జోణ=శక్తినిగన్న వసిష్ఠుఁడు, హత్తి...రాన్=సీతాదులు వెంటరాగా, తల్లితెగను=కౌసల్యాసుమిత్రాకైకలు, ఎంచిరి=అగ్గించిరి, గిడిగిళ్ళన్=నమస్కారములు.

ఉత్సా. ఆండ్రఁ జేకనయ్యయాట • నాజిఁకన్న చిన్నిరా
తేండ్రిటం దగంగహ త్తి • రెచ్చి చెలఁగిరెంతయే
నాండ్రితేండ్రి చెన్న నంగ • నదియ యంచే సంగః జె
ల్కాండ్రినంగ సజ్జెలంద • కలిగిన ననసెజ్జెలన్.

టీ—ఆండ్రన్=భార్యలను, చేకనయ్యయాటన్=మన్మథక్రీడ లందు, సజ్జెలంద=మేడలందే ననసెజ్జలన్=పూలపాన్పులందు.

—• పట్టాభిషేక ప్రయత్నము, నరణ్యగమనము •—

సీ. అన్నిఁటఁ దనయంత•యై రాచనెఱియెల్లఁ
జెన్నార నేర్చి పెం•చ్చెల్లినట్టి
నేలకన్నియ జేని • నేలకేలికజేయ
నెంచినయెడఁదఁ గ•లంచికైక
గట్టి చేకట్లాడి • గట్టిగాఁ దనకన్న
జేని నీయిలకెల్ల • తేనిఁజేయ
నాఁగటిచాల్పన్న • నాతినాయని నార
చీరలారఁగ నిడి • చేరి కాన

తే. టెంకి సేయించే నాజి న•డిగినరాయఁ
డెడఁద బాఁజేసి దానికి • నేదినాక
నట్టెనిలచినఁ గని లచ్చ • నన్న కడక
నారచీరెలఁదాల్చి క•నంగ నచట. 83

టీ—రాచనెఱి=రాజధర్మము, నేల...యెడదన్=భూమికన్యా భర్తయైన రాముని రాజును జేయఁబూనిన దశరథు మనస్సును, నాఁగటి...నాయని=రాముని “సీతాలాంగలపద్ధతిః” అమరము. నాగటి చాల్పన్న నాతి=సీత.

క. తనచెలిఁగని జేకిగిన, నం।తన నంతం దెలియఁజేసి • తనతల్లిని దం
డ్రిన తెలిచి నిలఁగనాడిన। నెనరదరఁగ సీతయిట్ల•నియె రాయనికిన్.

టీ—తన...డ్రిన=కౌసల్యాదశరథులనే, తెలిచి=కొలచి, రాయ నికిన్=రామునికి.

ఉ. తాళిని నత్తిఁగట్టి, నల • దారిఁగలాని దరిన్నిజేన ని
ల్లాలినిగా, నిగాఁగనెద • నన్నదణిం డిగనాడినట్టి యి
ల్లాలిని గంటఁగాంచెదరె • యక్కట? యెట్టిరనంగ నంతటం
జాలిని నాలిజేంటనిడి • సాగిన సాగిలితల్లి కయ్యెడన్. 85

టీ—తాళిని=మంగళసూత్రమును, అత్తిన్=కంఠమునందు, నల దరిన్=నల్లని దారిగలవాని (కృష్ణవర్త్మ) అగ్ని ని నిజేనన్=నిక్కముగ.

ఉ హెచ్చిన సంతసాన నెద • నీరల నాదెసకాఁదలంచి, నిన్
నచ్చిన లెంకనిందిడి, చే • దం, గననెంచితే యన్ననంత, నా
లచ్చిన జంటజేర్చి, తన • లాగఁటఁగాంచిన యట్టిరెంతయే
నెచ్చిన యంగదం గనఁగ • నెక్కటికాన కతం డఁటంజెనెన్. 86

టీ—ఈరలన్=మిమ్మును, నాదెసకాఁదలంచి=నాదిక్కుగానెంచి అట్టిరు=అటువంటివారు, అంగద=కష్టము, అతండు=రాముఁడు.

చ॥ నగరఁ గలట్టి, రిట్టిది క•నం దనకేతగె నిద్దియేరికే
న్దగినద? యంచేసంగఁగఁ ద • నందెగడం దగనాలకించి, తేఁ
డగ, డెదఁజెంది కంది, తన • యందన కల్గిన కం దడంచేఁగాఁ
దగినదియైన సాదన నె•దం గననేరక కల్కికిల్లనెన్. 87

టీ—నగరగలట్టిరు=పట్టణమునఁగలవారు, సాదన=సాధన, కల్కికిన్=భార్యయైనకైకకు.

—• దశరథు విచారము- మరణము. •—

క॥ కైకా! కడకీ కలకల! కైకా, కైకింత కంది • కైన కలికి, కం
దా కానఁ గలికిజేత, నకటా! కాకికి సాటిగా న•డఁగఁదగెనని తాన్.

టీ—కడకున్=చివరకు. ఈకలకలకున్+ఐ+కా=ఈనీయొక్క కల్లలకైకదా, కైకికిన్=చేతికి, ఇంతకున్=ఇప్పటికి అందికైన=ఎదిగితయాకైన, అనఁగా రాజకార్యములను తగనట్లు వ్యవహరింపఁదగిన, కలికికందు=మనోహరమైనబిడ్డ, (రమింపఁజేయువాఁడు గాన, రాముఁడు) కలికిజేతన్=సీతతోఁగూడ.

సీ. కానకకన్న సం•తానంగనేటికిఁ
గానక కన్న సం•తానమయ్యె
జెట్లిండఁదిరిగెడి • జెట్టి తానేటికిఁ
జెట్లిండఁదిరిగెడి • జెట్టియయ్యె

నెత్తాలనాడఁగం • దిట్టరా నేటికి
నెత్తాలనాడఁగం • దిట్టయయ్యె
నెఱసరితెగలెన్న • నెగడయ్యనేటికి
నెఱసరితెగలెన్న • నెగడనయ్యె
తే. హత్తిచెక్కిళ్ళనీటిని • హత్తితడిసి
నట్టి రాదారి, నడయాడ • నట్టిడచేట
హత్తి చెక్కిళ్ళనీటిని • హత్తితడిసి
నట్టిఱాదారి నడయాడ • నయ్యెనకట. 89

టీ.__కానక=చూడక అనగా లేక, కానక=అడవికే, ఏవార్థకము; జెట్లండజ=వీరులయందను, చెట్లండజ=చెట్లదగ్గర, నెత్తాలు=మేదలపై చోట్లు, కొండలపై నేలలు, నెఱసరి తెగ=శూరసమూహము, లేక సింహసమూహము, హత్తి=హస్తి (ఏనుగు) రాదారి=రాజమార్గము, ఱాదారి=ఱాళ్ళమార్గము, అచట=అడవిని.

ఉ. రాయని తండ్రి! కంటణఁచే • రాయని! తల్లియనంగ నింత, కా
రాయని, చెంతఁజేరి కన • రాయని, నేననికానకంచి నా
రాయని, దాచేనేలయన • రాయని, నా రతనాలతిట్ట కా
రాయని, యేడ్చిచేరె నిల • రాయనిరా, తెలుగంటిరాయనిన్. 90

టీ.__కంటు=పగ, నారత...కా=నారత్నముల కుప్పగాదు!

—* సీతారామలక్ష్మణులు గంగందాటుట *—

క. చేఁగ దలిర్పఁగ నక్కడ।నాఁగఁటిచొల్పన్న నాఁతి • నాయండెంతే
సాఁగిచేదలేటిదాటం।గాఁ గనఁగఁ, గలానఁదగిన • గద్దరియంతన్.

టీ.__చేఁగ=చేవ (సత్తువ), నాఁగటి...నాయఁడు = రాముఁడు, చేదలేఁటిన్ = ఆకాశవాహినిని, (గంగను) కలానన్=కలమున, నవగా నోడయందు, తగినగద్దరి=ఉన్న గుహుఁడను పల్లెవాఁడు.

ఉ. ఱాతిని వాఁతిగాఁగఁ దనపరం, జేరిగించిన దంటకా, లికే
లాతిని జేయలేదని, కలాన కెడందఁగలంకి, గ్రద్దనం
జేతినిసాచి రాచేనెల • సీతక గాళ్ళఁగడింగి తాలిచెన్
నాతినిఁ దాల్పఁజేసె, నిల • నాయనికాల్కడనీటి, నేటిలన్. 92

టీ—తాతిని...దంట=పాషాణమును, నహల్యగాఁజేసిన రాముని యొక్క, కాలు=పాదము, ఏలాతిని=ఏయితరవస్తువును, చేయలేదని=మనుష్యరూపముగా మార్పలేదాయని, కలానకున్ = తనయోడకు, ఎడందఁదలంకి=మనస్సులో జడిసి అనగా రాముపాద మీఁదయోడ నెక్కడ మనుష్యునిజేయునోయని కడిగి తత్పాదజలము భార్యాసహితముగ శిరమున ధరించెనని భావము.

ఉ॥ జాలరిరాయఁడంతఁ దన • జెంటఁ గలాన నిలంగఁజేసి నీ
ర్జాలఁటఁదాటఁజేసె నిల • రాయని, నయ్యిలకన్నె, లచ్చనం;
జాలఁగఁ, దారఁటంగదలి • జాలరినెంచి పేనంగ; నేలజే
జేలఁటఁగాంచి యెంచఁజన • చేతల రాయఁ డటింగె నాదటన్. 93

టీ—జాలరిరాయఁడు = గుహుఁడు కలానవిలంగఁజేసి = పడవయందు నిలుచుండఁజేసి నీర్జాలు=గంగానదిని ఇల...లచ్చనం=రాముని సీతను లక్ష్మణుని నేలజేజేలు=భూసురులు.

ఆ. వె. చిట్టకిల్లనంగఁ • జెట్టిన నన్న చేఁ
దగిన గట్లజేని • దరిసి దాని
నెక్కి లచ్చెనన్న • యిలకన్నె లచ్చన్న
నిలచి రచేట నంతఁ • గలకఁజెంది. 94

టీ—చిట్ట=చిత్రము ఇల్లు=కూటము (చిత్రకూటము)

—• భరతుని రాకడ •—

మత్తకోకిల. తాతయింటన నిల్పినట్టిపై• దంట గద్దరికైక క
న్నాతనిం నగఁజీర నాయన • యాజికిం దెలిఁగంటి న
ట్టాతఁ డంచెడి చేతలన్నిఁటి • నంతటం దనరారఁగా
నాతఁడిం పెరిగించి కానల • కన్న యేగె నటంచటన్. 95

టీ—తాతయింటన్=కేకయదేశాధీశుఁ డగు యుధాజితు నింటియందు, కైకకన్నాతనిన్=భరతుని ఆజికిన్=అజమహారాజు కొడుకైన దశరథునికి తెలి...న్నిఁటిన్=దశరథుడు స్వర్గముజెందు పనులు (పితృకర్మ) అన్న=రాముఁడు

శా. జెందానం గలకంది కంది, తనతం•డ్రింపల్లి నెగ్గాడి నే
నిం దూనర దగ దన్న లేనియిలు నం • చెంతేని నన్నేలరా

ఛందానం దగినట్టి దంచెత్తేగి, తే•జోరంగ నన్నం దగం
గం దా నంతటఁ గాంచియెంచి తనరా•కం దాచె కేయాడితాన్. 96

టీ—డెందానం=హృదయమందు, కలక=కలవరపాటు, అంది=పొంది, కంది=కృశించి, అన్న లేనియిల=రాముఁడు లేనిభూమిని, ఆనం దగదు=పొందగూడదు, అన్నెల...దానన్=ఆరాముని వలెనే,తగంగన్ తగునట్లు, తాన్=తాను (భరతుఁడు)

—• రాముఁడు తండ్రికిఁ దిలోదకాలిడుట. •—

తే. తండ్రి తనచెలి లెఱఁగంటి • దణిని గాంచె
నేగె నన్నంత సీతతోఁ • డెదఁ గయినిడి
కలఁచినట్లెంతయేని దాఁ • గస్తిఁజెందె
నలిసి లచ్చన్న చిన్నత•నాన నేడ్చె. 97

టీ—తండ్రి=దశరథుఁడు, తనచెలి=తన మిత్రుఁడు, లెఱఁ గంటిదణి=దేవేంద్రుఁడు, కస్తి=కష్టము;

తే॥ అన్న లచ్చన్నలం జేర్చె • నాతఁడంతఁ
గలసి లచ్చన్న నిలరాయఁ • డఁరఁదండ్రి
కాలి జేజేల చక్కిని • నందఁదగిన
చేత లన్నింటిజేరిగించెఁ • జెలిదరి నిడి. 98

టీ—ఆతఁడు=భరతుఁడు అన్న...దేర్చె=అన్నదమ్ముల (రామ లక్ష్మణుల) నోదార్చెను, ఇలరాయఁడు=రాముఁడు, జేజేలచక్కిని= స్వర్గమును, చెలిదరినిడి=సీతనుదగ్గరనుంచి.

ఉ॥ అంతటఁ గైకకందెనసి • నట్టి రహింద నయన్నఁజేరి యూ
రింతటఁ డెంకిఁజేరి, తగ • నీ యిల నేలఁగ దేయటన్న, తేఁ
డంతటఁ దండ్రియానఁ దన • యట్టిడ దాటిన దాటరయ్య నే
లంతట నిండినట్టి, రన • నాయన కస్తినిగాంచి యంతటన్. 99

టీ—కైకకందు=భరతుఁడు, ఎనసి...రహిన్=కలిసిన మైత్రిని, తనయట్టిడ=తనవంటివాఁడె, తండ్రియాన=జనకాజ్ఞ, నేలం...రన=భూమియంతట నున్నజనులు, కస్తి=కష్టము.

మ॥ తనకల్కిందన నిచ్చెనిచ్చెటనె తెం•తంజేరి తాఁదెల్పి, ల
చ్చనకం తంతట జెంటనిల్లనఁగ, రా•చం, దాతనింగాంచి, సం

తనగాఁ, గాళ్ళఁదగిల్చి చేర్దగినజెం•టం జేతికందిచ్చి, యం
చినదానేగెఁ గడంక నన్నగని జే•జేల్ జేసి యాంతం డటన్. 100

టీ—తనకల్కిన్=సీతను, తనన్=రాముని, ఇచ్చెన్=కోర్కెతో, తాన్=తాను (భరతుఁడు) లచ్చెన...నగ=లక్ష్మణునకుఁ దోడుగానుండుననగా, రాచెందు=రాజచంద్రుఁడు (రాముడు) కాళ్ల...జెంటన్=పాదములదొడుగుకొని వెళ్ళఁదగిన జోడు (పాదుకలు)

—• భరతుఁడు నందిగ్రామము జేరుట. •—

క. నగరంజేరక కన్తిని । దిగకంటందగిన జియ్య•తేజీసన్నం
దగ నలరారిన చక్కని । నగరంజేరి యిలనేలె • నలినతఁడెంతే. 101

టీ—తిగ...జియ్య=మూఁడవకంటిచేత నొప్పినప్రభువు (శివుఁడు) తేజీ...నగరన్=వానిగుఱ్ఱపుబేరుతో నొప్పిన చక్కనినగరము, అనగా నందిగ్రామము.

—• అనసూయ యంగరాగము లిచ్చుట. •—

ఆ. దారి, నత్రి, జేడల•దారితేఁ డాతని । చేడె చేసిన కయి•సేతలన్ని
తనర నేల•కన్నె తానంది యన్నేల । కన్నె రాయఁ డంత•గడలిసరగ.

టీ—జేడల...తేడు=ఋషిశ్రేష్ఠుఁడు, ఆతనిచేడె=ఆయత్రిమునిభార్యయైన యనసూయ, కయిసేతలు=అలంకారములు, నేలకన్నె=భూమికన్య(సీత)

—• దండకారణ్యవర్ణనము •—

సీ. లేళ్ళచే, వాత్తితఁ•త్తళ్ళచేఁ గణితిత
గళ్ళచే, సత్తిత•త్తళ్ళచేతఁ
దాళ్ళచే, నెఱరస•దాళ్ళచే, దాకనే
ఱేళ్ళచేఁ జిన్నెఁఱఁ • జీళ్ళచేత
నేళ్ళచే, నైన సం•దళ్ళచేఁజెదరిన
నీళ్లచే నఱిగిన • ఱాళ్ళచేత
దార్లచే, ఱెక్కల • బార్లచేతం, జెట్లఁ
జెఱ్ఱాడఁగల సర•దార్లచేత
తే॥ నేఱ్ఱకడసిలిచిన జెడ•దార్లచేత
ఱింగిణిని రతనాల్ దీటి • నింగిచెంతఁ

జేర్చియాడెడి కలికిచెం•చితలచేతఁ
దగినదండకిఁ జేనియెడి • తఱిని నంత॥ 103

టీ__సత్తితత్తళ్లు = శక్తివాహనములు (సింహములు) లేడి లేడులు, లేళ్ళు అంతటనిట్లై.

చ. తనచెలి సీతఁజేతఁగని • తక్కటితెక్కలి రక్కసీడటెం
గిననెదఁగాడఁజేసి యడఁ•గించెడి, చిల్కడరించి యాతనిం
గన లెదరేగఁగా నడఁచి • కల్కినిదేరిచి సాగియేగి తాఁ
దనతెలిగంటితాల్చి జేడ•దారి తెగల్కయిసేత లాదటన్. 104

టీ__తక్కటి...గిన=టక్కరిదొంగరక్కసుఁడువెళ్ళిన, చిల్క= బాణము, తెలిగంటి=ధవళాక్షి. కయిసేతలు = అలంకారములు, ఆదటన్=అటుతరువాత.

__* పంచవటి, శూర్పణఖచేష్టలు *__

క॥ ఏనయిన చెట్లచెంగట । జానయిన ట్లాకలాలఁ • జేరచినటెంకిన్
రానయిన యంగదలకిది।యానయిన దనంగఁగట్టి • యచేటనిలంగన్.

టీ__ఏను+ఇన=ఇన్నైన,అంగదలు=కష్టములు,నిలంగన్=నిలువగా.

ఉ॥ రక్కసితేనిచెల్లె, లిల•రాయనిఁచేరి, కడిందియాసఁ దన్
జెక్కనియయ్యయాఁటల, సా•సంగఁగఁ దేల్చగదేయటన్న, తేఁ
డక్కడి లచ్చినంగనిన • నాయన దానిని నల్లగారఁగాఁ
జెక్కఁగఁ, గల్కి కిన్కఁగని • చెచ్చెర రక్కసితేనిఁ జేరె తాన్.

టీ__రక్క...చెల్లెలు = రాక్షసరాజైన రావణుచెల్లెలు (శూర్పణఖ) చెక్కని...యాఁటలన్ = మన్మథక్రీడలయందు, నల్ల = రక్తము, కిన్క=కోపము.

__* శూర్పణఖ రావణునకు రామునివార్త దెల్పుట *__

శా॥ అన్నా! రక్కసిరాయ! చెక్కసిడెనె•న్నున్నన్న! యన్నేలరా
కన్నా, కంటటనేగకే తత్తఱిగ నా•పన్నట్టి, రెంతే వినిం
ద, న్నాగంగ; పిదేల సీకడక నా•తం డెంత కానంగలే
కన్నా! యీతటినిన్లచేసెఁ దెలియం•గాఁ జేసె దాలించేటన్॥ 107

టీ—నన్నున్=శూర్పణఖను, అన్నన్న, ఆశ్చర్యము, అన్నేలరాకన్నాకు=ఆరాజశ్రేష్ఠుఁడు, సీకడక=నీధీరత్వము, ఆలించు= వినుము, ఈతటిన్=ఈసమయము.

క. చెక్కని రిక్కయనంగాఁ । జెక్కని జేజేకడాని ♦ జెక్కియనంగాఁ
జెక్కందనాల కన్నిఁటి । కిక్కయనఁగ నేలతేని ♦ యిల్లా లలరెన్.
టీ—రిక్క=చుక్క, (నక్షత్రము) చెక్క...జెక్కి=మన్మథుని యొక్క గుజ్జము, ఇక్క=ఇల్లు, ఇల్లాలు=భార్య.

క. ఆకన్నాచె న్నాచెన్నా కన్నాకైన కన్నె ♦ కలరెననంగా
నాకన్నియ సిరికన్నియ । కా, కన్నెటికలదె లాతి♦కన్నెలకన్నా!
టీ—కన్నాకు=శ్రేష్ఠము, అన్నె...టి=అయందము, లాతికన్నెలకుఁ=ఇతర రాజకన్యలకు.

ఉ. కానల నాకలాలఁదిని ♦ క్రాగిన నీటినిదాగ్రి, కాకికి
డ్డై నలగంగఁ జెట్లనడ♦యాడెడి రాయనిసన్నదారికా
చౌనల దంటఁగట్టి, తన ♦ సడ్డకెడందఁ దలంకి తాలిచెం
దానలతాతపన్న, నిఁకఁ ♦ దాల్చఁగనేఁటికి స్రిష్ట దానినే. 110
టీ—రాయని సన్నదారి=రాజనామధారి, సడ్డ=తప్పు, తాత=బ్రహ్మ, స్రిష్ట=బ్రహ్మ.

క నీటెఁసిన యాకన్నియ । నీటెంకిని నరగఁజేరి ♦ నిలిచినఁ గరి జే
జేటెంకి కెగఁగఁ జెలఁగిన । నీటెంకిని సిరికిజేతగ ♦ నీటలరన్నా! 111
టీ—నీటు=ఎనసినఁ, నీటెంకిని= లంకయందు, కరి...టెంకి=విష్ణునివాసము.

మ. అనఁగా రాచెనెలంతదంట, నెదహో ♦ చైచ్చనట్టి లాగెన్నిసం
తనఁగా రక్కసిరాయ డక్కడలి నా♦నంజేరనై, లెస్సచే
తినిఁ గ్రాలిక్కసియన్నఁజేరి యతఁడెం♦తే నిచ్చనగ్గించి, కాం
చి, నిగా నాతనిదైన గ్రిచ్చెడిగినఁ ♦ జేజేలకంటిట్లనెఁ. 112
టీ—రక్కసిరాయడు=రావణుఁడు, కడలిఁ=సముద్రమును, ఆనఁ=దగ్గరకు, లెస్స...యన్నఁ=సుబాహుని యన్నయైన మారీచుని. జేజేలకంటు=దేవతలవిరోధి (రావణుఁడు)

ఉ. ఏనయినట్టిచెట్లకడ ♦ నెక్కటిరాచెగయాలి నిల్చి నాఁ
డేనయినట్టిదెంచెకతఁ♦డేకద చెల్లెలిఁ జెక్కె నిన్న నే
రానయినట్టి కస్తికిది ♦ రా, నెఱతెన్నన నాగయాలికిం
కేనయినట్టి దింతటన ♦ యేనెఱిగించెద నాలకించెటన్. 113

టీ__ఏన...కడ=పంచవటిదగ్గర, ఎక్క...యాళి=ఒకరాజ ధూర్తుఁడు, కస్తికి=ఆపదకు; నెఱతెన్ను=నిండుదారి, ఏనయినట్టిది=నేను రావణాసురుడనని.

—• మారీచునిరాకడ •—

క॥ కాదనక లేడియై చేని । నీదంటతనాన నచేట • నెటేనడయోడఁక
రాదణి కలికికినై వి।న్నాదట దానంటిరాగ • నట నాచెలినిన్. 114

టీ__రాదణి=రాజశ్రేష్ఠుఁడు, దంటతనము=నేర్పుతనము.

శా॥ తేరంజేరిచి తెచ్చిలంకనిడ దెం•తేనాఁగ, రాకాసి స
ర్దారిం, జే, నదలిఁచి యిట్టినడకల్ • రాదెంచే, నన్నన్న! నే
ర్దారిం జేరఁగ నాకడిందిచేనలే•దా? రాజేడల్దారి సిం
గారించేంగల జేన్నె నేల; ననఁగి•న్కఁక రక్కసీఁ డాతనిఁక. 115

టీ__ఎంతే ననఁగఁక=ఎక్కువగా ననగా, రాకాసిసర్దారిన్=రావణాసురుని, రాజేడల్దారి=రాజర్షి (విశ్వామిత్రుఁడు)

ఉ॥ కాంచి కడిందిలెస్సయిన • కైగలరక్కసిరేని యన్నఁ, గా
రించిన నెట్టకేల కెది•రించిన నెగ్గని కేలసింగిణిం
గాంచిన నేలతేని నఁటఁ•గాంచినలాగయియేగె, నాతఁడ
ట్లించిన లెస్సకేలతని • యన్న యెదంగల కందిలేడియై. 116

టీ__లెస్స...యన్న=సుబాహునియన్న (మారీచుఁడు) కేల...తేని=కోదండపాణిని (రాముని)

—• సీత పైడి.లేడినిం గోరుట •—

పంచచామరము

కడానిచాయఁదేరి, గాలి • కత్తలానికంటె, నే
కడాని జెంగజాఁచినం, జే•గాజిగిం జెలంగి తే
న్కడాని నిల్పినంత సీత• కాంచితేని నెచ్చేటన్
గడానిలేడిఁగానదీనిఁ • గట్టి యాడఁదెచ్చెదే॥ 117

టీ__కడా...దేరి=బంగారుచాయతోనొప్పి,గాలి...కంటెఁక=వాయుదేవుని వాహనమైన లేడికంటె, ఏకడ+ఆని=ఏదిక్కునతగిలి తేన్+కడ+ఆని=రాజోదిక్కుననిల్పి

క॥ కడఁక నన నంతఁదాటక। నడఁచినతేఁ డల్లలేడి • నంటిచేనంగాఁ
గడఁగనది యెల్లెడల దని। నడచిట్టులడరఁగ దాటి• నలినలయించెఁక)

టీ.__తాటకనడఁచినతేఁడు = తాటకనుద్రుంచినవాఁడు (రాముఁడు నడచిట్టలు = నడకయొక్కచిత్రములు.

ఉ. రెచ్చిన కిన్కఁ రాయఁ డరరే! యిదియెక్కడి కల్లలేడి యం
చేచ్చిన దానిగండడఁగ • నెక్కటి చిల్కడి నేలరాల్పఁగా
లచ్చన! యంచేడంగె నది • లచ్చన! యన్నసడిం దడాల్నఁ దా
రచ్చట నాలకించి రెద • నయ్యలకన్నె కలంగె తేనికై. 119

టీ. రెచ్చినకిన్కన్ = హెచ్చిన కోపమున, కల్లలేడి = మాయామృగము, లచ్చన! = లక్ష్మణా! సడిన్ = చెప్పుడును, తారు = వారు (సీతయు, లక్ష్మణుఁడును)

చం. కలఁగి నెలంత, లచ్చనఁ ద•గంగని, విన్నెతలంచె దాయచే
నలఁగిన జోడనాయెదఁ, గ•నందగె నీకయినట్టి యన్న; నా,
దలఁగఁడ? ఛాయతేఁ డతని•దారిని తేనికిఁ గ స్తికల్గినం
గలఁగ కటన్న నన్నలిగి • గటిగనాడి కలంచె లచ్చనన్. 120

టీ—దాయ = విరోధి (మారీచుఁడు) ఛాయతేఁడు = ఛాయాపతి (సూర్యుఁడు) అన్న+అల్గి = సీతకోపగించి.

—• రావణుఁడు సీతం గొంపోవుట •—

మ. కలికిండించి తనంత నంతఁ జనఁగాఁ • గాళ్ళాడ, కారాయఁ డం
దలి చెట్లారసి, యేగ గారడిజేడల్ • దా రీతఁడేనాఁగఁ, జోల్
తలలంగల్గిన రక్కసీఁడట నెలం•తండాయఁ గ్రాల్గంటి తాఁ,
దలఁగైఁజేర్చి యెఱుఁగఁ గల్కి తెఱఁగా•తండడ్గ, న, న్నిట్లనెన్.

టీ—గారడి...నాఁగ = మాయాముని యీతఁడేనన, చోల్... సీఁడు = పజ్తిశిరుఁడు (రావణుఁడు)ఆతం డడ్గ = ఆతఁడడుగఁగా, అన్న = స్త్రీ (సీత)

ఉ. హత్తితి లచ్చనన్నఁ దెఱ • గారసి; నాయన సన్నతండ న
న్నెత్తి, తినంగ నిచ్చికనె • నీరల లంగెదియన్న నాతఁడే
నెత్తితి నేలతేరఁ గల • షేలికగట్టఁట దాయరాయ లీ
కత్తి తినంగనైన జేత • గానని చోల్తల దిట్ట నేననెన్. 122

టీ—హత్తి...రసి = రాముని విధమారసి యాయనను బొందితి, నాయన సన్నతండ = తండ్రిపేరువాఁడు (జనకరాజు) ఈరల = మీ

యొక్క, లాగు=విధము. చేౘ్లలదిట్ట=వరుసతలలధీరుఁడు (రావణుఁడు) జేతగానని=సరిలేని.

—• జటాయువు రావణుఁ దాకుట •—

క. అనఁ గలికి తలఁకి నేలం।దనరారఁగజేర, నాకెఁ • దన తేరిని సం
తననిడి చెలియడలఁగ నా।యనజేనఁగా గ్రిద్దరాయఁ•డాతనిదాకెన్.

టీ—అనం=నేనే రావణుఁడ నను నప్పటికి, కలికి=సీత, తలఁకి=జేడిసి, గ్రిద్దరాయఁడు=గృధ్రరాజా=జటాయువు ఆతనిఁదాకెన్=రావణుఁదాకెను.

ఉ. తాకిన, దాని, నాని, యని•దండిగఁజేసి కడింది తెక్క, కా,
ళ్ళాకడఁ గత్తిచే నఱికి • యాదటఁ జిల్క నెలంత డేగగం
డాకలిఁ గాలఁ దన్ని చేని•నట్లుతఁ డాచెలిఁ గాంచియేగఁగా
నాకడ చీరఁజించి నగ•లందిడి కట్టి నెలంత చెంగటన్. 124

టీ—దానిన్=జటాయువును, తెక్కకాళ్ళు=కాళ్ళుతెక్కలు చిల్క...నట్లు=ఆకలిచేత, మగడేగ చిలుకపెంటిని దన్నుకొనిపోవు నట్లు. చీర...కట్టి=కట్టుచీరఁజించి నగలందుంచికట్టి, నెలంత=సీత.

కం. గట్లదణియుంద నిలిచిన। చెట్లం జెరలాడెడితెగ • జియ్య కనంగా
గట్లదర నడలి జారెచె। నట్లారాకాసిరాయఁ• డతిగి నెలంతన్. 125

టీ—గట్లదణి=పర్వతశ్రేష్ఠుఁడు (ఋశ్యమూకాద్రి), చెట్ల...జియ్య=వృక్షచరనాయకుఁడు (సుగ్రీవుఁడు) అట్లా...లంకన్=రావణుఁడు సీతంగొంపోయి.

కం. తనలంకనేలదగ్గర। ననతీగలటెంకియై త•నర్చిననేలం
దనరంగనిడి యెఱచి దిం।ద్లనఁటంగాయనిడెఁదన్నె•నయఁజేయంగన్.

టీ—నన...నేలన్=పూలతీగలకు నెలవైనచోఁట ననగా నశోకవనియని యూహ.

ఉ. చేడియ లంకడాయఁ; నఁటఁ • జెచ్చెర తొటకదాయ యాదట
స్లోడియడంగఁ దిత్తి తన • సీటలరారిన కత్తిఁజెక్క, రా,
నాడనె లచ్చెనం గడఁక • నారసి కాంచి నెలంతడించి యీ
జాడనె రాగనేలయని • సారెకవల్చి, కడింది తేఁడనన్. 127

టీ—తాటకదాయ=రాముఁడు, లేడి...చెక్క=చేర్చిన లేడి చర్మము గత్తికిఁగ్రుచ్చి· రాక=వచ్చుచుండఁగా, తేఁడు=రాముఁడు.

—• రాముని విచారము. •—

ఆ. ఏకతాన నింతి • నేకతానండించి। రానయిన దెఱింగి • రానయినదె
కీఁడటంచు నడల్నఁ•గీఁడడంచేం, గల్న।లచ్చన యనె నన్న•లచ్చనన్న.

టీ—ఏకతానన్=ఏవిధమున, ఇంతిన్=సీతను· ఏకతానండించి=ఒంటరిగావిడిచి· రానయినది=వచ్చినది,ఎఱింగి=తెలిసి, కీఁడు=ఆపద, రానయినదె=రానున్నదె, అటంచున్=అంచు· అడల్న=భయముచేత, లచ్చనన్న=రాముఁడు· (లక్ష్మణాగ్రజుఁడు), లచ్చన=లక్ష్మణా! అన్న! కీడున్=ఆపదను, అడఁచేన్=పోగొట్టను, కల్న=కలుగుదునా? అనెన్=అనెను.

క॥ అంతటఁ దెంకికిఁజేని తేఁ। డంతట నిల్లాలినరసి • హారిహారి! చెలి! యే
క్రింతలఁ జింతల జెంతల। చెంతల నడఁగితనికస్తి•చే నిట్లడలెన్.

టీ—అంతటన్=తరువాత, టెంకికిన్=ఉన్నచోటికి, క్రింతలన్=మార్గములను, చింతలన్=చింతచెట్లను, జెంతలచెంతల=గయ్యాళుల దగ్గర, కస్తి=కష్టము.

ఉ. కాడలఁ గడ్డలిడ్డఁ దని• కానలఁగ్రాగిన నీఁటిఁద్రాగి, లే
నీడల గడ్డ తా యని, గ•ణించక కట్టినయట్టిచీర నీ
జాడల సెజ్జఁజేసి, నిలఁ•జాలితి నన్నెఱిహత్తికల్కి! యే
జాడలనేగితే కనక • సారె కడల్నఁ దడాల్న రాఁగదే. 129

టీ—అడల్న=భయముచేత· తడాల్న=తొందరగా, రాఁగదె=రావే.

క. రాకలికీ! నాయెడకన।రా? కలికి నడల్ సెలంగ • రారాద యిటన్?
రాకలికి యిట్టిదని· నగ।రా?కిలకిల జేడలదారి • రాకలికి తెగల్. 130

టీ—రాజకాంతా! గలికినడల్=మనోహరమైన నడకలు· జడ...తెగల్=మునిశ్రేష్ఠులకాంతలు· కిలకిల నగరా? కిలకిలమని నవ్వరా?

ఉ॥ దాయని దిట్టిదేటి సర•దాయని, నాయెడ కం దనంగ రా
దాయని, గన్నడించె నస•దాయని, యక్కటికానఁగాంచెరా

దాయని, తేనెఁగాంచేఁదగ♦దాయని నేలనెలంత చిన్ని కం
దా! యని తండ్రిగానఁ జేనె♦దాయని, సీత! కనంగ దాయనే? 131

టీ—కందు=దోషము, అసదా=కొంచెమా? దాయనే=విరోధినా?

సీ. కనరాద? యీారల♦కడకిచ్చెసిరిగద్దె
తీగెలారా! నన♦తీగెలార!
చేనరాద? యీారల ♦ జేడలసిగదారి
చేడెలారా! చిల్క♦చేడెలార!
తినరాద? యీారలఁ ♦ దీము నైనయనంటి
కాయలారా! దాఁక♦కాయలార!
యనరాద? యీారల ♦ యండనిల్చినతాళ్ళ
తిట్టలారా! చెట్ల ♦ తిట్టలార!
తే. కాంచేఁగారాద? నెఱదంట♦గాణలార!
జేంకఁగారాద? సెలయేటి ♦ లంకలార!
జేంటఁగారాద? తెలిఁగంటి ♦ దంటలార!
నీడగారాద? యిలకన్నె ♦ యీాడెలార! 132

టీ—సిరి...లారా=తామరతీగెలారా, సిగదారి=శిఖావళము (నెమలి), అనంటి=అరఁటి, దాఁక=దాౖక్ష, గాణ=పాటకాఁడు(పోఁట కత్తె), తెలిఁగంటి =వేల్పు, ఇలకన్నె=భూమికన్య (సీత), ఈడెలు= ఒకజాతిచెట్లు.

ఉత్తరగర్భితార్థ చిత్రగీతము

తే. కనఁగనైనది, యా? యంద♦కత్తె సీత
నేలదారిరాయఁడ! కాన ♦ నేలయంద
యేకతాన నాచేజారి ♦ యిచేట నంత
నంత నడయాడ నీచేత ♦ నడ లడంగ. 133

టీ—నేలదారిరాయఁడ=పర్వతశ్రేష్ఠుఁడా! (లేక) రాజశ్రేష్ఠుఁడా! ఏకతానక=ఏకతమున (ఏకాంతమున) ఒంటరిగా, అడలు= భయము.

ఉ. ఏ, నిఁకఁ బాళఁజాల నని • యేని కడిందిక డంక నల్లనాఁ
డేనికఁ గాచినాతఁ డని • యేని, కలంక నడంచి కాయఁ గం
టని, కనంగ నేఁ దగితి • నేని కడ న్నడచేతసీత, నీ
కేనిక! • సాటియైనదని • యేని కనం జెరిగిం చిఁకం జెలిన్. 134

టీ—ఏనిక...డని = గజేంద్రుని రక్షణఁజేసినవాఁడని; నడచేత = పాదగమనముచేత, చెలిన్ = సీతను, ఇఁకన్ = ఇంకను....కనంజేరిగించే = కనఁబడునట్లు సేయుము.

ఆ. కలికియఱగఁ జెంతఁ • గలిగిన కతన నీ
రానలెంచెరా, న • గళ్ళయు తగ
టాతితిట్టలె, నెల • టాతి తిన్నియలాయెఁ
గడిఁది తిండి కాయ • గడ్డలాయె 135

టీ—కలికి = సీత, అఱగన్ = సగముగా, సనఁగా, నర్ధనారిగా, రానగళ్ళు = రాజనగరములు, నెలటాతితిన్నెలు = చంద్రకాంతశిలా వేదికలు.

—* లక్ష్మణుఁ డన్న నోదార్చుట *—

క. అని యట్లడలెడియన్నం । గని లచ్చన దీని కింత • గా, నీ రడలం
దనరార; దయ్యొ రా జేఁడని దిట్టతనాన నడర • నది లగ్గిడెడిన్.

టీ—లచ్చన = లక్ష్మణుఁడు, ఈరు = మీరు, దిట్టతనానన్ = ధీరత్వముచేత, లగ్గు = మేలు.

ఉ. చించేన నేలఁ? దాతతల • చిద్రలఁజేయన? యాజేగాల గా
లించేన? నేలదారి, వద • లించేన? లేనెల దారిఁజేసి గా
రించేన? చాయరా, నెలల • రెచ్చెడఁగించేన? గాలినేస్తిఁ గ్రి
క్కించేన నన్నిఁటిం, గలికిఁ • గీడఱగాఁ, గనఁ జేయ కేగినన్. 137

టీ—తాత = బ్రహ్మ, నేలదారిన్ = భూమిధారి (శేషుఁడు) లేనెలదారి = బాలచంద్రధారి (శివుఁడు) చాయరా, నెలలన్ = సూర్య చంద్రులను, గాలినేస్తి = వాయుసఖుఁడు (అగ్ని)

—• రాముఁడు సీతావార్త జటాయువుచేత వినుట •—

మ॥ అనఁగా దిట్టతనాన సంతసిలి, తా • నయ్యెయ్య నగ్గించి, సం
తనగా ధారిని నేగి దాశరథిచెం • తం జెట్లఁ గాల్ తెగ్రించఁగాఁ

జేనఁగాఁజాలని తెక్కదారిఁగని యొంచేం గారడీఁ డిద్ది క
ల్కినిఁగారించి చేనంగలేనికరణిం ♦ గ్రిందయ్యె నిందం చేనన్. 138

టీ__అయ్యయ్యన్=అలక్ష్మణుని, కాల్ తెగ్రించేఁగాన్=కాళ్ల
ను నఱకఁగా,తెక్కదారిన్=పత్రిరథము (పక్షి, అనగా జటాయువని
యూహ)

ఉ॥ రాయనికద్ది యిట్లనియె ♦ రాయఁడ! చాలఁఅదాల రాచరే
రాయనినేస్తి నే, నిచేట ♦ రక్కసియేలికసీత, నంది, రే
రాయని దారినేగ, నల ♦ రాచెలికైయని నాగినానటం
చాయన యింతనేసె నకటా! తననేటికి దాచె నీ కిటన్. 139

టీ__చాల...నేస్తిన్=పంక్తిరథుఁ (దశరథు) డనియెడి రాజ
చంద్రునిమిత్రుఁడను, రేరాయనిదారిన్=చంద్రమార్గమునందు (ఆకా
శమందు), రాచెలికై=రాజకాంత=సీతకొఱకు, తనన్=నన్ను.

—♦ జటాయుస్తవము ♦—

ఉ॥ ఎన్నఁగలేనియాఁగదల ♦ నెన్నిఁటి నందిన నేలదారి కే
నెన్నఁగఁజిక్కనట్టిరిని ♦ సీకలసీయెడఁ గల్కిజెంట నే
దిన్నఁగఁ గాంచఁగల్గెనని ♦ తేఁటఁగనాడి కడింది క్రొచ్చెదం
దన్నఁగ, నెన్నె; నద్దితగఁ ♦ దక్కరిరక్కసిఁ జెక్కినట్టిరిన్. 140

టీ__అంగదలు=కష్టములు, నేలదారి=శేషుఁడు, కల్కిజం
టన్=సీతదగ్గరగ, తక్కరి...నట్టిరిన్=టక్కరి రాక్షసియైన తాటకఁ
జెండినటువంటి రాముని.

సర్వలఘు. సీ॥ దిరిసెన ననసిరి♦ దెగడెడి జిగిసిరి
దెనతెగ నెరయఁగఁ ♦ దిరిగెడిదణి!
సరిసరియని నెర♦సరితెగ లలరఁగఁ
జెనఁటితెగల నడఁ♦చిన సిరిగని!
అరితితెగలఁదఱి ♦ సరసి సిరిని నిడి
నెనరడరఁగనెడి ♦ నెఱిగలదణి!
తెలియక, యిలతలఁ ♦ గలదణికిని, జెత
గనని, కతల గలిగిన యిలదణి!

తే. చెనఁటితెగ, లిలఁగలఁచిన ♦ సిరినిలిచెడి
కడనగలిగిన దణి, తగ♦నడిగిన నల
చెనఁటితెగఁ నడచేఁగఁ గలి♦గిన సిరిదణి
యని యెఱిఁగి చేనె, నది, చెడ♦కడరెడ కట. 141

టీ—నెరసరితెగ=శూరసముదాయము, చెనఁటితెగ=దుర్మార్గులగుంపు, అరితి=అర్థి; ఇల...దణి=శేషుఁడు, సిరి...దణి=పద్మోద్భవుఁడు (బ్రహ్మ) చెడక+అడరు+ఎడకుఁ+అటఁ=పరమపదమునకు

—♦ కబంధవధ. ♦—

ఆ. అంత నేలరాయఁ ♦ డాతెక్కుదారిని । హాళినెంచి దాని ♦ కగ్గిచేత
లన్నిదీర్చి, దాని♦ కాదటఁ దలకాయు। తెగినరక్కసిఁగని♦ తెగఁగనేయ.

టీ—నేలరాయఁడు=ధరణీశుఁడు (రాముఁడు), హాళి=సంతసము.

కం. తెలఁ గంటితనానందన । తెలుగెలరాకాని చేన్న ♦ తెన్నలయిలరా
తెలుగంటితేని కాతం । డెఱిఁగించి యఱింగె సరఁగ♦నెక్కడికేనిఁ.

టీ—తెలఁగంటితనానఁ=దేవత్వముచేత, ఇలరా...తేనిఁ=రాజదేవేంద్రుని (రాముని)

—♦ శబరివిందు. ♦—

ఉ॥ ఆయన చేన్న రాచేనెల ♦ యాదటఁ జెంచిత చెంతకేగ, నా
రాయని కాకె కాయలిడి ♦ క్రొచ్చెఱ లచ్చెన కిన్నియిచ్చి యా
రాయల నెన్ని, చాయచెలి ♦ రాయని కందిటఁ గట్లతేనియం
దీయెడ నిల్పెనీ రచేటి ♦ కేగిన తల్చినచేత యయ్యెడిఁ. 144

టీ—చెంచిత=శబరి, ఆకె=ఆమె (శబరి) చాయ...కందు=ఛాయాపతియైన సూర్యునికొడుకు సుగ్రీవుని, గట్లతేనియందుఁ=ఋశ్యమూకమందు.

కం. అని తెలియఁజేసి చెంచిత । యనిచిన రెండక్కరాల♦నలరినసన్నం
గనినట్టి "లచ్చిగద్దెలఁగని" గనిదాని దరిచెట్ల♦కడ నడచిరనఁ. 145

టీ—రెండ...గనిఁ=రెండక్షరాల పేరుగలిగిన పద్మాకరమును, (పంపాసరోవరముకడ.)

కం. అనిపండి జేడలదారిని । గని యాంగాద్రింక్ల టెంకిఁ ♦ గలిగిన జేడదా
రినెల, యఁటజరిగినకతం । దనకెఱిఁగించెంగ నడిఁగొఁ♦దద్ద దలిర్చఁ.

టీ__అని...గని=కలహాశను (నారదు)గని, గాల్దింక్ల...నెల=వాల్మీకిమునిచంద్రుని తద్దదలిర్చఁ=మిక్కిలి యొప్పునట్లుగా.

__ ఆశ్వాసాంతము. __

కం. అంతటఁ గలిగినరాయా! యంతటికిని సాక్షిరైన • యన్నిటిరాయా!
యంతటనిఁ జేసిసాకెడి యింతంతని తెలియరాని • యెక్కటిరాయా!

టీ__అంతటఁ=జగమంతట, సాకిరి=సాక్షి, అన్నిటి=చరాచరములన్నిటి, ఎక్కటిరాయా=ఒక్కఁడవైన ప్రభువా!

మాలిని సిరిచెలి యెదజేఁడా! చెడ్డ రాకాసికీఁడా!
కటిచెలిజేతకాఁడా! • కట్టికి న్నంగడీఁడా!
నెఱిఁగలయెదకాఁడా! • నేలకాల్లంటిజేఁడా!
నెఱిఁగలజిగికాఁడా! నీటదే లందకాఁడా! 148

టీ__కటిచెలి = భూమి, కట్టి = అర్జునుఁడు, నెఱి = ప్రేమ, నెఱిఁ=అందమును, నీట...కాడా! జలార్ణవమునాఁడు వటపత్రమున దేలియాడు సుందరుఁడా.

గద్య.

తే॥ ఇద్ది యయ్యరాజెనిఘొడి • యింటిసన్నఁ
దగినశేషయ్య కంవయి • తనరినట్టి
యాంజనేయాఖ్యఁ జెలగిన • యతనిచేత
నెసగెఁ దాశరథిచరిత్ర • నెక్కటికత. 149

టీ__అయ్యరాజు=అబ్బరాజు, ఇంటిసన్న=ఇంటిపేరు, శేషయ్యకందు=శేషయ్య కొమారుడు, ఆంజనేయాఖ్య=ఆంజనేయుని పేరు (హనుమంతరాయశర్మ) ఎక్కటికత = ఒక్కకథ అనగా మొదటికథయనిసూచన. ఇది ప్రథమాశ్వాసము, ఎసఁగెఁ = వ్యాప్తమయ్యెను.





శ్రీ మేధాదక్షిణామూర్తయే నమః.

# అచ్ఛాంధ్రి, నిరోష్ఠ్య, నిర్గద్య,

# దాశరథిచరిత్ర.



## ద్వితీయాశ్వాసము



శ్రీ యనఁజెలిలకన్నియ
కై యజుచెలివంటతేని • యలసింగాణిం
డాయఁజెనిరాల్చి, రాచెలి
చేయంటినదిట్ట! యజితి • జేజేచెట్టా!

టీ— శ్రీ=లక్ష్మి, అజుచెలి=అర్ధనారి యొక్క, సింగాణి=విల్లు, రాచెలి=సీత, అజితి=అర్థి. జేజేచెట్టా=కల్పవృక్షమా! (అడిగినదాని నిచ్చువాఁడ!)

క॥ తెలియంగ నాలకిం చేఁట, కలిగినకత; గాలిదిండ్ల • గద్దరిటెంకిం
గలిగినజేడదారి, కఁటం! దెలిజేడదారినెల యిట్ల•నియెః దెలియంగ౯. 2

టీ— గాలి...దారికి౯=వాల్మీకికి, తెలిజేడదారినెల=తెల్లనిముని (నారదుఁడు.)

—* సుగ్రీవుఁడు రామలక్ష్మణులఁగని భీతిల్లుట *—

సీ॥ చెడని నిగాఁగన్న • జేడదారి రాచే చి
న్నియలచే, రాచేచి•న్నియలచేత
ననయిాఁటెకాని నె•న్నఁగఁజాలినట్టియం
దాలచేఁ, దెలిజన్ని•దాలచేత

నెఱసరితెగల గం॰డిగ్రించేఁజా లీఁటెదం
డాలచే, నెఱకచ్చ॰డాలచేత
జంటజేజేదిట్ట ॰ లంటితాల్చినసింగి
ణీలచేరిక సింగి॰ణీలచేత
తే॥ జాలఁదగి చెట్లనీడల ॰ జాడలఁ జెర
లాడెడి కడిందిరానెల ॰ లైన నేల
కన్నె రాయని లచ్చినఁ ॰ దిన్నయిన
యతితిగల చెట్లదరిగెడి ॰ యయ్యకనియె.

టీ—జేడదారి...చే=మునిరాజచిహ్నములచేత, రా...చేత=రాజచిహ్నములచేత, వనయిూఁటెకానిక్=పుష్పాయుధుని, జంట...దిట్టలు=హరిహరులు,తిన్న...గల=మంచిగొంతుగలవాఁడు(సుగ్రీవుఁడు)

చ॥ కని, కలకేర్చఁ దిన్నఁగ నె॰గాదిగఁ గాంచి కడిందిగట్ల రా
యనితలయెక్కఁ కాంచి, తన ॰ యన్న యె. యిట్లనిఁ దన్నణంచేఁగా
ననిచినఁజేరి నా రిచేటి ॰ కక్కట! యిూజేడదారిచిన్నియల్
దనరఁగ నం చేదం గఁచి ॰ దగ్గరనిల్చిన రాచేదిట్టలన్. 4

టీ—అనిన్=యుద్ధమునందు, తన్ను+అణంచేగా=తననుజంపుటకు, అన్న యె=అన్నయైనవాలియే

ఉ॥ కానఁగఁజేసి కేసరి జా॰గాచెలికాంచిన దిట్ట కిట్లనెం
గానఁగ నాంజనేయ! తన॰కంటిట కంచిన నిట్టి చిన్నెలం
గానఁగనైరి యల్లజేత ॰ కైనిడి సింగిణిఁ; గాక సింగిణిన్
గైనడరంగఁ దాల్చెదరె! ॰ కానల నేజేడదారి రాయలేన్॥ 5

టీక—కేసరి...దిట్టకున్=వాయుదేవుడిచ్చిన శివవీర్యమువలన నంజనకుఁ గల్గినవాఁడు (ఆంజనేయుండు) తనకంటు=తనవిరోధి (వాలి)అల్లజేత=ఆద్వయము (రామలక్ష్మణులు) సింగిణిన్=వింటిని॥

ఆ॥ కాన నచేటి కటేఁగ్గి ॰ కాన, నేటికిఁ జెర
లాడెద రని యడిగ్గి ॰యేడ కేగఁ
దలఁచినది యెఱింగి ॰ తారే రయిుసిని
యఱసిరాగదయ్య ॰ యాంజనేయ! 6

—♦ హనుమంతుఁడు రామలక్ష్మణుల భిక్షుకవేషమునదర్శించుట ♦—

క॥ అని యనిచిన యంజనకం। దనిచిన నెయ్యాన నచటి ♦ కతెగి కడంకం
గని రాచెనెలల దాసరి।తనాన రహినెఱిఁగియనియెఁ♦దనరా రంగన్ ॥7

టీక—అంజనకందు=ఆంజనేయుఁడు, అనిచిన నెయ్యము=మనస్సు గలసినస్నేహము, రాచెనెలలు=రామలక్ష్మణులు, దాసరితనానన్= దాసత్వముచేత॥

ముక్తపదము.

సీ॥ చిన్నెలే కని రాచ ♦ చిన్నలేననియన్న
జేడలసిగలచేత ♦ నడరనయ్యొ
జేడలసిగలఁగాంచి ♦ జేడదారినెలలన్న
గఱనారకచ్చడాల్ ♦ కనఁగనయ్యొ
గఱకచ్చడాల్గాంచి ♦ గట్టి జెట్టీలన్న
నెఱిసింగిణీల్ కేల ♦ నెఱయనయ్యొ
నెఱిసింగిణీల్గాంచి ♦ నెఱసరిజేతయన్న
జేజేలచిన్నెలే ♦ చెలఁగనయ్యెఁ
గీ॥ జిన్నెలన్నికన్న ♦ జేజేలతేజౌర
దాల్చిరాచెజాతిఁ ♦ దనరఁ గలిగి
యెద్దియేన్గతాన ♦ నీకానఁదిరిగెడి
రానెలలనియూరి ♦ రహిఁదలఁచెన. 8

టీక—చినెల్ను+ఎ=చిహ్నములు, రాచచిన్నలు+ఎ=రాజపుత్రులుజేడ...నెలలు=మునిచంద్రులు,జెట్టీలు=కుస్తీపట్లు వట్టువాండ్రు, నెఱిసింగిణన్=అందమగువింటిని, నెఱసరిజేత=శూరద్వయము, ఎద్ది...తాన=ఏదియోకారణము, రానెలలు=రాజచంద్రులు.

క॥ కేసరి కంజనకు కలిగి। నీసరినైనట్టి రాంజ♦నేయా! యనగా
దాసరినై యార్కికడన। యీసరికి నిలిచితి నీర♦లేరని యనినన్. 9

టీక—కేసరి=హనుమంతుని తండ్రి, అంజన= అతనితల్లి, దాసరి=దాసుఁడు, అర్కి=అర్కునికొడుకు (సుగ్రీవుఁడు) ఈసరికి=ఇంతవరకు, ఈరలు=మీరు, ఏరు=ఎవరు.

—• లక్ష్మణుఁడుహనుమంతునకుఁ దనవృత్తాంతముదెల్పుట. •—

ఉ॥ ఆయెడ లచ్చెనన్న యనె • నాదట లచ్చెనకన్న! యేరికై
యీయెడఁ జేరఁగాఁ గలిఁగె • నిక్కడ నాతఁడ కానవయ్యెఁగా
నీయెడ దంటయైన యితఁడే, తనలాగెఱిఁగించెఁ జక్కఁగా
నీయెడఁ గల్గినట్టికత • నేఁడెఱిఁగిం చితఁ డాలకించెఁగాన్. 10

టీ__లచ్చెనన్న=రాముడు, లచ్చెనకున్=లక్ష్మణునకు, ఏరికై=ఏసుగ్రీవునకై ఈయెడన్=ఈచోఁట, అతఁడ=ఆసుగ్రీవుఁడే, దంట...డే=ప్రజ్ఞావంతుడైన హనుమంతుఁడు, కల్గినట్టికత=మనవలనఁ బుట్టినచరిత్ర.

ఉ॥ దంటతనాన నల్కతల • దండిగ నేరిచి సత్తిజేనికిం
జంటగ నిల్చినాఁ డితని • జంట నె టాడినపడ్డ యేననం
దంటతనాన లచ్చెర తనర్చఁగ నిట్లనె నాంజనేయ! నీ
జంటగ నిల్చి యాడఁగల • జాణన? యాడెద నాలకించెదే. 11

టీ__దంట తనానన్=నేర్పుచేత, నల్కతలన్=చతుర్వేదములను, సత్తిజేనికిన్=శక్తియైన పార్వతీపతికి (రుద్రునకు) జంటగ=జతగ, హనుమంతుఁ డేకాదశరుద్రుఁడని యుత్తరరామాయణమునఁ గలదు, జాణ=నేర్పరి ఆడెదన్=పల్కెదను, ఇదే=ఈపలుకునదే.

శా॥ నన్నన్నంగనె నాజితేఁ డతనియా•నంగానఁ జెల్లాడఁగా,
నన్నన్నంగడఁ జేర్చి చౌత్తలలతం • డాసీత నిం దంది తాఁ
జెన్నుం జెంచిత నిన్న నార్కికలడీ • చెక్కిం దగంగానటం,
జెన్నుం, జేడియజాడ నాతఁడెఱిఁగిం • చెంగల్గ నంగా నిటన్. 12

టీ__నన్ను+అన్నన్=లక్ష్మణుని, రాముని, ఆజి= (అజునికొడుకు) దశరథుఁడు, అన్నన్నన్=కడన్=కడగా, దూరముగాఁ బోఁబంచి, చౌత్తలలతఁడు=పంక్తిశిరుఁడు (రావణుఁడు) ఈచెక్కిన్=ఈచోటున, చేడియజాడ=సీతావార్త.

క॥ ఏతెంచేనయ్యో నని తగ । నాతం డాడంగ నంత • నంజనకందా
రా, తలకట్లంగని యీ।రీతఱి, నారాయని కడ • కేతెం డనియెన్.

టీ__అంజనకందు=ఆంజనేయులు, రాతలకట్లన్=రాజశ్రేష్ఠులను, ఈరు=మీరు, ఈతఱిన్=ఈసమయమున, నా...కడకున్=నాప్రభువైనసుగ్రీవునికడకు,ఏతెండు=రండు.

—• రాముఁడు సుగ్రీవుఁడు నగ్నిసాక్షిగాఁ జెల్మి సేయుట •—

తోటకము॥ అనఁగా నిది లగ్గని • యాతనిజెం
టన నేగి యతం డఁటఁ • డాయఁగఁజే
ర్చిన యార్కిని గన్పిల • తేం, డ్రిటనా
యన, నేస్తిగఁజేసిరి • యగ్గికడన్॥ 14

విభూతి॥ తేని కంతనార్కి నీ । చేనరాల్చె నీనగల్
తానటం, బెడంగ తేఁ।డాని హెచ్చెడల్ కనన్. 15

టీ—ఆర్కి=అర్కపుత్రుఁడు (సుగ్రీవుఁడు), ఆయనన్=ఆసుగ్రీవుని, నేస్తి=చెలికాఁడు, అడల్=భయము అగ్గి=అగ్ని.

శా॥ నిండంగా రహిం, లెస్స యత్తిదణి తే•నింగాంచి తానంతఁ గై
దండల్ గ్రాలఁగనెత్తి సాగిలి, నెలం•తల్ దంట, రాలచ్చిఁ, డెం
కిం, డక్కింధి, కడంక నన్న తనచే•క్కంజేర నీకేర్చుఁ గ
ట్టుండంజేరితి తేఁడ! యం, చెడల రా • యండంత నయార్కికిన్.

టీ—నిం...రహిం=కోర్కినిండగా, లెస్స...దణి=సుగ్రీవుఁడు, నెలంతల్దంటన్=తన భార్యయైన రుమను, రాలచ్చిన్=రాజ్యలక్ష్మిని, డెంకిన్=నివాసమును (కిష్కింధ) అన్న=వాలి, ఆర్కికిన్=సుగ్రీవునికి.

మ॥ కలయ న్నీకతయంత నాకడఁ దగం•గా నాడి నీయన్న ని
న్నలయంజేసిన లా, గిదిట్టిదన, నీ • యన్నం దగంరాల్చి నీ
కలతందేర్చెద, రాచెలచ్చి నిడెదం • గ్రాలంగ నీచెంత నీ
నెలతంజేర్చెద నన్న నార్కి రహిఁగం•టే! రాయడా! యంచేటన్.

టీ— నీయన్న=వాలి, లాగు+ఇది+ఇట్టిది+అన్నన్=విధమిట్టిదని పల్కిన, రాచెలచ్చి=రాజ్యలక్ష్మి, గ్రాలంగ=ప్రకాశించగ, నెలఁతన్=భార్య రుమను, ఆర్కిరహిన్=సుగ్రీవుఁడు కోర్కెతో

—• వాలి సుగ్రీవుల వైరకారణాదికము •—

సీ॥ అన్నిఁటిరాయని • జన్నగట్టెద నెంచి
కని సంతసిల్లఁగా • గలిగినట్టి
కన్నిఁటఁగలిగిన • గట్లఁడిఙెంగెడి
జెట్టి, జేజే గట్ల • జియ్యచెంతఁ
గలఁ, సిరిగద్దెల • గని చెంతఁ జెఱిలాడి
నీఁటూరఁ దపనీడ • నీఁటఁగాంచి

దాయయంచెని దిగి • తాఁజెలిర్యై తెఱఁ
గంటిరా నెలజెత • కాండ్రిడంగ
గీ॥ దనర నాయన్న, నన్గాంచి • తండ్రియానఁ
జెట్లఁ దిరిగెడి యయ్యలఁ • జేరి సంత
సాన గిష్కింధ నేలి తాఁ • జెనెడి తఱిని
తేనిగా నన్న, నన్నిన్న • తేనిఁ జేసె. 18

టీక__అన్నిఁటిరాయనిఁ = సర్వేశ్వరుని, జెన్నిగట్టు= బ్రహ్మ, తాత జన్నిగట్టిన విధాతనామములు, అం॥ సం॥ సంత...న్నీఁటఁ=ఆనందబాష్పములందు, గట్ల...జెట్టి= ఋషివిఱజుఁడు, జేజేగట్లజియ్య= సురగిరిరాజు, (మేరువు) సిరి...గని=కొలఁకు, దాయ=పగవాఁడు, చెలిర్యై త్రీర్యై (ఋషివిరజుఁడు) (స్త్రీయగుట) తెఱఁగంటిరా= దేవేంద్రుఁడు, నెలజెతకాఁడు= సూర్యుఁడు (ద్వంద్వసమాసము) నాయన్నఁ= వాలిని, నఁ=సుగ్రీవుడైన నన్ను.

శా॥ రాకన్నాక! కయాళిలేక, సరిగా • రాలచ్చి నిట్లేలఁగా
రాకల్కిందన చెల్లినంటెనని, మా • రాకాసికంసాలికం,
దాకంటేర్చఁగ రేయిఁదాకె నన్కై • మైందిరిం జేగాకైసిరిం
దాకంగా, నని నంపగాఁ జేనితి నే • నాయన్న కల్లంతటఁ. 19

టీక__రాకన్నాక! రాజశ్రేష్ఠుడా! కయాళి= పోట్లాడుట, రాకాసికంసాలి=మయుఁడు, కందు=వానికొడుకు, (మాయావిదుందుభియన్న) వానిచెల్లి=(మయునికూతురు) మాయావిచెల్లెలు మండోదరి, ఆకంటు=ఆపగ, ఏర్చఁ=వేధింపగా.

మ॥ నడకం ద,న్నలరేయియంటి చేనఁగా • నాయన్న నేనంత న
ల్కడనందందగి, రక్కసీఁడఁట దరిం • గట్టండ నేనిల్చి ని
ల్కడగా నారయఁ గానరాక చేనఁగా • గట్టండ నన్డించి చె
న్నడరంగ్రిచ్చర దాయనారయఁగ నా • యన్నయ్య యేగెం దగఁ. 20

టీక__క్రిచ్చర=తొందర, అన్నయ్య=అన్న, గౌరవార్థ మన్నయ్య యనవచ్చు.

క॥ అన్న చేనినట్టి దారిని । దిన్నఁగరా, నెఱచి, నల్ల • తిట్టల్ జేతగాఁ
గ్రిన్ననవాఁడజేఁగిన నా । యన్న యడంగెనని యెంచి • యఁట నేరాగాఁ. 21

టీక—ఎఱచి=మాంసము, నల్ల=నెత్తురు, తిట్టల్=గుంపులు.

సీ॥ తెంకిని గలిగిన • దిట్టలేలిక లేక
రాలచ్చి నిలదని • రాచదానిఁ
దిన్నఁగాఁగై సేసి • నన్నెలికఁగఁజేయ
నాదట, నైంద్రిదా•య నడఁగించి
యేతెంచి నందిట్టి • యెలనాగ రాసిరి
నెనసి నన్నంగద•లన తగిల్చి
తెంకి నిలఁగనీక • తెగినన్నిటంచిన
నీగట్టితం డక్కఁ • డీక నని యెన
తే॥ నెఱిని జెట్లండదిరిగెడి • నెఱసరితెగఁ
గలిసి యంజన కందండ • గాఁగగట్ల
ఱేనికడనిల్చి నీరాక • ఱేఁడ! కాంచి
యైంద్రినన్నఁడచేగనంచె • నని తలఁచితి. 22

టీ—రాచేదానిన్=రాజధానిని, కైసేసి=అలంకరించి, ఐంద్రి=ఇంద్రునికొడుకైనవాఁడు (వాలి)ఎలనాగన్=భార్యయైన రుమను, రాసిరిన్=రాజ్యలక్ష్మిని, అంగదలన్=కష్టములను, ఈగట్టున్=ఈఋష్యమూకమును, అంజనకందు=ఆంజనేయులు, అంచెన్=పంపెను

—• రాముఁడు దుందుభికాయముఁ బాఱఁద్రోయుట •—

ఉత్సాహ॥ అన్న నేలరాయఁ డంత • నతనిఁగాంచి యార్కి! నీ
యన్న యెట్టిఁడంచెడింగి • యతనిచేతదెలిసి, యా
చెన్నఁటి తెఱఁగంటివాయ • చెండనైనఁ దన్ని తా
ళ్లన్నఱికి యడంచిగట్ల • ఉలిఁజెలంగి యాదటన్.

టీ—అ..దాయ=అచెడురక్కసి కాఁడు (దుందుభి) చండనైనన్=వాలిచేతఁ జంపఁబడఁగా, తన్ని=కాలితోఁజిమ్మి; తాళ్లన్=సప్తతాళములన్, నఱికి=తున్మి.

ఉ॥ లచ్చన ఉచ్చెనన్న లఁగ•లంగక హత్తిఁ కడంక నార్కి ఱేం
డిచ్చెలఁజెట్ల గట్లతెగ • హెచ్చిలగాంచి చెలంగ నైంద్రి న
ట్టిచ్చటఁగల్గె నచ్చటికి • నేగినఱా, గయిలచ్చిఁజేరఁగా
నచ్చటఁజేరె నైంద్రియని • యా యెడనిద్దరకయ్యెఁ జెయ్యనన్. 24

టీ—హత్తి=కలిసి,నింద్రినట్టు+ఎచ్చటన్=వాలిపట్టణము(కిష్కింధ) కయిలచ్చి=బాహుసంపద, అని=పోట్లాట.

క॥ నెఱసరిజేతకరణిని నా । నెఱసరిజేతయసినిజేయ • నెఱినైంద్రికిఁ గై
 సిరిహెచ్చితరలనడచేఁగఁ । దరలెందనటెంకిసేర • దగనార్కియటన్

టీ—నెఱసరి=సింహము, శూరుఁడు, టెంకి=నివాసము ఋశ్య మూకము.

ఉ॥ చేరితగంగ నీదరిని • జేరిన నన్నిఁట నైంద్రిచేత నీ
 దారినలంగఁజేసితిగ? • దాశరథీ! యన, రాయఁ డంతటం
 జేరఁగఁదీసియార్కి సిరి • చేడియగద్దెలదండ నత్తి నెం
 తే రహిదాల్పఁజేసి, యని•నెట్టనదారిచె నైంద్రికార్కిన్. 26

టీ—సిరి...జేసి=లక్ష్మీదేవికి నివాసములైన తామరపువ్వుల దండను మెడయందు ధరించునట్లుకావించి, ఐంద్రికార్కికిన్=వాలి సుగ్రీవులకు.

ఉ॥ తారిచి డేగతేండ్రినఁగఁ • దారనిఁజేయఁగనార్కి తగ్గగాఁ
 జేరిచి చిప్పఁగట్టెది • సింగిణి నైంద్రినడంచి, తేఁడటం
 జేరిచి రాసిరింజెలికిఁ • జేరఁగఁడెంకికి నాననిచ్చి, కై
 జేరిచి సింగిణింజతగ • జేరిచిలచ్చిన నిల్పె నత్తఱిన్. 27

టీ—చెలికిన్=చెలికాఁడగు సుగ్రీవునికి, టెంకికిన్=కిష్కింధకు

## —• వర్షర్తు వర్ణనము •—

శా॥ కానీ, నీకనినట్టిఁ డైంద్రినడఁచెం • గా! తేని సాయాన, నా
 హా! నిం గెల్పెదనన్న చాయఁ, డన తే • రట్టెక్కి తేజీల నెం
 తే, నించెం, దెఱఁగంటితేఁ డనఁగ నిం•డెం జాలఁగా నెట్టిజే
 జే నిం డం గటె నీటిదారితెగ లా • జేజేల తెన్నంతటన్. 28

టీ—నీకనినట్టిఁడు=నీవు కుమారుఁడుగాఁ బడసిన సుగ్రీవుఁడు, ఐంద్రిన్=వాలిని, తెఱఁగంటితేఁడు=ఇంద్రుఁడు, ఎట్టిజేజే=సూర్యుఁడు, కటెనీటిదారితెగలు=నీలజలధరజాలము, (మేఘములగుంపు) జేజేలతెన్నంతటన్=సురవర్త్మమంత (ఆకాశమంతటను.)

సీ॥ తేఁ డనిశై చేర్చి • నాఁడన దెఱఁగంటి
రాసింగిణీల్ నింగి • రహిని నాఁగె
రాకాసి నడఁగించి • సాక జేజేల్ తేని
నడిఁగి నట్లయి చేద • లడలసాఁగె
సకిఁదెచ్చి చెడియె నీ•జాతి సంతనితాత
కనఁ జేనె నన నింగి • నంచె లరిఁగె
సీత కేడ్చిన నేల • చేడియకన్నీఁటి
దారలాయన నీటి•దార లెసఁగె
తే॥ నడరఁ దనయీఁక సిగదారి • యాడసాఁగె
నీళ్ళచే జేడి నేల నిం•డించసాఁగెఁ
గడలి కిలఁగల జేక్కుఅల్ • నడఁగసాఁగె
నెలజేతం జేడికా రట్టె • నిలఁగసాఁగె. 29

టీక—తేఁడు=రాముఁడు, తెఱ...సింగిణీల్=ఇంద్రధనస్సులు, నింగిఁ=ఆకాశము, రాకా...సాకఁ=రావణునిఁజంపి దేవతలఁ గాపాడుటకు, జేజేల్=దేవతలు, తేనిఁ=ప్రభువైన విష్ణువును, సకిఁ=సీతను, తాతకుఁ=బ్రహ్మకు, అనఁ=పల్కుటకు, సిగదారి=శిఖావళము,(నెమిలి) నెలజేతఁ=మాసద్వయముచేత (శ్రావణభాద్రపదములచేత) జేడికారు=వర్షర్తువు.

## —• శరదృతువర్ణనము •—

క॥ జేడికా రిట్లుతీఁగిన నంటఁ। గడిఁది సిరిని రాగఁ దగిన• కారడరెం దే
జేడగంగా తేఁ డటేఁగిన। కఱతేఁడే తెంచినట్టి• కరణిఁదలిర్చుఁ. 30

టీక।—జేడికారు=వర్షాకాలము, కడిఁది...లడరెఁ= తరువాత రాఁదగినఋతువు (శరదృతువు) తేఁడ...కరణిఁ=రాజుపోఁగా రాజేవచ్చినట్లు.

చ॥ చేద లదరెల్లఁ జొత్తె; నల•చేక్కని తేఁజెదలంద చేరె, నీ
ర్గవలక నిల్చితేత్తెఁ, దన•గద్దెల సాసిరి చేనసేరె, తెల్
చెవ నల లెత్తితీరెఁ దెలి• చేడియ తత్తడి కస్తితీరె, న
య్యెదన, కడళ్ళనీరలర • నానిన కెంజేడదారిదంట రాఁ. 31

టీక॥__చేదలదరు+ఎల్లఁదేరె=ఉరములన్ని యడఁగిపోయెను, చెక్కనితేఁడు=మన్మథుఁడు, తెల్ చెద=తెల్లుగడ్డి, ననలెత్తితీరె=పూలు పూసెను, తెలి...తీరె=సరస్వతీవాహనమైన హంసకష్టముతీరెను,కడళ్ళ... దంట=సముద్రములఁనీరంత నాచమనము జేసిన యగస్త్యుఁడు అగస్త్యోదయ మేశరదాగమమని పురాణప్రసిద్ధము.

తే॥ తనకలికిసీతఁగానని • దాశరథిని
నేచెగాఁజెక్కనయ్య దం•డెత్తఁ జిల్క
లఱచిన నదల్చిరనఁగ న•య్యదనఁజేలఁ
జిల్కతెగల నదల్చిరి • చేడెలెల్ల. 32

టీ__చెక్కనయ్య = మన్మథుఁడు, దండెత్తన్ = దాడివెడలఁగా, చేడెలు=కాపుచెలులు.

—* సుగ్రీవుఁడు రామలక్ష్మణుల జేరుట *—

క॥ ననయాఁటెకాని యాఁటందనచెలిన త్తతని నెనసీ•తాఁదెలియనియా
ర్కి నదల్చి తేనికడ లొచ్చెన యాతని నతనిదండ్లఁ•జెక్కంజేర్చెన్.

—* సీతాన్వేషణము *—

ఉ॥ అంతట నార్కి దంటలయి • నట్టిరి లెంకల తేనియాన నే
లంతటఁ జాలఁగాఁ దిరిగి • యాతనిచేడియఁ గాంచె, నంచె తేఁ
డంతట దక్కినానకని • యంచెడి లెంకలదంటయైన గాల్
సంతటఁ జీరియిచ్చెఁ దన • చెక్కనికల్కికిఁ జిన్నెగా నగన్. 34

టీ__కాంచెన్=ఎక్కడనున్నది చూచుటకు, దక్కి...దంట= దక్షిణమునకుంబంపు భటశేఖరుఁడైన, గాల్సంతున్+అటన్ = హనుమంతునంతట, చీరి=పిల్చి, చిన్నెగా నగన్=గురుతుగా నుంగరమును, ఇచ్చెన్=(రాముఁడు) ఒసఁగెను.

ఉ॥ ఇచ్చినదాని నంది చని • యెల్లదెసల్ చెఱలాడి సీత నా
హెచ్చిన గట్లఁ జెట్ల తెగ • నెచ్చటఁగాననఁగ లేక తారఁటన్
రెచ్చిన కస్తిచేఁ జేనఁగ • తెక్కలదారి కనంగనై చెలిం
దెచ్చినదాయ యాకడలిఁ • దేఁటగదాటె నటన్న నంతటన్. 35

టీ__తారు=వారు (హనుమదాదులు) కస్తి=కష్టము, తెక్కల దారి=సంపాతి.

చ॥ సిరి కెనయైనసీత నల • చెన్నఁటిరక్కసిరాయఁడంది, యా
దరి కెదఁజెంకకేగెనని • తద్ద దనర్చఁగ జేని లెంక లం
దఱ కెఱిఁగించె నిట్టరచె • నా? యన నార్చెడి నీటితిట్టఁగాం
చిరి, కెలనం దలిర్చ, నిలఁ • జెట్లఁదిరింగెడిదంట లెంతయేన్. 36

టీ—చెన్నఁటి...దంది=కుచ్చితుఁడైన రావణుఁడువాఁంది, నీటితిట్ట = సముద్రము, చెట్ల...దంటలు = వృక్షచరులైన వానరశ్రేష్ఠులు (హనుమదాదులు).

—* హనుమంతుఁడు సముద్రముదాఁటుట *—

చ॥ కని తనయంత నిక్కడలి • గాల్సిరిదాఁటఁగలట్టి దిట్టయేఁ
డని తనరారనెంచి కని • యందలివంటలె యాంజనేయ! యె
ఱ్ఱని తెఱఁ గంటి యెన్నినని•ఆజిగిస త్తిఁగలట్టిదిట్ట లీ
రని తెలియంగనాడి తగి • నట్టిఁ డితండన నెల్ల రాడటన్. 37

టీ—కాల్సిరి=పాదగమనసంపద, ఎఱ్ఱని తెఱఁగంటి=ఎఱ్ఱని వేల్పు (సూర్యుఁడు) సత్తిగలట్టిదిట్ట=శక్తిగలిగినధీరుఁడు(ఈశ్వరుఁడు) ఏకపాదరుద్రుఁ డాంజనేయుఁడని యెఱింగించిరి, అట్టిఁడు=అటువంటివాఁడు.

చ॥ నిలిచినిటాఁనఁ గాల్గదల • నీయక యత్తిని గేల్జతండగన్
నిలిచినయట్లసాచి తెగ•నిక్కిచేదల్ గని తెక్కదారిరాఁ
గెలిచినసత్తి చేఁ గడలిఁ • గేపరికం దలరారదాఁట న
న్గెలిచినఁగాద యేగెనని • నింగిని నచ్చెఱచాన యాఁగినన్. 38

టీ—అత్తిని=మెడను. తెక్కదారిరాన్=పక్షిరాజేను (గరుత్మంతుని) అచ్చెఱచాన=అప్సరస్త్రీ ఆఁగినన్=అడ్డగించఁగా.

క॥ ఆఁగినదానినిరాలిచి । సాఁగివడఁచి యగ్గినేస్తి • సంతలరారం
గాఁ గడలిదాటిలంకం । దాఁగని చెఱిలాడెఁదాని • దరిగట్టండన్.

టీ—అగ్గినేస్తి=అగ్నిసఖుఁడు, సంతు=ఆతనికొడుకు (హనుమంతుఁడు) దానిదరిగట్టండన్=ఆ లంకసమీపమునందుండు సువేలాద్రిదగ్గర.

—• సూర్యాస్తమయము •—

క॥ తనజాతిరాయనిచెలిని । గనఁగానే తెంచినట్టి • గద్దరినెంతే
గనసాయకారిగా నొ।ఱ్ఱనిజేజే కడలిఁగాన•రాకయ డిగియెన్. 40

టీ—తన...చెలిని=సూర్యవంశపురాజగు రాముని భార్య సీతను, సాయకారి=సహాయకారి, ఎఱ్ఱనిజేజే=సూర్యుఁడు.

చ॥ నెలఁ గనికాని తిండిఁదిన • నేనని జన్నియఁ జేసి నీళ్లరా
కలికి కడంకనేల తెలుఁ•గంటిగఁ దన్నెటఁ జీర నంత నా
కలికి నిలంగలేదని జే•గానడకంజని నీఁట నాడఁగా
నలరఁగ డిగ్గినట్లడఁగె • నక్కడలిం జెలిదాయ యాయెడన్. 41

టీ—జన్నియ=వ్రతము, నీళ్లరాకలికి=వరుణదేవునిభార్య, నీఁట నాడఁగా=స్నానముజేయఁగా, చెలిదాయ=సూర్యుఁడు.

క॥ దాయ యయినట్టి రక్కసి। రాయని యంగదలిటే సఁ•రఁగ నెగజడి నా
నాయెడనెరసెం జీఁక। ట్లేయెడఁ గానంగరాక•యెయ్యది యేనిన్. 42

టీ—దాయ=విరోధి, అంగదలు=కష్టములు, నెరసెం జీఁకట్లు= చీఁకట్లు వ్యాపించె.

ఉ॥ రాతిరికల్కి దంట తన•రాయనిరాకడఁ గాంచి నింగి యి
ల్లాతటఁ జెక్కఁగా నలికి • యాసిరిగద్దెలఁ జిల్క లంచెలం
జేతనతీర్చి దానియెదఁ•జేఁత నెఱిం గనఁ జేసెనా యనన్
రాతిరినింగి రిక్క తెగ • రాణదలిర్చెఁ గనంగ నయ్యెఁగా!. 3

టీక॥—రాతి...దంట=రాత్రికాంతామణి,తనరాయనిరాకడన్= తనభర్తచంద్రుని రాకను, నింగియిల్లాతటి=ఆసమయమున నాకాశగృహమును, దాని...జేసెన్=ఆరాత్రికాంతమనస్సునెఱింగించె, (వాసకసజ్జికవలె).

—• చంద్రోదయము •—

సీ॥ తెలుఁగంటిరాయని • దెసకల్కియాడంగఁ
జేఁదాలిచిన ననల్ • చెండనంగఁ
దటి గారడీడిల • దారిరా నెనరందఁ
జేసినజేజేల • చెట్టనంగఁ
గాలికం దిలకన్నెఁ • గాంచెఁ జేజెలెత్తి
నట్టితెల్లనిదీటి • యా!యనంగఁ
గటికి చీఁకటియేని•కలరాచె రాకాసిఁ
జెండెడితెల్లజే•జే యనంగ

తే॥ రెచ్చిచేదలేఁట నడచేంచే • తేఁడనంగ
నింగిఁదిరిగెడి తెలిహత్తి • నీఁడనంగఁ,
దెల్లఁగా గట్లతెగదాయ • దెసనెలంగఁ
గానఁగానయ్యె నేళ్ళరా • కందెనంగ. 44

టీక॥ తెఱ...కల్కి=దేవేంద్రునిభార్య శచి, ననల్...నంగ=వ్రాలగుత్తి, తఱి...డీఁడు= సమయమాంత్రికుఁడు, గాలికందు= వాయుపుత్రుఁడు (హనుమంతుఁడు), ఇలకన్నె=భూకన్య, సీత, కటికి...రాకాసిఁ=చీఁకటి యేనుఁగురాక్షసుఁడు, చేదలేఁటఁ= ఆకాశగంగయందు, హత్తినీఁడు= హస్తిపతి(గజరాజు) గట్ల...దెస=ఇంద్రదిశ, నేళ్ళరాకందు=నదీభర్తకొడుకు (చంద్రుఁడు).

శా॥ రేరాయం డిలతేనిలెంకదణి కా•రేజంటకాఁడై యటం
దారాగా, నిలకన్నె తె న్నరసి దం•డం జెట్ల గట్లంతటన్
రేరాఱాలఁ దలిర్చగట్టి సిరిచే•రే కత్తఁగానైన జే
జేరా,దాయలటెంకి లంక నతఁడా • చెంతం గనెం దేఁటగాఁ. 45

టీక।—రేరాఱాలఁ=చంద్రకాంతశిలలచేత, జేజే...టెంకి=దేవతల వైరియైన రావణుని లంకను, కనెఁ= చూచెను.

చ॥ కని, తెఱఁగంటిఱాల తెగఁ • గట్టిన చేక్కఁదనాలసజ్జెలం
గని తెఱఁగంటిచేడియలఁ • గట్టిడఁగల్ చెఱసాల లాదటం
గని, తెఱఁగంటిదాయల, నె • గాదిగఁగాంచి, కడిండి కంట్లడం
గని తెఱఁ గంటిరానయిన • దంచేని చెచ్చెర గాలికం దఁటఁ 46

టీ—తెఱ...తెగఁ=దేవమణులచేత,సజ్జెలఁ=మేడలను, కట్టి+ఇడఁ+కల=కట్టియుంచిన, తెఱ... యలఁ=దేవతలకు విరోధులగు రాక్షసులను, కంట్లడం=...నయినది=విరోధులు చేచ్చు యుద్ధక్రమము దగ్గరకువచ్చినది, గాలికందు=వాయుసూనుఁడు (హనుమంతుఁడు)

—• హనుమంతుఁడు రావణునివిభవమునకు వెఱగుపడుట. •—

సీ॥ చెఱనిడ్డ తెఱఁగంటి • చేడియల్ కన్నంటి
నలఁత చే నజ్జెల • నంటిడంగ
సిగలఁదాలిచిన జే•జే చెట్లననసరాల్
సిరి జెట్టిలేనట్టి • చెన్నిడంగఁ

దన నగల్ సిరిచేతఁ • దనకాలిదరి తెఱఁ
గఁట్లాండ్రి సిగలచీఁకట్లడంగఁ
గడిఁదియొదం గాయఁ • గాచిన తెలిహత్తి
తాఁకిన కఱజీర • తళ్కుఁ డంగ
తే॥ నలర ననసెజ్జఁ గన్నంటి • యంటనట్టి
చేయ, సీతనెదందల్చి • సాౘకలసి
ఇట్టిజోడఁ గనంజేయ • నల్లచాల్త
లల గయాలిని దిలకించి • తలఁగదల్చి. 47

టీ__అజ్జలఁ=పాదములను, జేజే...సిరి=పారిజాతపుష్పమాలి కల సంపద, జెట్టి=వెల, తన...కట్లు=తన భూషణకాంతి చేతఁ, దనపాద ములొత్తు దేవకాంతల తలవెండ్రుకలవలన గల్గిన చీకట్లు, అడంగఁ= పోఁగా, కడిఁదియెదఁ=వెడల్పయిన రొమ్మునందు, తెలి...జీర=తెల్లని యేనుఁగు కుమ్మగానేర్పడిన నల్లనిమచ్చ, చాల్తలలగయాళి=పదున తలలవాఁడు (రావణుఁడు).

తే॥ ఇట్టితలనన గందవి • యట్టిపాళి
నిడెడి గాసిరిఁజెఱిచె, నీ • యెడ్డెయం చే
నంగ ననిరక్కసిండ్రి కం•సాలికన్నె
నతనిదరిఁగని సీతకా • దని యఁటచేని.

టీ__తల...పాళి=తలపూవు వాడనటువంటి సంతోషము, రా సిరి=రాజ్యలక్ష్మి, ఈయెడ్డె=ఈమూర్ఖుఁడు, (రావణుఁడు)రక్క...కన్నె= మయునికూతురు మండోదరి.

క॥ ఆనెలఁత లచ్చనాలం । దానెంతే నరసికాంచి • దాయ సిరిచెడం
గా నైనదనితలఁచి, సిరి । రానైనదియని యె నేల•రాయని కొంతేఁ. 49

టీ__ఆనెలఁత=ఆమండోదరి యొక్క, లచ్చనాలఁ=దుర్లక్షణ ములను; దాయసిరి=విరోధి లక్ష్మి.

చ॥ నెఱెననిసీతనేఁడఁ గన • నేరక కస్తినిగాంచి యాతఁ డ
ట్లఱిఁగి ననల్ సిరింగలిగి • నట్టియెడంగని దానిచెంత నే
డ్తెఱ రతనాలనజ్జఁగని, • తిన్నఁగదానిని నెక్కి నల్ దెసల్
తిఱిఁగి కడంకనాదరిని • దీరిచినిల్చిన చెట్లచెంగటఁ. 50

టీ__నవల్...గని=పుష్పసంపద గలచోఁటు (తోఁట) రత్న...స
జ్జ=రత్నాలమేడ.

—• హనుమంతుండు సీతంజూచుట. •—

ఉ॥ కట్టినచీరదాని, నడ • గట్టినకీల్జడదానిఁ, గాయలం
గట్టినకాలిదానిఁ గళ•గట్టినకైజెతదాని, వాఁకలిం
గట్టినదానిఁ, గంటినిలఁ • గట్టినదానిని సత్తిఁదాళినిం
గట్టినజేనికైయెడలఁ • గల్గినదానిని, రాచెలిం గనెన్. 51

టీ__అత్తిన్=కంఠమందు, తాళినిన్=మంగళసూత్రమును, జేని
కై=రామునకై.

క॥ కని చెలిచిన్నియ లారసి । కని సీతయకాని లాఁతి • కాదని దరిఁగ
ల్గినచెట్టెక్కి నిలచి, చ॥య్యనఁజెలిఁదాయఁగలదారి•యరయఁగనిలఁగన్

టీ__చిన్ని...కని=చిహ్నములు విచారించిచూచి, చెలి...
దారి=సీత చెంతఁజేరుమార్గము.

—• రావణుఁడు సీతంగనవచ్చుట. •—

ఉ॥ నేలనెలంతకన్నె యెద•నిల్చినయట్లయి లంకరాయఁ డా
రే లలినెట్టఁజోలక, జే•రీనెటిచీని కడానిచేలలం
దాలిచి, జాఁతిజాఁతి తెగ • దండలఁదాలిచి కత్తిడా ల్డగం
దాలిచి, తేరినెక్కియిల • దారినెలంతఁ గనం జనెన్ రహిన్. 53

టీ__నేల...కన్నె=సీత లంకరాయఁడు=లంకాపతి (రావణుఁడు)
రే=రాత్రి, లలిన్=వరుసగా, నెట్టఁజోలక=గడపనేరక,ఇలదారినెలంతన్=
భూభృత్కాంతన్ (సీతను)

చ॥ చని తనదైన రాచసిరి • సత్తిని, దిట్టతనాని, నేలరా
యని తెలిగంటికిం దెలియ • నాడి; తనంగనఁ జేయనేరకే
తనకయికత్తినెత్త నెలఁ•తల్ రహిం సీకిచి కానిచేఁతనాఁ
గినిసి, నెలంతతన్నెడఁదఁ • గేరకకాంచెవన్న సైచి, కా
దనిన నడంచిరండనియె • నాయనరక్కసి చానలందఱన్. 54

టీ__చని=(రావణుఁడట్లు సీతనుజూడ) వెళ్ళి, రాచసిరి=రాజసం
పద, సత్తిని=శక్తిని, దిట్టతనానిన్=ధైర్యమును, నేల...గంటికిన్ భూపతి
కాంతకు (సీతకు) కయికత్తి=చేతికత్తిని, కానిచేత=కూడనిపని, గేరక=
నిందింపక అడంచి=చంపి, రక్కసి...దఱన్=రాక్షసస్త్రీలను.

చ॥ అని తనటెంకిఁజేరఁజేన • నక్కడ నెల్తులకెల్లనంతఁ, గం
దనియఁగ నంటఁగాఁ, ద్రిజట • నాఁదగినట్టినెలంతదంట నిం
తనియనరాని చెడ్డకల • యాఁయెడరా, నదిలేచి నెల్తలం
గని తెలియంగనాడె నిల•కన్నియదానికి సంతసిల్లఁగన్. 55

టీ___టెంకిన్=ఇంటిని, కన్+తనియఁగన్=కంటినిండ, ఇలకన్నియ=భూకన్య (సీత)

—• హనుమంతుఁడు సీతకుంగరమిచ్చుట •—

చ॥ తిగజడలాఁకె యీఁకరణిఁ • దేఁటగనాడినయంతఁ జెట్లరాన్
దిగ, కనెగాలికందలరి • తిన్నఁగరాఁ చెలి! లచ్చెనన్న నిం
దగఁగనిరాగ నన్ననిచె • దండిగ, నాతని టెంకనే, నటం
చేగడెదఁ జెందతేఁ డిడియె•నంచని కానఁగఁజేయఁ గాఁ, నగన్. 56

టీక॥___తిగజడలాఁకె= త్రిజట, చెట్లరాన్= వృక్షరాజమును, దిగక+అనెన్, లచ్చెనన్న=లక్ష్మణునన్న=రాముడు, నన్నున్+అనిచెన్= నన్ను బంపెను, నగన్=ఉంగరమును.

మ॥ ఎడఁదం దానికిసంతసించి, తనతేఁ•డేతాల్చెనం చెంచి, చె
న్నడర న్నీతెఱఁగెల్ల నాకనఁగద•య్యా! నచ్చికంగాంచె, ని
య్యెడ నీ గారడిరక్కసిండ్రికడ, నే•నెట్లీరల న్నచ్చె న
య్యె, డనంగా నిలకన్నెఁగాంచి తనలా • గిట్లాతఁ డెంతే ననెన్. 57

టీక॥___ఎడఁదన్=మనస్సునందు, నచ్చికన్=నమ్మికను, గారడిరక్కసిండ్రికడన్= మాయారాక్షసులచెంత, ఈరలన్= మిమ్మునను నచ్చెన్=నమ్మెను, అయ్యెడు=అగును.

క॥ కనె నన్నఁజన నెఱినాంజనేయ! యనిచీరెదరఁట•జెక్కని యత్తిం
గనినదణి చెలిగఁగనె నీదణి లెంకగఁగాంచె నేల•దారినెలంతా!. 58

టీక॥___చెక్కనియత్తిన్=సుగ్రీవము, కనినదణి=పడసినరాజు (సుగ్రీవుఁడు) చెలిగఁగనె=స్నేహితుఁడుగాబడసెను, నీదణి=నీప్రభువు=రాముఁడు, లెంకగఁగనె=భటుడుగా బడసెను, నేల...లంతా=రామకాంతా! సీతా!

సీ॥ అని క్రిందికిం డిగి • యెక్కల్కికి నెఱంగి
తల్లి! నింజెనఁటి చేతల్తలలతఁ డిట
దెచ్చెడినాఁ డార్కి • దెసఁజేర నీయిడి
నట్టి చించినచీర • నలరిన నగ
లిలరాయఁ డార్కికిఁ • జెలియైన తఱి నీయ
గని సంగసిల్లి నీకరణి నడలె
నార్కికినే స్త్రియై • యతని యన్న నడంచి
యాతనిసిరిఁ, జెలి • నతని కిచ్చె
తే॥ నంత నెల్ల కడలలెంక • లతనియాన
నిన్నరసి కాంచ నేతెంచె • నన్నిటకని
యంచె నిన్గంటి లగ్గయ్యె • నడల కింక
నిచేటి కేతెంచెఁగల డాతఁ • డల్లి నేఁట. 59

టీక॥—ఎఱంగి=నమస్కరించి, ఆర్కి=అర్కునికొడుకు (సుగ్రీవుఁడు,) చెలియైనతఱిన్=మిత్రుఁడైనసమయమున, లగ్గయ్యెన్=మేలయ్యెను.

—• హనుమంతుఁడు, సీతకు, రామలక్ష్మణులవర్ణించి చెప్పుట. •—

ఉ॥ చెన్నఁటిరక్కసీఁ డడరి • చేడియ! నిన్నిఁటఁదెచ్చినాఁ డఁటం
చేన్నఁగఁ గాయలాఁకయిన • నేలికయేలని యారగించెఁ డిం
కెన్నఁటికేని నేఁ గనెద • నే చెలి నంచని యాన సేసెడిం
దిన్నఁగఁగాంచె నిన్నెడద • నించినచాయన కాన నయ్యెడిన్. 60

సీ॥ జెడినీటిదారిరా • జెగడాల జెగడాల
నగజాల గలజిగిఁ • దగినజియ్య
తెలిచేనగద్దల • దీటైన నీటైన
నేటైనకన్జంట • నెగడినయ్య
యెడనైన జిగిఁగన్న • యుద్దాలనిద్దాల
కద్దైనచెక్కిలి • నలరినయ్య
తెఱఁగంటిరాహత్తి • నెఱిగేలినెఱిగేలి
నెఱిగేలినేసెడి • నేలజియ్య

తే॥ కలికికెంగేలి సింగాణిఁ • గలిగినయ్య
సిరిగలిగినట్టి చిన్నెల • సిరిగలయ్య
దంటయైనయ్య తిగజగా•లంటియెంచె
దగిననెఱిగలయయ్య నిం • దాల్చినయ్య. 61

టీ—జేడి=వర్షాకాలము, నీటిదారి=జలధరము మేఘము, జేగ డాలన్=శ్రేష్ఠమైనకాంతులను జేగడాలన్=పోరులందు, నగఁజాలఁ గల=నవ్వగల, జియ్య=ప్రభువు, తెలిచాన గద్దెల=సరస్వతీపీఠముఁతో (తెల్లదామరపువ్వులతో) అద్దు=నివాసము, తెఱ...హత్తి=ఇంద్రుని గజము యొక్క, నెఱిగేలిన్=అందమైనతొండమును, నెఱిగేలిన్= (రాముని) తన యందమైన చేతిచేత, నెఱిగేలిసేసెడి=వరుసగా తిరస్క రించెడి, కలికి...నయ్య=మేలైన చేతియందు ధనువుగలవాఁడును (కోదండపాణి), తిగజేగాలు= ముల్లోకములు.

విభూతి॥ లెక్కలేని చిన్నెలం । జెక్కఁగాఁ దలిర్పఁగా
నక్క! యేరికెంచఁగాఁ । జిక్కతండిలం దగన్. 62

టీ—అక్క! ఓసీతా! అతండు=ఆ రాముఁడు, ఏరి...జిక్కన్= ఎన్నట కెవరికిఁ జిక్కను?

క॥ ఎన్నఁగ లచ్చన యిన్నియ । చిన్నెలఁదగ నన్నజేని•చెంగటిలెంకం
చేన్నాతినచ్చినగఁగని । చెన్నారగఁగంటనద్ది• చేదాల్చి యనెన్ 63

టీ—లచ్చన=లక్ష్మణుఁడు, అన్నాతి=ఆసీత, జేని...కంచున్= రామునిదగ్గర బంటునినమ్మి, నగఁగని=ఉంగరమునుజూచి, కంటనద్ది= కంటికద్దుకొని.

క॥ అన్నా! రాయనిలగ్గిటఁ। జెన్నారఁగనాడి రాల్స • సిం జేడినీటం
జెన్నారఁదేల్చిన ట్ల । న్నన్నా! నం దేర్చి తివేట• నడలెడిదానిన్.64

టీ—రాల్...నట్లు=పడిపోవుపైరును వర్షపునీటిచేత వాడుదీ ర్చినట్లు, అన్నన్నా=ఆశ్చర్యము, అడలెడి=భీతిల్లునట్టి.

ఉ॥ ఇట్టిఁడి కింక సీతఱిని • నెట్టిది ల గ్గనయంగఁ జేయరా
దిట్టిఁక నెన్నినాళ్ళయిన • నీయిఁనే చెఱలాడెదయ్య! యా
కట్టిడిదాయ నన్నిచటఁ • గాల్లుఱచెంగద జేనికన్నిటిం
గట్టిగ నాడిదాయ యడ•గం గలదారిఁ గనంగఁ జేసదే?. 65

టీక॥—ఇట్టిడికిన్=ఇటువంటివానికి, కట్టిడిదాయ=కష్టాత్ముఁడైన విరోధి (రావణుఁడు) దాయ...జేసెదే?=విరోధినాశనమగు మార్గము నుజూపెదవే? (అనిప్రశ్న).

శా॥ రారాయుం డటఁ గానఁ గాన్నడక రా•రావన్న నాలించె కే
రా రాయండఁటఁ లేడికై చెనిన నే•రాయంగఁ దా నన్నకై
రా రాకాసికిఁ జిక్కనయ్యెనని, నే • రాలెంచె లంకనేల్
రా రాలం గని చేక్క నన్నచేటఁ జే•రం జేయఁగా నెంచెరే? 66

టీక॥—రారాయండు= రాజరాజైనరాముఁడు, ఏరాన్= నేను రాగా, నేను రాయంగన్=నేనుతలచి కఠినముగా మాట్లాడఁగా, అన్నకై రాన్=అన్న రామునికై రాగా, రాకాసికిఁ జిక్కనయ్యెనని=రావణుచేత జిక్కవలసివచ్చినదని, నేరాలు=నేరములుతలంచేక, లంకనేల్ రా=లంకాపతియైన రావణుఁడు, రాలంగని=పడిపోవుదారిఁజూచి.

ఉ॥ అన్నది సీతయాకరణి • హాళినటం చిలతేంద్రకాడి నీ
కన్నదియెల్లఁ జెక్కనని • క్రిచ్చెఱ నా, తలఱాతి రా నిదే
తిన్నగ లచ్చన్న కిడి • దిద్దెదె నా దయినట్టిచేత, నా
యన్నగ! యన్నసట్లెయని•యాయన యాకె కెఱంగి యేగెఁదాన్. 67

టీక॥—హాళిన్=విచారముతో, ఇలతేంద్రకున్= రామలక్ష్మణులకు, నాతలఱాతిరాన్=నాశిరోరత్నమును, లచ్చన్నకిడి= లక్ష్మణాగ్రజునకిచ్చి, ఆకె=ఆమె, ఏగెన్=వెళ్లెను.

— • హనుమంతుని వనవిహారము • —

ఉ॥ ఏగి నెలంతచెంతఁగల • హెచ్చిన డిగ్గియలం గలంచి య
ట్లేగి నడానఁ జెట్లగని • కేగి జెగానన తీగెకాయలం
లాగి, నలంచి తేనెతెర • లం గని రాలిచి తాగ్రి రక్కసీం
డాగ్రినఁజెక్కడంచి చేన • నాయెడఁ జిక్కినయట్టి రెంతయేన్. 68

టీ—డిగ్గియ=దీర్ఘికాశబ్దభవము, అనఁగాఁగొలను, చెట్లగని= తోఁట.

ఉ॥ రక్కసితేని జేరఁజేని • రాయఁడ! రేఁ దన జోడనేరికిం
జిక్కఁగనీని లెంక యిల•చేడియ కన్నియఁజేరి యేదియేన్
జేక్కఁగనాడి యెల్లెడలఁ • జోలఁ, గలంచి నలంచి దండ్లఁ దాఁ
జెక్కడచెంగదా యనిన • చొల్లలలం గలజెట్టి నెట్టనన్. 69

టీ__రేఁ=రాత్రియందు, ఏదియేఁ=ఏదో రహస్యము, వెట్ట నఁ=వెంటనే.

ఉ॥ దగ్గరి లెంకలంగడక • తగ్గక దాయనడంచె నంచేఁ దా
రెగ్గన కట్టెతాఁక నిల • యేలికలెంక; నతండెదం రగిల్
తగ్గని క్రొక్కిగిత్తడర • ధండ్లతెగం దగిలించి వాల్చి తాఁ
దగ్గక నీళ్ళజేనినెఱతత్తడి తాఁడఁట నెక్కియాడఁగఁ. 70

టీ__దగ్గరి...నంచఁ= (రావణుఁడు) తనదగ్గరిభటుల పూనిక విడువకుండ హనుమంతుఁడు ప్రింపఁబంపగా, తారు+ఎగ్గు+అనక+అట్టె=వారిట్లుఎదిర్చిన మనకేమికీడుమూడునోయనక వింతగా, ఎదం...డరఁ= హృదయమునబుట్టి రగులుచున్న కోపాగ్ని యొప్పగా, నీళ్ల...తాఁడు= కుబేరునిగుఱ్ఱమైన మొసలిపేరితోరణము (మకరతోరణము)

ఉ॥ ఆతెఱగెల్ల లంకదణి • కయ్యెడజిక్కినయట్టి రాడఁగా
నా తెఱఁగంటిదాయ తన • యండనకల్ తిగరక్కసీండ్రఁ దా
నే తఱిలేఁచేఁ దారడలి • యేగఁగ నేలికలెంక హెచ్చఁగా
నాతఱి రేయిరా కడలి • యం దడఁగెం దననేస్తిరా నఁటఁ. 71.

టీ__లంకదణికిఁ=లంకాపతికి, చిక్కినయట్టిరు=మిగిలినవారు, ఆడఁగాఁ=పలుకఁగా, తెఱఁగంటిదాయ=దైవతవిరోధి(రాముఁడు) రేయిరా=రజనీపతి=చంద్రుఁడు, తననేస్తిరానటఁ=తనమిత్రుఁడటు వెనుక రాగా.

—• ప్రి భా త వ ర్ణ న ము •—

ఉత్సాహ॥ ఆకసానసాగి తిండి • కై యతంగె తెక్కదా
ర్లేకతానసైనఁ జేల • కేగనైరి సేద్యగాం
డ్రికలంకలేక లంజ • లిండ్లజారిచేరి ర
ట్టాకలం గడంకనిండ • రాణజెంటకాండ్రకై. 72

టీ__తెక్కదార్లు=పక్షులు, లంజలు=విటకత్తెలు, అట్టాకలు= మరుగుచోట్లు, జెంటకాండ్రకై=జేతకాండ్రైన విటులకయి.

—• సూ ర్యో ద య ము •—

సీ॥ జేజేలరాదెన • సింగారిమెఱతాలఁ
దీర్చికట్టించిన • దిద్దనంగఁ

జెండ్లాడికందిన • జేజేలరాకల్కి
కనవెత్తినట్టి కెం • గైయనంగ
నెఱగెడిజన్నిగ•ట్లిచ్చెలాతఱికిఁ ద
గందీరిచెడి జన్ని•గట్ట నంగ
జన్నిగట్లిడెడి నీ•ర్జా, లడిదాల చే
నీ గ్లెఱరాదాయ • నెత్రినంగ

తే॥ రిక్కలడఁగంగ రేయెండ • రెచ్చెడంగఁ
గట్టిచెలిచెలియిండ్లఁ జీ • కట్లడంగ
గట్లదాయదెసంజేలఁ • గాఁజెలంగఁ
గానఁగానయ్యెఁ జాయరా • గండెసంగ. 73

టీ—జేజే...గారి=ఇంద్రదిక్కనెడికాంత, జేజేలరాకల్కి=ఇంద్రునిపత్ని (శచి) జన్నిగట్లు=యజ్ఞోపవీతధారులు (బ్రాహ్మణులు) జన్నిగట్టు=బ్రహ్మ, "తాతజన్నిగట్టన విధాత" ఆం సం. ఎఱ్ఱ...నెత్రి=సూర్యవైరులగు మందేహులనెత్తురు, కట్టిచెలి=అర్జునమిత్రుఁడు, చెలి=భార్య, అనగా లక్ష్మి ఆమెయిండ్లు పద్మములు, గట్లదాయదెస=పర్వతవైరిదిశ, చాయరా=ఛాయాపతి.

ఉ॥ కేసరికందఁటం గడఁక • గిన్క నదల్చిన దాయయేనికల్
నీసఱయైనదిట్టఁ గన • లేదని హెచ్చెడిదాలఁదార్చు, నిం
తేసరినాఁగ దాయతెగ • నింగికి దీసియడంచె, రాచలెం
కే, సరిరా, యనంగ నిల • నెల్లరఁటం, దరిదాయలెంతయేఁ. 74

టీ—దాయయేనికల్=వైరిగజములు, దరిదాయలు=దగ్గరవిరోధులు.

ఉ॥ చెయ్యననేగి, చాల్తలల • జాణకడం జెరగంగ నైన లాఁ
గయ్యెడనాడఁగా, గినిసి • యాయనరక్కసిదండ్ల నంచినం
డయ్యఁగఁజేసి నెట్టన న • డంచిన రాయనిలెంక, చిక్కి రే
యయ్యలెసంగఁదారరిగి • యాతెఱగాడిరి లంకజేనికిఁ. 75

టీ—కినిసి=కోపగించుకొని, డయ్యఁగఁ=పడలునట్లు, చిక్కి...రిగి=ఎవరుమిగిలిరో వారువెళ్లి, లంకజేనికిఁ.

—• అక్షయకుమారాదులవధ •—

క॥ అనఁజిన్ని కందఁటండగ । గనిరాయనిలెంక నంటఁ • గట్టియతేరా
యని యంచెలంకరాయం । డనిచిన రాకాసిచిన్ని • యాతం డంతన్

టీ—చిన్ని...గని=చిన్న కొడుకక్షయుఁడక్కడ నుండఁగాఁజూచి.

ఉ॥ చెక్కని తేరినెక్కి తన • చెక్కిని రక్కసికండ్లెసంగ, దా
నక్కడి కేగి దాయ వని • నాగి, జేగాజిగి, చిల్కిడంగ నా
యెక్కటిరాచలెంక తగ • హెచ్చిలి సింగిణిఁ దేజి సాహిణీ
నెక్కినతేరి దండ్లతెగ • నేర్త్రరాలిచెఁ దాడినాడటన్. 77

టీ—చిల్కు+ఇడంగన్=బాణమువిడువగా, ఎక్క...లెంక=ఒకడైనరాజభటుఁడు, తాడిన్=తాటిమ్రానుపెరికి దానిచేత తేరుమొదలైనవి పలుగఁగొట్టెను.

ఉ॥ రా యని దాయకం దడరి • రాయనిలెంక కడంకదక్కి నేల్
రాయఁగ నీఁటెచే నడచెఁ • గ్రిచ్చెర నాయన లేచి దాయఁ జేఁ
దాయగఁదీసి నేఁనిడి • తాచిన యాయన దక్కినానఁగల్
రాయనిఁ జేరె; నంత నని • రాలకచిక్కినయట్టి రేడ్తెఱన్. 78

టీ—రాయ...డరి=రాజవిరోధి కొమారుఁడొప్పి, (అక్షయుఁడొప్పి) ఆయన=ఆయాంజనేయులు, తాచిన=తన్నిన, దక్కి...యనిన్=దక్షిణమునగల యముని, అనిన్=యుద్ధమునందు, అట్టిరు=అటువంటివారు.

క॥ చేని యలరక్కసిరాయనిఁ । గని నీకం దీల్గెతేఁడ!• కటకట! యనఁ గ
స్తినిదండ్లఁజిన్నతని నెద । గని చాలఁగఁదలఁచి యడలె•గడ కీకరణిన్

టీ—నీకందీల్గెన్=నీకొడుకక్షయుఁడు మరణించెను. కస్తి=కష్టము, ఎదన్=మనమున.

తే॥ తెల్లిలితే యక్ష! యనిగచ్చెఁ • జెల్లితె శత
రసన! రాలితిగా దీర్ఘ•రసన! నేల
జేక్కడఁగనయ్యెనేకటా! • స్తనితహస్త!
నల్లనెఱకలరాకాసి • చెల్లితయ్య! 80

టీ—నల్ల నెఱకల రాకాసి=కృష్ణరోముఁడు.

—◆ ఇంద్రజిత్తు, హనుమంతుఁ బట్టితెచ్చుట. ◆—

తే॥ అని యి టడలఁగ నింద్రజి◆త్తచ్చటికి న
డల్ల నేతెంచి తండ్రి! య◆డలకటంచే
సంగఁగాఁదేర్చి, దాయ న◆లంగనీక
తాన తెచ్చెదనని యేగెఁ ◆ దండ్రియాన. 81

టీ—ఇటు+అడలఁగన్, దాయన్=విరోధియగు హనుమంతుని, ఆనన్=ఆజ్ఞను.

చ॥ నెఱిఁగల తేరినెక్కి, జిగి ◆ నిండినసింగిణిఁ గేలఁ జెక్కి, య
ట్లలఁతిఁ గి కడంక దాయ నని ◆ నాగి యెదిర్చి కడిందిచిల్కొద
న్సరిగఁ దడాల్న నాట; నల ◆ జానకి నేలినతేని లెంక క్రి
చ్చరఁగని యార్చి కైసిరిని ◆ జొత్తలలాతనికం దడల్ కనన్. 82

టీ—చొత్తల...కందు=పంక్తిశిరునికొడు కింద్రజిత్తు.

ఉ॥ ఎక్కిన తేరిఁ దేరిఁగడి◆యించిన తత్తడిజెంట సాహిణిం
జిక్కిన టెక్కియం గడఁక ◆ చేతఁ దలిర్చెడి యీఁటె సింగిణీల్
తక్కిన దండ్లఁ, జెట్లతెగ ◆ దండిగ దారిచిరాల్చి, యాతనిన్
రక్కిన నెక్కసానఁ గని ◆ రక్కసితేని కడిందికం దఁటన్. 83

టీ—సాహిణిన్=రథము దోలువానిని, రక్క...దఁటన్=రాక్షస రాజపుత్రుఁడైన యింద్రజిత్తటుతరువాత.

స్రగ్విణి॥ తాత చిల్కా తనిం ◆ దాఁకఁగా నేసి, కాల్
కైతల ల్జక్కన ◆ ల్గంగనీ, కంతఁ, గ
న్నాతనిం జేర్చె, న◆న్నన్న! యం చెన్నఁ గ
న్నాతఁ, డాజాతిరా◆యల్ కడం కం దనన్. 84

టీ—తాత చిల్క=బ్రహ్మాస్త్రము, ఆతనిన్=ఆహనుమంతుని, నల్గంగనీక+అంతన్=నలగనీకుండ నంతట, కన్నాతనిన్=కన్నవాఁడైన రావణుని, అన్నన్న!=ఆశ్చర్యము.

—◆ హనుమంతుఁడు, రావణునితో మాట్లాడుట ◆—

ఉ॥ చేరిచి నంతఁ జొలఱితి ◆ జెట్టిలరాయని లెంకఁ గాంచి కై
జేరిచి కత్తి హెచ్చి యనెఁ ◆ జెట్లఁ దిఱింగెడి సన్నకాఁడ!, నం
జేరి నిలంగ లేరయిరి ◆ చెచ్చెర నా తెఱఁగంటి దిట్టలే
చేరినటే కడల్ గడచి ◆ చెల్లరె! యెల్లెడలం గలంచితే?. 85

టీ—చేాల...జెట్టి=ప_జ్రికంఠుఁడనెడి మొనగాఁడు, చెట్ల......
కాఁడ!=వృక్షచరాధమా! తెఱఁగంటి దిట్టలే=దేవతాశ్రేష్ఠులె.

క॥ నీ తెఱఁగెయ్యది? నిన్నెతఁ । డే తేరఁగఁజేసె లంక ♦ కెఱిగించేనఁగా
నాతనికిని సంజనకం । దాతఱి నిట్లనియె జెంక ♦ కలరి యొడంద౯

టీ—తెఱఁగు=విధము ఎతఁడుఁ=ఎవ్వఁడు, అంజనకందు=ఆంజనేయులు, జెంకక=భయమును బొందక.

క॥ కనె నన్నంజన నెఱినాం । జనేయ! యనిచీరెద రల ♦ చేక్కనియత్త్రిం
గని నతనిచెలిని, లెంకగఁ।గనిరొం జే_త్తేర్లతేని♦ కం దలరార౯. 87

టీ—చేక్కని...చెలిని=సుగ్రీవుని మిత్రుఁడను, చేా_త్తేర్ల...కందు=ప_జ్తేరథునికొడుకు (రాముఁడు) కనియె౯=పడసెను.

శా॥ ఆరారాయనికల్కిఁ దెచ్చి తనిరా ♦ యం డంత నన్నంచేఁగా
నే రానై చెలిఁగాంచి లగ్గడిగితి, ♦ న్నీ చెంగటంజేరి నీ
కీ రాకల్కనిదేగఁ గిట్టదనియే ♦ యెంతేనినాడంగ, నీ
తీ రాడాడఁ గలంచి నీకయిన కం ♦ దే చేర్పఁగా నిల్చితి౯. 88

టీ—ఈతీరు+ఆడ+ఆడ౯=ఈలాగక్కడక్కడ, నీదయినకందే=నీకొమారుఁడగు నిందె్రజిత్తె

ఉ॥ ఎల్లజెగాలతల్లియయి ♦ యి య్యిలగాదిలి కన్నెయై కనం
దెల్లనినాతియత్త కెన♦ తేఁదగినట్టి నెలంతసీత, ని
ట్టెల్ల రెసంగఁదిట్ట దగ ♦ దిట్లని నీకనఁగగ్గినట్టి రే
యుల్లగనైనఁ దెచ్చితిఁక ♦ నీరల లచ్చినడంచి తేటికి౯. 89

టీ—ఎల్ల...యయి=సమస్తలోకము ఒకుదల్లియయి, ఇయ్యిల...యై=ఈభూమికి ముద్దులబిడ్డయై, తెల్లని...నట్టి=సరస్వతికత్తయైన లక్ష్మికి జతసేయదగినకాంత.

సుగంధి. తాతజాతిఁగల్గి నల్కతల్ తెఱంగెఱింగి చేఁ
జేత, జాతిచిల్లచేతఁ ♦ జేసి, యాతఱిం, గటా!
జాతిసం, తెసంగనీక ♦ చేక్కడంచేఁ గాంచి, తీ
జాతిచేతల౯సడల్చి ♦ జానకింగలంచేకే. 90

టీ—తాతజాతి౯=బ్రహ్మకులమునందు, నల్కతల్=చతుర్వేదములు, జాతిచిల్లచేత౯=రక్కసికొంటెపసిని, జాతి+సంతు+ఎసంగ౯×ఈక=కులము, సంతానము, ఎక్కువవృద్ధికాకుండ, సడల్చి=ఉడిగించి.

క॥ నెఱేనిచ్చి యెఱిఁగితే ని। న్నెఱఁగాచెడి నేలదారి • నెలకన్నాక
ట్లెఱిగి యిడనట్టినాఁ డే। ద్దెఱ సీతల లెల్ల రాల్పుఁ • డే చెలిఁ గనఁడే? 91

టీ—ఎఱిఁగి=నమస్కరించి, నేల...కన్నాకు=భూభృద్బృందు శ్రేష్ఠుఁడు (రాముఁడు) ఇడనట్టినాఁడు=సీతనియ్యనిదినమున, చెలిఁగనఁడే= సీతను పడయఁడా? అనఁగాఁ బడయును.

శా॥ జేజేదాయ కిటాడ నాతఁడనె నిఃస్సీ? తేఁడటంచాడి, నీ
జేజేగా నెఱి నెన్నె, దాతఁ డనఁగా, • జేజేలరాయండ? తెల్
జేజేరాయఁడ? ఛాయకంద? తెలిడాల్ • సింగారినాయండ? యా
జేజేలందఱ గెల్చినట్టిఁ డిని నా • చెంత న్నిలం డక్కరీ! 92

టీక॥—జేజేదాయకుఁ=(సురద్విట్) దేవతలవిరోధి రావణునకు, జేజే=దేవుఁడు, తెల్...యడ=తెల్లనివేల్పుగాయడ, (శివుడ?) ఛాయ కంద=ఛాయాపుత్రుఁడగు యముఁడ? తెలి...యండ=తెల్లచెలియైన సర స్వతి యొక్క భర్త బ్రహ్మయా? టక్కరీ=టక్కరికాడా! ఆంజనేయుని సంబోధన.

క॥ కడయేలికలం గెలిచితి। కడకడరాయని కడింది • గట్టెత్తితి, నా
కడనిలఁగఁజాలఁ డే ఁడిఁకఁ। గఁడగానక కానఁగన్న • కఱితే. డేలా? 93

టీక॥—కడయేలికలఁ=దిక్పతులను, కడ=చివరదైన, కడ=దిక్కునకు, రాయని=ప్రభువైన శివుని యొక్క, కడింది=గొప్పదైన, గట్టు= కైలాసగిరిని, ఏఁడు=ఎవఁడు.

క॥ అని తెగడెడి రక్కసిరా। యని కంజనకం దిఁటనియె • నహహా! లగ్గా
డిన నీకెగ్గయ్యెం జె। చ్చెనె తాఁచేని జిడ్డిడంగఁ • జేదైనట్లే. 94

టీ—లగ్గు=మేలు, ఎగ్గు= కీడు, చచ్చె...నట్లే= చేచ్చిపోవునే యని పామునకుఁ బాలువోసిన విషమైనట్లు మంచిచెప్పిన చెడుగ మాఱెను.

సీ॥ నిఁక, జెంకనిఱేకి నల్ • నీళ్ళతిట్టలఁ దేల్చి
నతని రాల్చిన యతం • డితఁడ కాద?
నీ, యెత్తఁజాలని • నెలదారి సింగాణి
నెత్తి గండించిన • దితఁడకాద?
నిఁక, జెఱనిడిన రా • నెల నిఁ, రాల్చిన
యతని హెచ్చడఁచిన • దితఁడకాద?

. . నీ కని లేడియై ♦ నెత్తురజేర్ని రాకాసి
నిలరాలనేసిన ♦ దితఁడకాఁడ?

తే॥ తిగతలల రక్కసీని నాఁటెట్టనేస్త
కాని నడఁచిన దితనికైఁకత్తికాదు?
యిట్టిరానెల నీయందిఁకేటి కింత
కడిఁది సన్నాల నారసి ♦ కనఁగరాదు?. 95

టీ—నిర=(రావణుని) నిన్ను, చేంక...తనిర= చెంకలనొత్తి సముద్రములదిరిప్పిన వాలిని, నెల...ణి=శివునివిల్లును, గండ్రించి=ఖండించి, నిర=నిన్ను, (రావణు), చెఱ...తని= చెఱబెట్టినకార్తవీర్యార్జును జంపిన పరశురామునియొక్క, లేడి...కాని=లేడియైవెళ్ళిన మారీచుని, తిగతలరక్కసీని=త్రిశిరుని, కడిదిసన్నాలు=గొప్పకొద్దిసనములు.

చ॥ అనఁదగ నాఁకింపి, తలఁ ♦ లన్నిఁటినిం గదలించి, కిన్కఁ జే
య్యనఁ దలఁదెబ్బ్లనేయఁ దన ♦ యండన కల్గిన దండ్లకానతి
చ్చినఁ దనతల్లికిం గడన ♦ చెన్నులరారఁగఁ గల్గినట్టి, డి
ట్టనఁ దగదన్నఁ గాల్పెనటఁ ♦ నచేఁగ లెంకల కానతిచ్చినర॥

టీ—తన...నట్టిడు=తల్లికై కేసికి: జివరగల్గి నటువంటివాఁడైన విభీషణుఁడు.

తే॥ లెంకలెల్ల, నల్లరిఁజేసి ♦ లెక్కలేని
చీరల న్నేఁత నానఁగాఁ ♦ జేసి కట్టి
చిచ్చెపఁగ నిడి రాలెంకఁ ♦ జేరి యార్చి
రాచేదారిని నట్టె చెఁల్లాడఁజేయు. 97

టీ—రాచేదారి=రాజమార్గమునందు.

ఉత్సాహ॥ సీత కద్ది రక్కసీండ్రి ♦ చేడెలాడఁ జోలఁగా
నాఁతికలఁగి, యంటరని ♦ నాయనిం గడిందిగాఁ
జేతినెత్తి యెఱఁగి లెంకఁ ♦ జెడక కాయ నడిఁగినర
నాఁతి, యడిఁగినట్లచేసె ♦ నల్లనారతేఁ డఁటర. 98

టీ—నాఁతి=సీత, అంట...యనిర=ముట్టుకొనవీలుకాని ప్రభువు (అగ్ని), లెంకర = భటుఁడైన హనుమంతుని, నల్లదారితేఁడు = కృష్ణవర్త్ముఁడు అనగా నగ్ని.

క॥ తనకట్టూడఁగఁగ నంజన । తనఁ గల్గినదిట్ట తాత ♦ గారి, కెఱఁగి చే
య్యన నగరఁగాల్చె రక్కసిచినరాయని టెంకిఁదక్క ♦ చిక్కినయిండ్లన్.

టీ—అంజన...దిట్ట=ఆంజనేయులు, తన...గఁగ=తన బ్రహ్మాస్త్ర సంబంధమైన కట్లు వీడిపోవుటకు, తాతగారికెఱఁగి=బ్రహ్మదేవునకు నమస్కరించి, రక్కసి...టెంకిన్=రాక్షసులందు జిన్నప్రభువు విభీషణుఁడు.

ఉ॥ కాలిచి నల్లదారిఁ గల ♦ గద్దరి నక్కడలిం జెలంగఁగాఁ
దేలిచి యార్చి, సీతఁగని ♦ తేరిచి నీ కడలేల? నే నిదే
ఏలికఁ దెచ్చెదం జేరిగి ♦ యే డ్తెఱ నక్కడలిం దడాపడిం
దేలిక గాఁగ దాటి యల ♦ తేనియకానఁ జెలంగి యాడఁటన్.

టీ—నల్ల...గద్దరిన్=నల్లని దారివాఁడగు నగ్ని, నీకున్+అడలు ఏల?=నీకు భయమెందుకు? కడలిన్=సముద్రమును, తేనియకానన్=మధువనమును.

క॥ తనజాతినేస్తకాండ్రం । దనరారఁగఁ గలసియేగి ♦ దగ కిష్కింధం
గని. సంతసాన తేనిం । గని సాగిలి యెఱఁగి నిలిచి ♦ కదలనికడకన్.

టీ—తేనిన్=రాముని, కదలనికడకన్=నిలుకడయగు ధైర్యముచేత.

—♦ హనుమంతుఁడు రామునకు సీతావార్తను దెలుపుట ♦—

క॥ కంటిని తేఁడా! నీ తెలి । గంటిని, నీనగ నిడంగఁ ♦ గంటిని నీల
గ్గంటిని జెలినగనీ కేఁ । గంటిని, గన్నారసిచేఁట ♦ గంటిని నే నిన్. 102

టీ—నీతెలిగంటిని=నీధవళాక్షియైన సీతను, నీనగ=నీయుంగరము నీలగ్గు+అంటిన్=నీక్షేమము నామెతోఁబల్కితి, చెలినగన్=నీభార్యయైన సీత శిరోరత్నమును.

క॥ అని యంజనకం దెఱిఁగిం । చినఁ జేలంగ నెక సంత ♦ సిల్లి కడంకం
జని సీతఁ దేఁదగినదా । రి, నరసి నిలిచెఁ గఱిరాచే ♦ రేతేఁడన్నన్.

టీ—కఱి...తేఁడు=నీలమేఘచ్ఛాయఁగల రాజచంద్రుఁడైన రాముఁడు, అరసి=విచారించి, నిలిచెన్=ఉండెను.

క॥ అనిదిండిజేడలదారిని । గని నెఱిఁగాల్ దిండ్లటెంకి ♦ గలిగిన జేడదా
రి నెల యఁటుఁ జేరిగినకతం । దన కెఱఁగించెంగ నడిగె ♦ దద్దఁ నలిర్చన్ 104

టీ—అని...గని=కలహాశనమునిని (నారదుని) చూచి,గాల్... నెల=వాయుభక్షణసేయు సర్పముల కిల్లయిన పుట్టనుబుట్టిన వాల్మీకి తద్దఁ=చేక్కఁగ.

ద్వితీయాశ్వాసాంతము

—♦ కందగర్భిత మణిగణనికర వృత్తము ♦—

దిరిసెన ననజిగిఁ ♦ దెగడెడినెఱిఁడాల్
నెఱయఁగఁదిరిగెడి ♦ నెఱిఁగలయతఁడా!
కఱిచెలినెఱిఁగనఁ ♦ గలిగినగఱితన్ 105
గఱిగరిక దరిని ♦ గలిగినయతఁడా!

టీ—దిరిసెనసన=దిరిసెనపువ్వు, కఱిచెలి=భూదేవి యొక్క.

—♦ గర్భకందము ♦—

దిరిసెన ననజిగిఁదెగడెడి।నెఱిఁడాల్ నెఱయఁగఁదిరిగెడి♦నెఱిఁగలయతఁడా
కఱిచెలినెఱిఁగనఁగలిగిన। గఱితన్గరగరికదరిని ♦ గలిగినయతఁడా!

మ॥ కలిగించేన్ నెగడించేఁ గిన్కనడఁచేం ♦ గల్ దిట్ట జేజేతెగం
గలిగించేన్ నెగడించేఁ గిన్కనడఁచం ♦ గల్ దిట్ట!; జేజేలకేం
జెలిగాల్ దిండ్ల కడిందికేని నెదచేఁ ♦ జేక్కట్లచేఁ జేఁతచే
నలి,నీతీరతఁడం చెనంగదెలియన్ ♦ రానట్టి రారాయఁడా!. 106

టీ—కలిగించేన్=పుట్టించుటకు, నెగడించేన్= పోషించుటకు, అడఁచేన్=సంహరించుటకు, కల్ దిట్టజేజేతెగన్=సమర్థతగల మొనగాండ్రయిన దేవతాసమూహమును, చెలి...కేని=వాయుభక్షకులగు సర్పములరాజునకైన, ఎదచేన్=మనస్సుచేత, చేక్కట్లచేన్=వాక్కులచేత, చేఁతచేన్=కార్యముచేత (త్రికరణములను).

మాలిని॥ అఱితి తెగలయంటా!♦ హాళిరాకాసికంటా।
నెఱిఁగలిగినదంటా!♦ నేలకన్నాకెజంటా!
నెఱపరితలకట్టా!♦ నేలనేల్ రాచేదిట్టా!
కఱజిగి సిరినట్టా! ♦ కల్కిరాలచ్చితిట్టా!. 107

టీ—అతిథి తెగలయంటా!=అర్థిసమూహమునకలికియుండువాఁడా, నెఱి...కట్టా!=శూరాగ్రేసరుఁడా!, కఱి...నట్టా=నీలపుధారాయాసంపదకు నిల్లైనవాఁడా! రాలచ్చి=రాజ్యలక్ష్మి.

—♦ గద్య, తేఁటగీతము ♦—

ఇద్ది యయ్యరాజే నియొడి ♦ యింటి సన్నఁ
దగిన శేషయ్య కందయి ♦ తగినయట్టి
యాంజనేయాఖ్యఁ జెలఁగిన ♦ యతనిచేత
నెసఁగె దాశరథిచరిత్ర ♦ నిది నడికత.

టీ—దాశ...కత = దాశరథిచరిత్రయం దిది రెండవ యా శ్వాసము.





శ్రీ మేధాదక్షిణామూర్తయే నమః.

# అచ్ఛాంధ్ర, నిరోష్ఠ్య, నిర్గద్య,

# దాశరథి చరిత్ర.

## తృతీయాశ్వాసము



క॥ శ్రీకరుఁకసీత డాకడ । నాకడ లచ్చన్న చిక్కె • నట్టిరఘురాఁ గా
శ్రీకరుఁడగా, నంజనకం। దేకడ నిల నేలచౌన • నేలెడివిట్టా! 1

టీ—శ్రీ = లక్ష్మి యొక్క, కరుఁకక్ = (అన్ని గుణములను, సంపదతో సమానమైన) ఘనికతో డాకడక్ = ఎడమ వైపున, ఆకడక్ = అటువెనుకప్రక్కను, లచ్చన్న = లక్ష్మణుఁడు, చిక్కె...రక్ = గిలిన భరతశత్రుఘ్నులు నొప్పచుండఁగా,

క॥ తెలియంగనాఁకిఁచికఁ। గలిగినకత, గాలిదింక్ష్ల • గద్దరిటొకిం
గలిగినజేడదారి, కఁటం దెలిజేడదారినేఁ, యిటఁసి యెఁదెలియంగక్. 2

టీ—గాలి...దారికిక్ = వాయువును, భక్షించెడి పాములక్కిల్లైన పుట్టంబుట్టిన వాల్మీకికి, తెలి...నేఁ = తెల్లనిముని చంద్రుఁడు (నారదుఁడు)

ఉ॥ లంక కతిరింగి కేసరినెలంతకనందగినట్టిఁ డింతయేక్
జెంకక, నేలకన్నెఁగని, • చేత్తలలంగలజెట్టి సంతనక్

లంక, కడంక, లెంకలచేలా, కలదండ్లతెఱంగెఱింగి, లే,
జెంకకతేడ! గెల్పెదిఁకఁ • జాల్తల లాతసి నన్నతేఁడఁటన్. 3

టీ__కేసరి...నట్టఁడు=కేసరిభార్యయంజన, కనగానొప్పినవాఁడు, లెంక...లాకు=భటుల చాకచక్యము, లే=యుద్ధమునకులెమ్ము;

ఉ॥ గాలికిఁజాయరాయనికిఁ • గల్గినదిట్టలఁ, దక్కినట్టి జే
జేలకడింది సంతెనసి • చేరె స౯సరి నేలచేల్కై
చాలఁగ, లంకనేఁగల • జాణ, యెడందఁగలంగి యాయెడం
గాఁలఁగ రచ్చదీరి యనె • రచ్చఁగట్టిరఁ, టాలకించెఁగన్. 4

టీ__గాలికి...దిట్టలన్=వాయువునకు ఛాయాపతికి గల్గినవాను మత్సుగ్రీవుల, తక్కి...సంతున్=నిగిలిన వేలుపులపెద్దయైన బ్రహ్మకొడుకు జాంబవంతు, ఎనసి=కలసి, నేలచేల్కై=భూమికి వస్త్రరూపమైన, సముద్రముకడకు, రచ్చన్=సభయందు, కట్టిరు=కలుగువారు.

—• రావణుని విచారము. •—

సీ॥ చెట్లఁదిఱింగెసి • జెట్టియె దజ్జె గాఁ
దెగికాలిసిరి నీటి • తిట్టఁదాటె
దాటినదేకాక • నేటికేరికిఁ దేరి
కనరాని లంకఁ గా • ల్దవరనాటె
నాటినదేకాక • నాలెంకలఁదఱిఁ
జించిచెండాడి గద్దించిదీటె
దీటినదేకాక • నీరైన నాటెంకి
కాఁగాసగ్గిని • గలయనాటె
తే॥ నాటినదికాక లంకిణి • గీటడంచె
గీటడంచినదేకాక • కేరిచెనియె
లంకియెద్దడియుల్లాయె • లంకరాయ
డీఁగతేడాయె నేదితె • న్నింక నరరె! 5

టీ__ఎద్దు+అజ్జ=ఎద్దడుగు,ఎద్దడియుల్లు=వరిద్రపుకొంప, తెన్ను+ఇంక=ఇకమార్గము.

మ॥ అనఁగా రక్కసితేసి కిట్లనిరి యా • యండంగలారెల్ల, రే
ల! నలంగం గడగండ్లఁజెందఁ దెఱగం • ట్లం గిట్టిగెంటంగ జా

ఠీనశ్రీలచ్చిఁగల్గి దిట్టలయి నీ • లెంకల్ దరిం గ్రాలఁగాఁ
జైవశంగాఁ గలరయ్య? గట్లతెగలం • జెట్లుండఁ దిర్గయ్యలే! 6

టీ—అంగద=కష్టము, శ్రీలచ్చి=భుజసంపద, నీలెంకల్=నీభటులు

క॥ ఏరికిఁదలఁకని యాతనిఁ । జేరికఁచితేగ నిందఱి • జిత్తదర్థంగాఁ
దేరికనఁగలరె నిన్నుఁక । నేరైనకడిందిలంక • నేలెడిజెట్టీ! 7

టీ—తలఁకని=జెడియని, జెట్టీ!=మొనగాఁడా!

—• విభీషణుఁ డన్నచే వంచింపఁబడి, రామునిశరణమొందుట. •—

క॥ అని, దరిరక్కసితెగ, లా । డినవాలించి రహిఁగాంచి • డెందానంజే
క్కనిరక్కసితేఁడలరఁగఁ । గణకంగ్గైకేసిచిన్ని • కం, దిట్లనియెన్. 8

టీ—డెందానన్=మనస్సునందు, క్కైకేసిచిన్నికందు=క్కైకేసిచిన్న కొడుకగు విభీషణుఁడు.

శా॥ అన్నా! నేలనెలంతయంగదల నా • యన్నింటి తేఁడార్చఁగాఁ
గ్రిన్నం జేలర దాటతేని చెలికిం • గందయ్యె, నాలచ్చియే
యెన్నంజానకియయ్యె, నేటికిఁక నీ • యెగ్గెంచకిట్లాడి, రి
చ్చెన్నంట్లియెయ్యడఁ, గానసీతవిడి నీ • చేటార్చి లగ్గందటన్. 9

టీ—నేలనెలంత=భూకాంతయొక్క, అంగదలన్=కష్టములను, అన్నింటితేఁడు = సర్వేశ్వరుడు, చేఁటు+ఆర్చి = కీడుపోఁలఁగఁద్రోసి కొని, లగ్గు+అందు+అఁటన్=మీఁద మేలందు

సీ॥ నెఱెసిగ నెఱేకినై • నెఱక లందనినాఁడె
గిట్టితాటక నట్టె • గీ టడంచెఁ
దనకేలఁ గ్రైసిరి • తనరఁజేరని నాఁడె
నెలదారి సింగాణి • నీటడంచె
సీతకే, లఁటిన • చిన్నియల్ గలనాఁడె
కడిసిన రాదాయ • గండడంచె
నడికాన హజ్జేల • నడర నిడనినాఁడె
సీతనేర్చిన రక్క • సీనిజించె

తే॥ తిగతలలరక్కసీనినిఁ • దెగనడంచెఁ
జెలఁగి, నడికానఁజెల్లెలి • చెన్నడంచె
యట్టిజెగజెట్టియెడ! నీ • యట్టిడేఁడ?
కాన కింబిని దేగంటి • కస్తిఁగంటి.

టీ—నెఱెసిగ=అందమైనజుట్టు, నెఱికిక్=ముడికి, నెఱికలు=వెండ్రుకలు, సీత...యల్=వివాహవిఘ్నములు, రాదాయ=రాజుల విరోధి పరశురాముఁడు.

ఉ॥ ఎక్కటి గాలికం దడరి • యేడ్తెర దండ్లఁగలంచి చించేఁగా
నెక్కడికేగి రీఁడిఁడి • నొక్కటిరక్కసి దిట్టలెల్ల, నీ
కెక్కడ తారసిల్లి రెద • నేర్చెడి టక్కరి నేన్తకాండ్రిహా!
టక్కరికాండ్రఁజేరి చెలిఁ • డాచేక నిచ్చిన లచ్చి నిల్చెడిక్. 11

టీ—ఎదక్+ఏర్చెడి=మనస్సును వేధించెడి, చెలిక్+దాచేక=సీతను మఱుఁగుపఱచేక, దాఁచు=డాచు, దడల కభేదము, లచ్చి=రాజ్యలక్ష్మి, నిల్చెడిక్=నిల్చును.

క॥ ఇన్నియననేల? యిఁకనిల। కన్నియ రాచేనెలకిచ్చి • కొన్కఁగ నతనిం
దిన్నగఁ దెలిపినఁగాచెడి ।। నెన్నఁగ రాకాసిజాతి • కిదిలగ్గన్నక్. 12

టీ—తెలిపినక్=కొలిపిన, రాకాసిజాతికిక్=రాక్షసవంశమునకు

ఉ॥ రక్కసిరాయఁడంతఁ దన • రచ్చఁ గట్టి రడల్నఁగాంచేఁగాఁ
జెక్కినకత్తినెత్తి యనెఁ, • జెచ్చెరఁ గన్నెఱచేసి దాయకై
"తక్కరి! తెక్కలీనికివి • దాళ్ళిడిటెంకిఁ గలారిఁజీరి న"
ట్లక్కడఁ జేరనెంచి తగ • నన్నిఁట నన్నిట సన్నఁజేసెదే?.

టీ—రచ్చ...ట్టిరు=సభనుగలవారు, అడల్నక్=భయముచేత, చెక్కిన=కానెకోశయందుఁ బొడ్డునజెక్కిన, కన్ను+ఎఱక్=కన్నులెఱ్ఱగా తెక్క...జీరి=దొంగకుఁగట్టు తాళ్ళిచ్చి యింటివారిని లేపినట్లు, అక్కడనుక్ = ఆ రాముని గూడబోనెంచి, అన్నిఁటక్ = అన్ని విషయములను. నన్నుక్+ఇటక్+సన్నక్=నన్నిక్కడ కొద్దివానిజేసెదవా?

చ॥ అని తనకంటెఁ జిన్నతని • నయ్యెడ డయ్యగఁ జేయఁ డాయఁగాఁ
గని తన దండ్లరాయఁ డిది • కాదన, నాగిన యన్న కాతఁ డి
ట్లని యొఁగడంక లగ్గఁగ • నయ్యెరి యొగ్గయి యేగె నయ్య! ని
న్ననిఁ దెగనేయ రాచేనెల • యాగిన నచ్చె దిఁకేఁ? నేఁ జిటక్. 14

టీ—డయ్యగక్=నొప్పింపక్, దండ్లరాయడు=సేనాధిపతి, ఆగిన యన్నకుక్=సేనాపతి మాటపై బాధింపకుండ నుండిన రావణునకు, నచ్చెదు=నమ్మెదవు.

మ॥ అనఁగా రక్కసిరాయఁ డగ్గి తనకా • లాదాయఁ దాకంగఁ, దా
చిన నాతం డిలజేరి, తేరి, యెదఁ గా • సింజెంది రాకాసి రా
యని నెగ్గాడి యఁటెంగి తల్లికని యా • య న్నానచే, నేల రా
యని నల్ లెంకలదండనేగి కనిడా • యంజేరి తా నిట్లనెన్. 15

టీ—తాచినన్=తన్నిన, జేరి=పడి, తేరి=తెప్పరిల్లి, అటెంగి=తల్లి కడకేగి, తల్లికని=జనని కావిధమంతయుఁజెప్పి, అన్న+ఆనన్=ఆమె యాజ్ఞచేత, నల్ లెంకల దండన్=నల్గురు భటులతోఁబోయి.

ఉ॥ చక్కని రాచచేంద! యల • చౌలఅదాల్గల తేనికంద! యా
రక్కసితేనికంట! నల • అాఁజెలిజేసిన కాలిదంట! నిం
డక్కటికాలతిట్టు! నుడ • లార్పఁ గలట్టికడిందిదిట్ట! నీ
చేక్కనికాళ్ళఁ జేరితిని • సాకఁగదే! నెనరారఁ గన్నదే! 16

టీ—రాచేచేందు+అ=రాజచంద్ర!, చౌల...కంద! పంక్తిరథుని కొడుకా!, కంట! పగవాఁడా!, నలఅాన్=నల్లనిరాయిని, చెలిన్=స్త్రీగా (అహల్యగా) కాలిదంట=కాలినేర్పుగలవాఁడా! అక్కటికాల తిట్టు!=దయకునికి నైనవాఁడా?

తే॥ రాచరేతేఁడ! రాకాసి • రాచేదిట్టఁ
గాంచి కైకేసి నన్గట్టు • కడనకాంచె
దండియెద నిచ్చుతండనఁ • దగిననన్నుఁ
జెలఁగి నాతఁడ సిరితేని • దెలిచి నతఁడ. 17

టీ—కైకేసి...రాకాసి...గాంచి=రాక్షస రాజేంద్రుఁడైన రావణుగని, నన్=(విభీషణు) నన్ను దండి+ఎదన్=ఎక్కువయిన భయము ఇచ్చు+అతండు=ఇచ్చునట్టివాఁడు, అనఁదగిన నన్నున్=అనునట్టిపేరును అనగా విభీషణుఁడను పేరును, తెలిచి=కొలిచి.

క॥ నేలచెలికన్నెకడి, నీ । కాలికెఱఁగి జాతినెల్లఁ • గాయనడిగినం,
జేలఁగ లగ్గయ్యెడినని గాలందాచె, నిటఁజేరఁ • గా నైతినటన్. 18

టీ—కాలందాచెన్=పాదముచేతఁ దన్నెను, అఁటన్=తరువాత ఇఁట...నైతిన్=నీదగ్గరకు వచ్చితి.

క॥ కాన నిలతేఁడ! యక్కటి । కాన, న్న, న్నార్కి, కెనగఁ • గాచిన నీ ల
గ్గేనాఁ, డదఁదలఁచెద నీ । కీవాఁడే సాయకారి • నే నయ్యెదనన్. 19

టీ—ఇలఱేఁడ!=భూనాథా!, నన్నుఁ + ఆర్కికిన్ + ఎనగన్=నన్ను సుగ్రీవునకు సాటిగ, ఏను=నేను, సాయకారిన్=సహాయకారిని, అయ్యెదన్=అగుదును.

క॥ ఈచాయఁ జిన్నరక్కసి । రాచేనెల యనంగ, నతని • రాకడ, నడకల్
దాపేకియ గాలికందని । రాచేనెల యెఱింగి కాచి • రాయని జేసెన్. 20

టీ—ఈచాయన్=ఈవిధమున, చిన్న...నెల=చిన్నవాఁడగు రాక్షసరాజచంద్రుఁడు, (విభీషణుఁడు) రాకడ, నడకల్=వచ్చినవిధము యోగ్యత, రాచనెల=రాజచంద్రుఁడు (రాముఁడు) రాయనిజేసెన్=లంకాపతిగాఁ జేసెను.

ఉ॥ చేసిన నార్కి తేనిఁ గని • చెచ్చెర డగ్గరి, ఱేఁడ! ని, న్ననిం
డాసిన నెగ్గలేనని కఁనం దనకై చెలినిచ్చి దాయ నిం
డాసిన నేదితెన్నన, నడల్గనకే నగి, లచ్చినన్న, నే
జేసిన, దేగ, దాతఁడిటఁ • జేరిన నావగ రీయనా! యనెన్. 21

టీ—చేసినన్=(రాముఁడు విభీషణుని రావణు ననంతరము లంకకు, రాజును జేయగా) ఆర్కి=సుగ్రీవుఁడు, దాయ=విరోధియైన రావణుండు, నగి=నవ్వి, లచ్చినన్న=రాముడు, చేసినది + ఏగదు+ఆతఁడు+ఇటన్+చేరినన్=నేను చేసిన దానమునకు మారు లేదు. రావణుడు వచ్చిన అయోధ్యనివ్వనా! యనెను.

తే॥ కడఁక సిట్టనియంత, రాకాసితేని
సత్తి, నాతని సంతెంత • సత్తిచేతఁ
జెలఁగినది, చిన్నరాకాసి • చేతనెఱిఁగి
కట్టఁ గడఁగిన జేదలంటెఁ • గడలియడరి. 22

టీ—రాకా...సత్తి=రావణునిశక్తిని, ఆతనిసంతు=వాని సంతానము, ఎంత...నది=ఎంతసామర్థ్యము చేత బ్రకాశించినది? చిన్న...చేతన్=విభీషణుచేత, జేదలు=ఆకాశము.

—* రాముఁడు సముద్రముఁగట్టుట *—

చం॥ చెలఁగి యిటంటఱేఁడలిగి • సింగిణిఁ జిల్కడరించె, నెల్లఱేఁ
డలిఁగిన ఱేనికాల్కెఱఁగి • యల్లఁతఁ డంచెని కాంచి యీరహిం
జెలఁగితి నన్నుఁ రాచెనెల • చిల్కల, జెక్కుఱేనిదాయ, తా
గలఁగిచెనంగనేసి సిరిఁ • గన్నతనిం దగఁగట్టఁగట్టగన్. 23

టీ—ఇటు+అంటన్=ఇట్లాకాశము నంటగా, ఏళ్ళతేఁడు=సరిత్పతి (సముద్రుఁడు) అల్లు+అతఁడు=అల్లుఁడైనవాఁడు, రాచనేల=రాజచంద్రుఁడు (రాముఁడు) జేక్కఱతేనిదాయ=నదీభర్తయైన సముద్రుని విరోధి (దృశ్యగుల్మము) సిరి...తనిన్=లక్ష్మిని గన్నవాఁడు (సముద్రుఁడు)

క॥ చెక్కని గట్టుతెగల నా। రక్కసినేస్తితెఱఁగంటి • రహిఁదినఁగా, నా జేక్కఱతేఁ దెఱిగించినఁ। జేక్కనెఱిఁగి యగ్గికం దెంసంగగ నంతన్.

టీ—రక్కసి=రావణుని యొక్క, నేస్తితెఱఁగంటి=మిత్రమయిన మీనము (తిమింగిలము) జేక్కఱతేఁడు=నదీభర్త, (సముద్రుఁడు) అగ్గికందు=అగ్నికొడుకు (నీలుఁడు)

క॥ చెట్టు జెరలాడంగల। జెట్లుంద, తెసంగఁ దెచ్చి • చేర్చిన తాళ్ళం గట్టు, విడి కడలిఁ, దనసరి। జెట్టగ్గించేంగఁ గట్టఁ • జెలఁగఁగఁ గట్టెన్.

టీ—జెట్టి యేకవచనము, దీనిబహువచనములు, జెట్టులు. జెట్టు, జెట్టుందలు=మొనగాండ్రింత, జెట్లు=మొనగాండ్రు, అగ్గించఁగన్=కొనియాడఁగా, కట్టెన్=కట్టెను.

—* రామాదులు, సముద్రముదాటుట *—

క॥ కట్టి యెఱిఁగించ నిలతేఁ। డట్టె కదలియేగి కడలి• కాదండం,గ్రాల్ గట్టుండనిలచె నెంతే। నెట్టన దండ్లతెగ దెసల • నిండిచెలంగన్. 26

టీ—ఇలతేఁడు= రాముఁడు, కడలికిన్=సముద్రమునకు, ఆదండం...నిలిచెన్= అవతలిగట్టుననున్న సువేలాద్రి దగ్గరగా నుండెను, దండ్లతెగ=సైన్యసమూహము.

చ॥ కడలివిదాటి లంకదరి• గాఁ దనదండ్ల తెగల్ చెలంగఁగా నడరినతేని, జేడ నెఱి • నయ్యెడ లెంకలచే నెఱింగి, య క్కడఁ దనదండ్ల నెలైడలఁ • గాయఁగ నానతి నిచ్చె లంకతేఁ; డలరగ నేలతేఁ డిచేట • నట్లనికిం జేనె, దండ్లసంగఁగన్. 27

టీ—అట్లు+అనికిం=ఆప్రకారము యుద్ధమునకు, దండ్లు,+ఎసంగఁగన్=సైన్యము లుబ్బి చెలరేగఁగా.

—* యుద్ధము - అంగదు రాయబారము. *—

చ॥ అనికిఁ గడంగి దాశరథి • నైంద్రికిఁ గట్టినదిట్టఁ జేరి, యి ట్లనియెఁ, గడింది యక్కటికి • నంగద। రక్కసితేని చెంత, కే

దనిచితి నం, చెటేఁగి యిఁక • నైన నెలంతలదంటఁ దెచ్చి, త
గ్గనిసిరి, జాతినాక్ఛకయ • గాచిన లగ్గని చేటిసే టిలన్. 28

టీ__దాశరథి=దశరథపుత్రుఁడైన రాముఁడు, ఐంద్రికిన్=ఇంద్రునిపుత్రుఁడైన వాలికి, కల్గినదిట్టన్=పుట్టిన మొనగాఁడైన యంగదుని చీరి=పిలిచి, ఏను+అనిచితిన్=నేనుపంపితినని, అఱిఁగి=వెళ్ళి, నెలంతలదంటన్=రమణీమణియైన సీతను, లగ్గు+ఆసి=మేలని.

క॥ కాదన్న దనికిఁ జిత్రి, నె ! ఱా దంటతనాన దరగ • రా యిటకన్నం
గాదనక కదలియాతం డాదట రాకాసిరాయఁ • డడ, రెడ కేగెన్ 29

టీ__నెఱాదంటతనానన్=నిండైన నేర్పుచేత, ఆతండు=ఆయంగదుడు, అడరు+ఎడకున్=ఒప్పియుండుచోటునకు, అనఁగా లంకాపట్టణమునకు, ఏగెన్=వెళ్ళెను.

ఉ॥ ఏఁగిన రాచ లెంకఁ గని • యెక్కటిరక్కసి లెంక లాతనిన్
రేఁగినకిన్కఁ జొల్తలల • జేసి, కడ, న్నిలఁజేయ, నాతఁ డెం
తేఁ గినియంగనైన యెడ • నీ తెఱఁగయ్యది? యేఁడిటంచె? ని
న్నాఁగి, నిలంగనేల యని • యడ్గిన నాయన కైంద్రి కందనెన్. 30

టీ__రాచ లెంక=రాజభటుడు, (అంగదుఁడు) ఆతనిన్=ఆ యంగదుని, ఆతండు=ఆపంక్తిశిరుఁ డగు రావణుఁడు, ఏఁడ+ఇటు+అంచెన్ ఎవ్వఁడిక్కడికిఁ బంపెను? ఆయనకున్=ఆ రావణునకు, ఐంద్రికందు+అనెన్=వాలికొడు కిట్లు పల్కెను.

సీ॥ నిన్ జెంకల, నిడి, నల్ • నీళ్ళతిట్టలఁ దేల్చి,
చెలఁగిన యైంద్రికిఁ • గలిగినాఁడ
నిన్ జెఱనిడిన రా • నెలదాయఁ గలఁచిన
నేలరా లెంకనై • నెగడినాఁడ
నంగదా! లంక, రా • యనిగాంచి, రాయని
యంచిన రయఁ డే • తెంచినాఁడఁ
జలిఁదెచ్చి రాలచ్చిఁ • జెరిచె రక్కసినెల
కటకటాయని కన్రిఁ • గాంచినాఁడ
తే॥ దాతజాతిఁ గలిగి నల్ • కతల్ గఱచితి
లేత తలిదేత చెలిఁజెర • దడయ కిడితి

నిం దెలిసినట్టి యెడ్డెగా ♦ నే నెఱిఁగితి
నేలకన్నియ సీనిదె ♦ ని, న్నడిగితి. 31

టీ___నల్ సీళ్ళతిట్టలు=నాలుగు జలరాసులు, రానెల...లెంక=కార్తవీర్యునికి విరోధియైన పరశురాముని నోడించిన రామునిభటుఁడను తాతజాతి=బ్రహ్మవంశము, తాతతలిజత చెలిక=బ్రహ్మతల్లిలక్ష్మికి జేతయైనకాంత అనగా సీతను.

శా॥ చించెందాటక రాచేదిట్ట ; తెలిజే♦జేతేని సింగాణి గం
డ్రించెం, దారిని రాచేదాయ, తనకం♦టెం దిట్ట లేఁడన్న గా
రించెం, దాసినలేడి గండడఁచె, నా♦ర్క్యం గాయఁగా నైంద్రిఁ ద్రె
ళ్ళించెం, దానిటఁజేరెఁ, జేఁడె విడెదా!♦లే, కాతనిం దాకెదా? 32

టీ—రాచేదిట్ట=రాజధీరుఁడు, (రాముఁడు) తెలి...తేని=తెల్లని వేల్పురాయని (శివుని) యొక్క, దారిని=మిధిలానగరమునుండి యయోధ్యకుఁబోవుమార్గమున, రాచేదాయ= పరశురాముఁడు, ఆర్క్యక= అర్కపుత్రుఁడు సుగ్రీవుఁడు, ఐంద్రిక=ఇంద్రపుత్రుఁడు వాలిని, చేడె=సీత.

తే॥ రిక్కసన్న నెలంత కైం♦ద్రికిని గల్గి
నట్టిఁ డెట్లన రాకాసి ♦ జెట్టి కివ్వ
రేఁగఁగాఁ గని చెట్లని♦రింగెడి, నెఱ
నరికి, నిట్లనె నంగదా! ♦ నత్తిలేక. 33

టీ___రిక్క...తకుక=నక్షత్రసంజ్ఞగల తారకు, చెట్ల...నరికిక=వృక్షచరశూరుఁడగు నంగదునకు, నత్తి=శక్తిశబ్దమునందుఁ బుట్టినది.

శా॥ రా, రేరాయని చేతఁ దండ్రిఁ దెగటా♦రంజేసి, రాలచ్చి నిం
డారంగాఁ, గనిపట్టి యార్క్యకఁ గ♦ట్టా! డాగనై నానలే,
కీరచ్చ్వ, న్నెఱదంట నంచేనిన ని♦న్నె నెట్లనంజాఁలఁ, జి
న్నారీ! తేనిఁ దలంగ నెట్టి యిచేల♦న్నా చెంగట, న్నల్పితేక. 34

టీ—రారేరాయనిచేతక = రాజచంద్రుని చేత, రాలచ్చి=రాజ్యలక్ష్మి, నాన=సిగ్గు, చిన్నారీ!=చిన్నవాఁడా!

క॥ రాలంగఁజేసి యార్క్యని । రాలచ్చిని నీక యిడెద ♦ రహిఁ నేసీ నాఁ
డేల తెలియంగ జాలక । నీలఁగ నయ్యెదన రాచే ♦ నెలలెంకయఁటక.

టీ___రాచే నెలలెంక=రాజచంద్రుఁడైన రాముని భటుఁడు.

క॥ ఏలిన జేజే నిన్నిల । గాలిచి చెడఁజేయఁగాంచె, రా! చెన్నంటీ!
యేలికఁ జేరెద నేటికి చాలిక, నా, కలని కన్న • పసల కతఁడటన్ 36

టీ—ఏలికజేజే=పోషణకర్తయైన విష్ణువు, ఏలిక జేరెదన్ = నా ప్రభువగు రాముని జేరువాఁడ, కలనికిన్ +అన్నన్=యుద్ధమున కనిన.

క॥ రాచేనెల లెంక నడఁచేఁగ! నాచేక, తనదండ్లనంచే • నంతట, నాతం
డేచి తనకాల దండ్లం। దాచి కలంచి యడఁగించి • తానిటఁ జేరెన్ 37

టీ—రాచేనెలలెంక=రాజచంద్రునిభటుడంగదుఁడు, ఆతండు= అంగదుఁడు, తాచి=తన్ని, ఇటన్=రామునికడకు.

—* వానర రాక్షస సంకుల సమరము *—

ఉ. చేరి, కడంక రాచేనెల • చెంగటఁ జేరి, యొఱంగి పేల్తలల్
దారి, కడంక నాతనికి • దాచేక నాడిన, రాయఁడల్కచేఁ
దేరి, కనంగ దండ్లతెగ • తేఁటగ గ్గలకెక్కఁ; జేల్లలల్
దారి, కనంగనాడ, తన • దండ్లడరెం, గలన య్యె నాఁడటన్ 38

టీ—కడంక=పూనిక, కడంక=ధీరత్వము, పేల్తలల్ దారికిన్= అనంగన్=రావణున కనఁగా, ఆడన్=ఆలంకియందు, కలను+అయ్యెన్= యుద్ధమయ్యెను.

క॥ గట్టిజిగిఁ, జెట్లదిరిఁగెడి । జెట్టితెగల్, రక్కసితెగఁ • చెలరేగి జేతల్
కట్టి నెఱసరి తనానం । గట్టి కడంక ననిఁజేయఁ • గా, నా, నేలన్ 39

టీ—గట్టిజిగిన్=దృఢమైన శరీరబలముచేత, లేక ప్రకాశముచేత చెట్ల... తెగల్=వృక్షచరులందు మొనగాండ్రయొక్క సమూహములు, నెఱసరితనానన్=శూరత్వముచేత.

క. ఇది క, న్నిది కా, లిదికే । లిదితలయని తెలియగాక • నెచ్చటఁ గన్నం
జేదిసిన లెంకలకాల్ కేళ్ళదికిన నలయేళ్ళచాళ • నటఁ గననయ్యెన్. 40

టీ—చేదిసిన=చెదిగిపోయిన, లెంక...కేళు + అదికిన=కాలిబంట్ల యొక్క చేతులు కాళ్ళతోఁ గలిసిన, నల, నల్లయొక్క రూపాంతరము, నలయేళ్ళచాళ్లన్=రక్తవాహినుల సమూహమును, అటన్= ఆయుద్ధభూమియందు.

—* ఇంద్రజిత్తు, రామలక్ష్మణుల, నాగపాశబద్ధులఁ జేయుట. *—

ఉ॥ ఆతతిఁ, జేయరా, గడలి • యం, దడఁగం, దెఱగంటిజేని కం,
చేతటినైనఁ గల్లతని • నేడికతత్తడికాని నెన్నితే

జీతెగ నంకలాలతెగ • సింగిణి చిల్కుడిదాల నెల్ల జే
జేతెగ, లెన్ననండి, యసి: • జేయఁగ ం యని దాసె ర తిరిన్. 41

టీ—చాయప =ఛాయాపతి (సూర్యుఁడు), కడలి...గన్= సముద్రమున గ్రుంకగా, తెఱ...కంటు=ఇంద్రజిత్తు, ఏశతి...తనిన్ ఎప్పటికష్టమ గల్గువాఁడైన, ఏడిక+శత్తడికానిన్=గోత్రమే గుత్తి నుగాగలవాసిని (సద్యోజాతుఁడైన అగ్నిని) రాయసిన్=రామునిన్, రాతిరిన్=రాత్రియందు.

చ॥ కదియఁగఁ దాసి, రేసి, తన • గారడి నింగిని నీటిదార్లయం,
దదికి కడింది సింగిణిని • నల్గిడి నారినిలాగి, రాచెదం,
డ్లదరి చేఁగసేసి, యల • యార్కినితేఁడ్రిఁ గలంచియెంచెఁ దా
రిది, జేడికా, రనంగ నెద • నేర్చెడి యిటెనాఁటెనేఁటిలన్. 42

టీ—గారడి=మాయ, నీటిదార్లు=జలధరములు (మేఘములు) ఆర్కిన్=సుగ్రీవుని, తేఁడ్రిన్ = రామలక్ష్మణులను, జేడికారు=వర్షాకాలము.

ఉత్సాహ॥ అంత నేల రయఁ డతని • యఱిది చేతలెల్ల నా
చెంత రక్కసి చెలికాని • చేత నరిగఁ దెలిసి, త
న్నింత గఁచె నం చేడంద • నెసఁగఁ గినిసి కడిఁది చి
ల్కుంత నతని నేయఁ దలఁగి • యద్ది చెనియెఁ గారడిన్. 43

టీ—అఱిది చేతలు=ఆశ్చర్య కార్యములు, రక్కసి చెలికాని చేతన్=రాక్షసుఁడైన స్నేహితుఁడు (విభీషణుడు) కినిసి=కోపించి, అద్ది= ఆబాణము, గారడిన్=మాయచేత.

మత్తకోకిల॥ దాని కింత కలంగి రానెల • దాయనేర్చఁగలట్టిరిం
గానలం జెనలాడె డయ్యలఁ • గాంచి యంటిన,రక్కసీఁ
డా,నెఱా నెఱసర్ల నాదెస • కంచి రానెల లిద్దఱిం
దానె కట్టిడె గాలినానెడి • దంట చిల్కిడి చేయ్యనన్.

టీ—కల+అట్టిరిన్=కలిగినటువంటి వారిని, కాన...డయ్యలన్ వనచరులను (కోతులను) గాలి...చిల్కిడి=నాగబాణము అనగా నాగ పాశమునుంచి, కట్టిడె=కట్టివేసెను.

తో॥ కట్టిడి తా రిలఁ • గంది కదల్కన్
నెట్టిన హాయిని • నిల్చిన నాతం
డట్టె తనంతటి • యాతఁడెటం లే
నట్టె, చేనెం దన • యయ్యఁ గనంగన్. 45

టీ—కట్టు+ఇడి, తారు=వారు-రామలక్ష్మణులు, ఇలన్=భూమిపైన.

---

—• నాగపాశ విమోచనము •—

పంచచామరము.

చేనంగ నంతటం దనంతఁ • జెక్కనయ్య తండ్రి హా
చ్చేనంగఁ జాల్, కడానికిన్నె • రాని తాల్చి, తెల్లనై
చేనంగ నల్దెనల్ జిగి న్ని • జానఁ గ్రాల్ జగానకై
చేనంగ నెంచి నింగిదారిఁ • జారెఁ దాతకం దిలన్. 46

టీ—చెక్కనయ్యతండ్రి=మన్మథునితండ్రి (విష్ణువు) హాచ్చే+ అనన్‌గన్‌చాల్=నీవు కేవలము పరవస్తువువు. నిన్ను బంధించువాఁడుండెనా? యని పల్కుటకు, కడానికిన్నెర=బంగారువీణెను, నిజాన... కై=సత్యలోకమునకు, నింగిదారి=ఆకాశమార్గము, తాతకందు=బ్రహ్మపుత్రుఁడు (నారదుఁడు.)

ఆ॥ జారి చాయతేని • జాతియిత్తిగనేల
చేల నెలనడాని • జికదారి
కాలిజెంట లచ్చి • గద్దియల్ చెంగటఁ
జేరి కైజేతఁ దలఁ • జేర్చి యెఱఁగి. 47

టీ—జారి=ఆకాశమునుండి క్రిందికి దిగివచ్చి, చాయతేనిజాతి=సూర్యవంశము, ఇరు+తిగ=ఇత్తిగ(రెండుమూఁడు, లారు) నేలచేల=సముద్రము (ఆరవసముద్రము=క్షీరజలధి) నెల...దారి=మాసమధ్యదినము నాటి చంద్రుఁడు, లచ్చిగద్దియల్=తామరలు.

## — నారదకృత రామస్తవము —



కమలవిలసితము॥ అదరఁగఁ దిగతెగ • లల తిగ జేజేల్
కడ నడ రతఁడని • కడఁక నసంగా
నడరఁగఁ గలిగిన • యతఁడ! జేగాలం
దడయక యడరిచి • నలిచెడి జేజే. 48

టీ—తిగతెగలు= త్రిమతములు, తిగ...కడన్= బ్రహ్మ విష్ణు రుద్రాదుల కవ్వల.

తోటకము॥ ఇలనేచేఁగలట్టిడి • నెట్టిడినేం
గలఁగం గని రాలిచి • క్రిచ్చెఱ నా
యిలనేచేక నిన్నెద • నెం చేతనిం
గలఁగించేక చేక్కఁగఁ • గాచేతఁడా! 49

టీ—ఏచేన్+కల+అట్టిడి= బాధించేగలవానిని, ఎట్టిడినేన్=ఎటువంటివానినైనను.

స్వాగతము॥ ఎన్నియేం దలల • హెచ్చినతేఁగం
జేన్ని తల్చఁజేన • హె చ్చెఱసీటం
జిన్నెలం గలిగి • చిన్నియతండై
చె న్నెసంగి తట • చెల్లరె! తేఁడా! 50

టీ—ఎన్ని...తేఁడు=లెక్కలేని తలలు కాళ్లు సేతులు గల ప్రభువు (విరాట్టు) సీటం ... తండై=జలమందు వటపత్రశాయియై, చెల్లరె=ఆహా ఆశ్చర్యము.

స్రగ్విణి॥ తాతయైచేసి యం • తం, జెలంగంగ న
ల్లాతఁడై చేసి, హె • చ్చార్చి రాల్చంగఁ, దె
ల్లాతఁడై, యన్నిట • న్హాళిఁ జెన్నారఁ గ్రా
లాతఁడా! యన్నియై • హోయిదేలాతఁడా! 51

టీ—తాత=బ్రహ్మ, నల్ల + అతఁడు=నల్లవాఁడనఁగా విష్ణువు, తెల్లాతఁడు=రుద్రుఁడు, హాళిన్=సంతతము, అన్నియై=సమస్తమునీవేయై

దండకము.

అరిది, సరిది, లేని తేజైన జేజేలజేజే, జగా లెన్నఁగా నేయెడం దాళికం గల్గి నిన్నెన్నగల్ దంటలం గానుఁగా; నేలజేజేల జేజేలఁ గారించి, యీనేల కెగ్గైన కర్జాలఁ జేయంగ నైనట్టెరిం జించి చెండాడి నీకాలిచేరాయఁగాఁ; గల్గె దీనేల నెట్లన్న, నాతాతకన్నంటఁగా, నల్కతల్ తెక్కలిం చేగి సంద్రానఁ డాగంగ నైనట్టి, రాకాసితేనిం దెలింగంటినైయె చెండి యన్నల్కతల్ తాతకీయంగ లేదా? నెఱెందిండికై యల్ల రాకాసిదండంత, జేజేలదండంతఁ, ద్రిచ్చంగనైనట్టి సంద్రాన నాఁడడఁగిన తఱిగట్లరా నట్టె నల్దాసరీఁడై తలందాల్చి యెత్తంగలేదా? యిలం గానఁగారాని కాల్దండ్లరా టెంకియందిడ్డ రాకాసిసిం దెల్లమ్మైదై యణంచేంగలేదా? యెదంగజ్జినేస్తిం దలంచేంగఁ గం దింతయే నాతనిం దల్పరాదన్న రాకాసిరా నెఱసరియయి చించి చెండాడఁగాలేద? యానెఱాచాగకాఁడైన రాకాసిరాఁ గిన్కచేగిట్టకండ్రైయణంగంగ నేర్కిం దనే దాచేలేదా? జగా, జెన్నిగట్టై కయిం, సింగిణిందాల్చి, కన్నయ్యఁ జెండెంగదా యాం చేదం గిన్నిరారాయనిఁగ్రిడిసన్నాతనిం జెండిరాతేండ్రిచేల్ తిగసతెగలార్చి చేలంగ నా నల్లచేఁ దాడ్రి జేజేల తెంకిందగం గా్రిలగల్ చేతలం దీర్పలేదా? యికంజోల్తలల్ గక్కసీఁడేచి జేజేల నేచేంగ నాచెన్నటిం జెండఁ జేల్ తేర్లగా తేని కా్రిల్లంటియం దిచ్చటం గల్గఁగాలేద! నీయట్టి డిల్లైజ్కఁజేరంగ నేలయ్య? నీజేక్కైయైనట్టి కానంగరానట్టి కాల్దిండ్ల రారిక్కరాఁజేరి కాల్ దిండ్లకట్లార్పరాదా? యటం చేడి, జేజేల నెన్నేని తాఁజేసి తండ్రిం గనం దెల్ జేడల్ దారి తానేగఁగా, నేలతేఁ డంతఁ గాల్దిండ్లరాదాయ డొందాన నానం దలంచెం దలంచేం దడాల్నన్. 52

టీ—అరిది=వింత, సరిది=సమానమైనది, తేజు+ఐన=తేజోరూపమైన, జేజేలజేజే=దేవదేవా! నేలజేజేలన్=భూసురులను, ఈనేలకున్+ఎగ్గైన=ఈభూమికి గీడైనలేక అయిష్టమైన, కర్జాలు=కార్యములు, తాత=బ్రహ్మ, కన్నంటన్=నిద్రపట్టఁగా, నల్కతల్=చతుర్వేదములు, తెక్కలించి=దొంగిలించి, సంద్రాన...తేనిం=సముద్రమునదూరిన సోమకాసు

రుని, తెలంగంటి=మత్స్యము, తరిగట్లరా=మందరపర్వతరాజే, నల్దాన రీఁడు=కూర్మము, ఇలం...రాకాసి=భూమిని బాతాళమునకుఁ గొంపో యినహిరణ్యాక్షుని, తెల్లని+ఏదు=శ్వేతవరాహము, కట్టినేస్తికి=అర్జున మిత్రుఁడు (కృష్ణుఁడు) నెఱసరి=నరసింహము, చాగకాఁడైన రాకాసి రాక=దాతయైనట్టి బలిచక్రవర్తిని, గిట్టకందై=పొట్టిబ్రహ్మచారియై జన్నిగట్టు=బ్రాహ్మణుఁడు (పరశురాముఁడు) కన్నయ్య=కన్నతండ్రి జమదగ్ని, క్రీడిసన్నాతనికి=అర్జుననామకుని=(కార్తవీర్యార్జునుని) తిగ సతలెగలు= (3×7=21) ఇరువది యొక్క మార్లు, నల్ల=రక్తము, చాల్త... సీఁడు=రావణుఁడు, చేల్...గంటే=పంక్తిరథుని భార్య, కౌసల్య, ఎఱ్ఱ= ఎఱుకయనఁగాదెల్వి, నీజక్కి=నీగుజ్జము, కానం...జీరి=పాములది నెడి పక్షిరాజచంద్రునిబిలిచి, గాల్దిండ్లకట్లు=నాగపాశములు, జేజేలు= నమస్కారములు, గాల్దిం...దాయ=వాయుభక్షణనేయు పాములవైరి (గరుత్మంతుడు)

ఉ॥ తెక్కల గాలినిల్కచేన•రిక్కలదారిని నీటిదారిచే,
లిక్కల జేలితేలి చన, నెల్లెడలం గలచెట్ల గట్లచే,
లక్కడ లెల్లఁ దల్లడిలి • యయ్యలలం గఱకట్టఁ దాటఁగా
తెక్కలదారిరాచెనెల•తేసికి దగ్గఱఁ జేరెఁ జేరిన౯.

టీ—రిక్కలదారి=నక్షత్రమార్గము, నీటిదారిచేల్=జలధరస మూహము, తెక్క...నెల=పక్షిరాజచందుఁడు-(గరుత్మంతుఁడు)

శా॥ రా,రేరాయల రాచేదండ్ల కనఁగా•రా న్కాలిక, ట్లెల్లర
య్యాృరే! నాగఁ దలంగియేఁగె దెసలే•కానేలఁ దాల్పాతఁడే౯
రారే! యంచేని కాయఁడా? యనిన చెం•దానం దెగల్గాఁ, గనం
గా, రేసాగెడి దిట్టఁ జేరఁజేన ని•క్క ట్లిట్లె రానయ్యెడి౯. 54

టీ—రారేరాయఁ=రాజచంద్రుల (రామలక్ష్మణుల) కనఁ... కట్లు=గూఢపదబంధములు (పాముకట్లు) దెసలేక=దిక్కుగానక, నేలఁ దాల్పాతఁడే౯=భూమిని ధరించిన శేషుఁడైనను, రేసాగెడి=రాత్రులు సంచరించెడు (రక్షసుఁడు) వాఁడు, ఇక్కట్లు=కష్టములు. రాత్రిదిరుగు దొంగనుగూడిన కట్టుబడును.

ఉత్సాహ॥ తెక్కదారి రాయఁడంత • జేనిచెంతఁ జేరి తాఁ
జెక్కఁగా నెఱంగి రాచే • చేక్కనయ్యఁ జెయ్యనం
జెక్కఁదేర్చి యాన నంది • సాగి నింగి నేగె, నా
రక్కసీం డ్రి డఁగ నన్న • రాగఁ జీర నేగె నాఁ. 55

టీ—తెక్కదారి రాయఁడు = పక్షిరాజే(గరుత్మంతుఁడు) ఎఱంగి= నమస్కరించి, రాచేచేక్కనయ్య=రాజమన్మథుండు, అనఁగా రాముఁడు, అన్న=అనూరుఁడు (సూర్యరథసారథి) చీరన్=పిలుచుటను, ఏగె నాన్=వెళ్ళినాఁడో యనునట్లు.

—* సూర్యోదయము *—

ఉత్సాహ॥ అంతలెస్స యత్తితేని•యయ్య కానరయ్యె, నా
యంతతేని ని ట్లలంచె • హాళి లంకరయఁ, డీ
జెంతనార్చి కం దెడంద • సంతసించె నంచె దం
చెంత నీట లేచి చూచి • నట్ల చెలఁగఁ గై తెగల్. 56

టీ—లెస్స...యయ్య=సుగ్రీవుని తండ్రి (సూర్యుఁడు) నాయంతతేనిన్=సూర్యప్రకాశుఁడైన రాముని,కందు=కొడుకైన సుగ్రీవుఁడు, అంచెదన్+అంచున్=పంపెదగాకయని, కై తెగల్ = కరసమూహము (అనఁగా కిరణ సమూహము)

ఉ॥ లంకఁ గలంచేఁగాఁ దిరిగి • ఒగ్గల కెక్కఁగ నేలజేనిదం,
డ్లంకిలి సేయలేక, తన • దైనదరింగల లెంకదంటలన్
జెంకక లంకతేఁ, డనిచి•నం గడతేర్చిరి సారెకింతయే
నంకిలిలేక, రాచేనెల•యండన కల్గిన లెంక లెంతయేన్. 57

టీ—ఒగ్గ...గన్ = చుట్టు ముట్టడించిన, రాచేనెల = రాజచంద్రుఁడు.

క॥ నలయొఱజిగికన్ రక్కసిఁ। గలఁగని రక్కసిని గడిఁది • కాళ్లం గేల్లం
గలరక్కసిదండ్లన్నిఁటి।గలఁయఁగ నేల్ దణిగఁజెంతఁ•గ్రాల్ రక్కసినిన్.

టీ—నల...రక్కసి=ధూమ్రాక్షుఁడు, కల...సిని=అకంపనుని, కడిది...రక్కసి=మహాకాయుఁడు.

మ॥ అసినేలం దణిచంటు దం డ్లడగిన • ట్లంతం దెఱంగంటిరా
యసికం డ్లలి కెంత కేగి యనఁగా • నాలించి రాజేనిఁ దా

నసి .దాంకణ్ నగరెల్లఁజోట, నసిసేఁయం, డాసి రెంతేనిఁ జే
క్కనితేజీ, లఱదాలనెక్కి నలఁదాిఁగం గన్నదిట్టల్ తెగల్.

టీ__అనినేలణ్=యుద్ధభూమియందు, దణిదంట=సేనానాయకుఁడు, దండ్లు=సేనలు, తెఱ...కంట్లు=ఇంద్రవైరులు (రాక్షసులు) ఏలిక=రావణాసురునియొక్క, రాజేనిణ్=రాముని, నల...తెగల్=(నల=నల్లయొక్క రూపము) రక్తపానముసేయు రాక్షసులు.

ఉ॥ డాసిన, లంకతేఁడఁటఁ, గఁడానినగల్ నెజిజీనిచేల, లెం
తే, సిరి గాిలఁదాల్చి, సరి దీఁటిన త త్తడిజేంటఁ గట్టి కై
సేసీనతేరినెక్కి, కయిఁ జే! యని లెంకతెగల్ దెసల్క, రా
జైసిరి గాిలఁగాఁ జేనె, నగార, జేగా, సడిసేయ నన్కినై.

టీ__డాసినణ్ = సైన్యములు యుద్ధసన్నద్ధులై దగ్గరజేరఁగా, లంకతేఁడు=రావణుఁడు, కైసేసిన=అలంకారముసేసిన. కయిణ్=హస్తముతో జే!=జయము, కైసిరి=భుజబలము, నగార=యుద్ధమున కేగునపుడు మ్రోిగించు వాద్యవిశేషము.

క॥ చేని సింగాణిని జిల్కొడి । తన జా న్గండ కరి లాగి తగ్గనికన్కం
గని నాఁటెఁ జిత్తజేల్లన । దనసత్తి సెలంగ రాచేదండ్లయెడదలణ్.

టీ__జాన్గు+అండకుణ్=చెవిదగ్గరకు, అరిణ్=నారిని, చిత్తజేల్లు+అనణ్=చిత్తకార్తెయందలి వానజేల్లోయన్నట్లు, చిత్తశబ్దము సంస్కృతమైనను, చిత్తజేల్లని నామము కనుక తెనుగునవాడపచ్చును. ఎడదలణ్=హృదయములందు.

క॥ నాఁటి కడిందిగరేగం । దీఁటిన నాచాయకం దె దిర్చి కడంకం
దాఁటి కడిఁది గట్టేసెం । గాఁటికిఁ జేరెదని రాచేకం టెద నదరణ్ 62

టీ__చాయకందు=సుగ్రీవుఁడు, సూర్యపుత్రుఁడగుటంజేసి సూర్యునిభార్య ఛాయాదేవి పుత్రుఁడనుటకూడ సాంప్రదాయార్థమైయున్నది, గట్టు=కొండ, రాచేకంటు=రాజైయున రామునివైరి (రావణుఁడు) ఎదణ్=మనమునందు.

క॥ ఇక్కకణి నేయఁగాసా । రక్కసిరాచేనెల, దాని రహిని నడానణ్
పెక్కడఁచి నారసాల న్దక్కని చిల్కేసి యార్కి సత్తినడంచెణ్.

టీ—రక్కసిరాచేనెల=రాక్షసరాజచంద్రుఁడు (రావణుఁడు) నారసాలన్=బాణములచేత, సత్తి=(శక్తిభవము) సామర్థ్యము.

చ॥ అణఁచిన నేలఁజేరె నతఁ; డత్తెలితత్తడికాని కత్తిచే
నణఁగిన గట్లరాయఁ డన; నాయెడ లచ్చన దాయఁ డాఁకఁగా
గణఁక, నతం, డదల్చెనఁట గైసిరి రానెల, యంత దాయ హె
చ్చణఁచేఁగ దాకి కంటెడద నాయెడఁ గ్రిక్కదలంగ నిట్లనెన్.

టీ—అతఁడు=ఆసుగ్రీవుఁడు, తెలితత్తడికాని=తెల్లనిగుఱ్ఱము (ఉచ్చైశ్శ్రవము) గలవాని (ఇంద్రుని) యొక్క, కత్తి=వజ్రాయుధము, గట్లరాయఁడు=కొండలఱేఁడు, రానెల=దాయ=పగవాఁడు, కంటు=పగవాఁడు, ఎదన్=హృదయమునందు,

ఉ॥ తక్కరికాఁడ! యొగ్గడరఁ దారిచి యేగక యంతఁ దాకి తిం
కెక్కడికేగె దీకరణి నేలినతాతయ కాయనెంచినం
జెక్కక యేగనీయ నని సింగిణిఁ జిక్కదరించె, దానినిం
జెక్కియడంచె రాచేనెల చెక్కఁగనెక్కిన గాలికం దెదన్. 65

టీ—తాతయ=తాతయ్య యనఁగా బ్రహ్మను గన్నతండ్రి విష్ణువు రాచ...కందు=లక్ష్మణుఁడెక్కిన హనుమంతుని యొక్క, ఎదన్=ఱొమ్మున.

పంచచామరము

కలంచినంత రాచేదిట్ట గండెసంగ దాయన
ట్లలంచి దిట్టనారసాన నల్లరక్కసీని క
త్తలానిజెంట, డాల్, కడింది దంటసాహిణీని, దే
గ్బలానరాలఁజేసి యంచె రక్కసీండ్రఁ దేగ నాన్. 66

టీ—రాచేదిట్ట=రాజులయందుధీరుఁడు (లక్ష్మణుఁడు) రక్కసీని=రావణుని, కత్తలానిజెంట=గుఱ్ఱములజెంట, సాహిణీని=సారథిని తేరు+చలానన్, రక్క...నాన్=రాక్షసుల దోడితెమ్మని పంపెనోయన్నట్లు.

ఉ॥ అంచిననాతఁ డట్లురిగి యాతనిజెంటన కల్గినట్టిఁడే
చించిన దాయతేండ్రి నని జించెడినంచెని, యొంచి, చీరఁగా
నంచిన లెంకలేగి తన యన్న కడంకన చీరెనం చేతెం
గించినఁ, గంటినెత్తి కన కేచెన రక్కసిదిట్ట, తారఁటన్. 67

టీ—అతఁడు=రావణుఁడు, ఆతని...దే=వానిచేతగాఁబుట్టిన కుంభకర్ణుడే, చించిన...చించెడిక్=శత్రురాజులఁజంపిన, చంపవచ్చునని, చీరెక్=పిల్చెను, తారు=వారు.

—* కుంభకర్ణ యుద్ధము *—

ఉ॥ తిండికి నెంతయే నెఱచి, • తిన్నతఱిం దగద్దైనఁ దీర్పఁగా
దండిగ నల్ల, గిండ్లనిడి • దగ్గరఁజేరిచి హత్తి దండ్ల గై
దండల నల్గఁజేయఁ దన • దండన కంకటి నల్లిగిల్లె నం
చేండల లెంకదం డ్లడల • హా! యని రాయనిదాయ లేచెఁ దాక్. 68

టీ—ఎఱచి=మాంసము, నల్ల=గక్తము, హత్తి= హస్తిశబ్దభవము, కంకటి=మంచేము

తే॥ లేచి కన్నంటసీకయి • ట్లేఁటితి రిది
యేల? యని, లెంకలెఱిఁగించె • నెఱిఁగి తెలిసి,
తిండిఁ దిని, యన్నకడకేగి • తెలిచి నిలిచి
నంతఁ, జేల్తలలగయాళి • యతని కనియె. 69

టీ—చేల్త...యాళి=పంక్తిశిరుఁడగు రావణుఁడు, ఆతనికిక్=ఆకుంభకర్ణునకు, తెలిచి=కొలిచి

క॥ ఘటకర్ణ! రాచెనెల లం!తటఁజేరి కలంచి రెల్ల • దండ్ల నదర, నేఁ
డటకేగిచెండ్రాలిచి!యిటఁజేరఁగదయ్యయన్న • నెఱఁగియతఁడటక్

టీ— ఘటకర్ణ=కుంభకర్ణ, రాచెనెలలు=రాజచంద్రులు (రామలక్ష్మణులు)

చ॥ కదలి, కడిందిజెంగల నంగడ్డలఁ దాఁటి చేనంగ, సత్తియా?
చేదియఁగఁ జేయఁజా ల్తిగదె • సం దగనేలెడి దిట్టయా? యటం
చేవఁ గని యేగి రాతనిని • హెచ్చిలఁ గాంచిన లెంకలెల్ల, తేఁ
దెవఁ గననేల? యం చేనికి • నేడ్తెర తేఁచఁ గలంచి రాతనిక్. 71

టీ—సత్తియా?=శక్తియా?, తిగ...యా?=మూఁడవదిక్కునేలు యముఁడా? ఎదక్=భీతిచేత, ఆతనిక్=ఆకుంభకర్ణుని, కలంచిరి=కల్తబెట్టిరి

ఉ॥ అంతట నైంద్రికం దదరి • యాతనిఁదాకి కడింది గట్టిదం
గ్రింతగఁ గాడనేయఁ, దన • కైఁగల కత్తినదంచె, రాచకం;

టంతట గట్లఁ జెట్లఁ దెగ • నార్కి యడల్ గననేయ రాల్చి,-దం
డంత గనంగ నార్కిఁ దన • యందిడి దాయచేనంగఁ డొంకికెన్. 72

టీ— ఐంద్రి=ఇంద్రుకొడుకు (వాలి) కందు=ఆ వాలికొడు
కంగదుఁడు, రాచేకంటు=రాజవిరోధి, దాయ=శత్రువు (కుంభకర్ణుఁడు)

ఉ॥ ధారిఁ గలంచి రక్కసిని, • దా నిలరాయని జేర నార్కి; నేల్
దారి, యెదిర్చి రక్కసిఁ, గ • లంచి యలంచి కడింది గాలిచి
ల్కేరి, కడంకఁ గేలడఁగ • నేసిన, దగ్గక రక్కసీఁడటం
గేరి కలంగఁ గత్తినిడి • కేల, ననిం జెరిగించె తేఁడటన్. 73

టీ—ఆర్కి=సుగ్రీవుఁడు, తేఁడు=రాముఁడు.

చ॥ అఱనెల నారసానఁ దగ • నాతనినిం దలద్రెళ్ళ నేయ నా
నెఱసరి చిక్కినట్టి కయి • నే, తన లెంకల రాచదండ్ల నం
దఱఁ దనయత్త్రెనింపె, నిల • దారి నెఱింగని, కేళ్లఁ గాళ్ళ నే
డ్తెఱ నిలరాల్చి చెక్కఁడఁ చెఁ • దిన్నని గాల్చెలి నారసాననే.

టీ—అఱ...సానన్ అర్ధచంద్రబాణముచేత, అత్త్రిన్=గొంతు
నందు, గాలి+చెలి=గాల్చెలి...నే=వాయుసఖుఁడైన అగ్నిబాణము
చేతనే

క॥ తనకంటెఁ జిన్నతండి
ట్లణఁగిన జోడఁ దనలెంక • లాడఁగ నాలిం
చి, నలం ద్రాగెడి తెగతేఁ
డణఁగితె యని యతని గలఁచి • యడలి కడంకన్. 75

—• అతికాయాదులవధ. •—

సీ॥ త్రిశిర! నరాంతకా! • త్రిదశాంతకా! యతి
కాయ! యీవచం, డ్లీర • లీయొడఁజేని,
నేలరాయలఁ, జెట్ల • నెఱేఁదిరిఁ గెడి జెట్లఁ
జెక్కాడి రండని • నరగ నంచె
దా రింక నిద్దఱఁ • దగ జేంటగాఁ జేర్చి
తనరారఁగా, నర • దాల నెక్కి,
యని నేల కఱేఁగిన • నాదండ్ల కీదండ్ల
కింతంతయనరాని • యేడ్తె రమ్యొ,

తే॥ తేనిదండ్లంత రాకాసి • తేనిదండ్ల
గట్లచేఁ జెట్లచేఁ జెండి • కడఁకఁ, దక్కి
నాన, గల్గినజేజేల • తేనిచెంత
కంచె నిత్తిగరక్కసీం • డ్రిలిగి కినిసి. 76

టీ—ఈరలు=మీరు, నేలరాయలన్=రామలక్ష్మణులను, ఏడ్తె
ర=యుద్ధము, దక్కినము=దక్షిణశబ్దభవము, దక్కి...చెంతకున్=యము
నికడకు, ఇ+తిగ=ఇత్తిగ=రెండుమూఁడులారు.

క॥ రారాయని దండ్లందఱ
నారాచా, లీఁటెతెగల • నాఁటికలఁచి, గం
డారంగా, నల్లయెదలఁ
గారంగాఁజేసి, చెదరఁ • గాఁ జేయంగన్. 77

టీ—రారాయని=రాజరాజైన రామునియొక్క, నల్ల=రక్తము
ఎదలన్=రొమ్ములనుండి.

తే॥ ఐంద్రికం, దీదకం, దల్ల • యగ్గికం దె
దిర్చి యిత్తిగరాకాసి • దిట్టలెదలఁ
గాడఁగాఁజేసి చెట్లచేఁ • గట్లచేతఁ
గడ కడంచిరి కడిఁది రా•కాసిఁదక్క. 78

టీ—ఐంద్రికందు=ఇంద్రపుత్రుఁడగు వాలికొడుకు కంగదుఁడు,
ఈదకందు=వాయుపుత్రుఁడు, అగ్గికందు=అగ్నికొడుకు నీలుఁడు, ఇత్తిగ=
ఆరు, కడిఁది రాకాసి=అతికాయుఁడు, అనగా నంగదుఁడు, హనుమం
తుఁడు, నీలుఁడు రక్కసులార్గురిలో నతికాయునిఁదక్క మిగిలిన వారి
నడంచిరని తాత్పర్యము.

## —• అతికాయుని నిందాస్తుతి. •—

శా॥ అంతం జిక్కిన రక్కసీఁడలిగి త • న్నం, దేర్చగల్ రాచేదం
డంతం జిక్కక యేగఁగా గలఁచి డా • యంజేరి రాతేని, ని
గ్గంతం దా, ననవెంచితేఁడ! యతికా•యా! యన్న, జేజేలదం
డంతం దాయఁగరాకయేగ నిఁక నీ • వైనట్టి దండ్లేటికిన్. 79

టీ—చిక్కిన...సీఁడు=మిగిలిన యతికాయుఁడు. తేఁడ!=రామా!
(ఓజగత్ప్రభూ)

క॥ నాతిని జెనకితినని నల। తాతినిఁ జెలిఁజేసితినని • రక్కసిరా సం
గాతిని జెండితినని నా। చేతినిఁ జిక్క, కని, తిచేటఁ • జేరి తనకికన్.80

టీ—నాతిని=తాటకను,నలతాతిని=నల్లనిరాయియైనయహల్యను, రక్క...తినిఁ=రాక్షసరాజగు రావణుని చెలికాఁడైన మారీచుని;

క॥ జేడిసి యిలఁ గైకకన్న। ట్టిడి, కిడి; చెలిఁ దాయకిడి, చె • డినడెందానన్
నడికానల నడయాడక। కడిది యెఱచిదిండ్ల, నేల • కదలించి తిఁటన్.81

టీ—కైక...ట్టిడికిన్=భరతునకు, ఇలన్=భూమిని, చెలిన్=సీతను;

ఉత్సాహ॥ తాతకైనఁ గానరాక • దాగి జేడలదార్ల, ని
న్నేతలంచి నతని గస్తి • నిండఁజేసి, జేడలజేఁ
జేతఁ దాల్చఁ జేసి కల్ల • చేతఁ దిరిగి, సన్నయే
జాతియేని లేని దణికి • సన్న చిన్నె కల్గెనే? 82

టీ—తాతకైనన్=బ్రహ్మకైన, కస్తిన్=కష్టమును, కల్లచేతన్ మాయచేత, దణికిన్=ప్రభువునకు, సన్న=పేరు, చిన్నె=మంచిలక్షణము

సీ॥ కడలిని డాగిన; • గట్టుండఁజేరిన,
నిలగాన కణిగిన, • జేడలఁగనినఁ,
దక్కరియై నానఁ • దక్కికైసాచిన,
నేలజేజేలండ • నిలఁగఁ గనినఁ,
గానలఁజేరిన, • కడ కాలఁగాచిన,
నడలి కడింది చె • ట్టం దిరికిన,
జెక్కినెక్కినఁ, గల్కి • చేనయై తిరిగిన,
నేరికి గనరాని • యెడ, నడరిన,
తే॥ నెటిని నాయెద నీయంద • నే నిడియెద
నెర, నిగాచేత నెల్లెడ • నిన్నరసెదఁ
గాన నీయాఁట లిచేట సా • గంగనీయ
నిలఁచియనిజేయఁ గడఁగింక • నేలరాయ! 83

టీ—కడలిని డాగినన్=సముద్రమునదాగినవని నింద, అనగా, మత్స్యమూర్తివైనవని స్తుతి, గట్టు+అండన్+చేరినన్=కొండక్రిందడాగిన నని నింద, కూర్మస్వరూపుడవైన నని స్తుతి, ఇట్లంతట నరయఁదగు.

క॥ అనినంత నేలతేఁ డా। తనియెడలం జేలఁ గినిసి ♦ తక్కరికాఁడా
అనికడలి రిత్తకఱదలఁ। జనకితె యం చూడి కేల♦సింగిణిఁదాల్చెన్ ॥84

టీ—అనికిన్=యుద్ధమునకు, అడలి=భయమంది, రిత్తకఱదలన్=వట్టిమాటలచే.

ఉ॥ లచ్చన యడ్డగించి కయి♦లచ్చి సెలంగఁగఁ గేలిసింగిణి
న్నెచ్చర నారసాల నిడి ♦ నారిని లాగి నిగిడ్చి, దాయయం
దెచ్చిన కిన్కచేఁ గలఁచే, ♦ నెక్కటిరక్కసి నారసాలఁ దా
నెచ్చిలి రాల్చి, చిల్కడర ♦ నేసి, కలంచి, యలంచె లచ్చనన్ ॥85

టీ—లచ్చన=లక్ష్మణుఁడు, కయిలచ్చి=బాహుసంపద, ఎక్కటిరక్కసి=ఒక్కఁడైనయతికాయుఁడు.

పంచచామరము.

అలంచే, దిట్టయైనరాయ ♦ డంతఁదేరి, రక్కసీం
గలంచేఁ జిచ్చర ల్లైడందఁ ♦ గాఁడనేయ, రక్కసీఁ
డలంచ దాని, జింకదారి ♦ యల్లైదిర్చియేయఁగాఁ
గలంచే, నింగి, కేగి, తాఁకి, ♦ కాలి, రాలె, రెండిలన్ ॥ 86

టీ— రాయఁడు=లక్ష్మణుఁడు, రక్కసిన్=రాక్షసుఁడగు నతికాయుని, చిచ్చర + అల్లు=ఆగ్నేయాస్త్రము, జింకదారి=శివుఁడు, ఆయనసంబంధమగు, అల్లు=పాశుపతాస్త్రము.

సుగంధి॥ అంత, రాచేదిట్ట తాత♦య ల్లతం డడంగఁగా
నింత సింగిణిం గదించి ♦ యేయ నద్ది కాల్చిళం
కింతయేనిలేక తాఁక ♦ నీఁటెఁ దాచె రక్కసీఁ
డంత నద్ది యీఁటెఁ గాల్చి ♦ యచ్చెనంటి రాలిచెన్. 87

టీ—రాచేదిట్ట = రాజధీరుండు, (లక్ష్మణుఁడు) తాతయల్లు=బ్రహ్మాస్త్రము.

—♦ ఇంద్రజిత్తు యుద్ధము ♦—

చ॥ అని, తెఱఁగల్ల లెంక లన ♦ నక్కడ రక్కసితేఁ, డెఱింగి, యిం
తని, యనరాని కస్సిఁగన ♦ నక్కట! చేసితె తాత! యంచేడ
ల్గని, తన, సంతెడంద, నిడి ♦ గట్టిగ నేడ్చినః సింద్రజిత్తడ
ల్గని తనతండ్రిఁ దేరిచి జే♦గాజిగిఁ గాల్చిలఁగ నగ్గిఁ దెల్చినన్. 88

టీ—అని తెఱగెల్లన్=యుద్ధ ప్రకారమంతయు, అక్కడన్=లంకలో, రక్కసితేఁడు=రావణుఁడు, తాత=విధి!, తన సంతున్=సంతానమైన అతికాయుని, తేరిచి=ఓదార్చి, అగ్గి=అగ్ని.

సీ॥ ఆయగ్గి జన్నిగ • ట్టల్గియఁ గైదాల్చి
సాహిణికై నేసి • సరస నిడిన
తేరెక్కి, కలనికిఁ • దిన్నఁగాఁజని, చేద
లంటి, రాదండ్ల గం • డంత నడచి
నారసాల్ సింగాణి • నాఁటి నారిని లాగి
తాతకందెద, సత, • దచ్చి; నల్ల
దారిరాకందెద • దాకెరెం; గైదింటి
నైంద్రికందెడద; నై•దార్ల గాలి
తే॥ కందెదం; జాయరాయని • కందెడంద
గిత్తసన్నంగలానెద • గినిసియన్ని
యన్ని, కఱ్ఱకైన నారసా • లలర నాటి
రానెలలఁ దాత చిల్కేసి • రహిసినార్చె. 89

టీ—ఆయగ్గి=ఆయఁగ్ని, జన్నిగట్టు=బ్రహ్మసంబంధమైన, అల్గు=బ్రహ్మాస్త్రము, కలనికిన్=యుద్ధమునకు, చేదలంటి=ఆకాశమునకేగి, రాదండ్ల=రాజసైన్యములను, తాతకందు=జాంబవంతునియొక్క,ఎదన్=ఱొమ్మున, సతదచ్చి=(7×8=56) ఏబదియారు, నల్ల...దెదన్=నీలుని ఱొమ్మున, ఐంద్రికందెడదన్=అంగదుఱొమ్మున, గాలికందు=హనుమంతునియొక్క, చాయ...కందు=సుగ్రీవునియొక్క, గిత్త...నెదన్=వృషభునిరొమ్మునందు.

శా॥ ఈలాఁ గాచెలి దాయజాతినెలలన్ • హెచ్చైచ్చిన దండ్లం, గడల్
చాలంగా నదరంగ నేలనిడి, యా • చాలత్తె రాకాసికం,
దాలానం జెరఁగంగనైన దటఁ, ద • న్నగ్గించేఁగాఁ దండ్రికిం
జాలంగా నని, తెంకిఁజేరె; నిట నిచ్చెం ద త కం దంతటన్॥ 90

టీ—చెలిదాయ=సూర్యునియొక్క, జాతినెలలన్=వంశ చంద్రులను, కడల్=దిక్కులు, చాలత్తె ... కందు=ఇంద్రజిత్తు, ఆలానన్=యుద్ధమందు, తాతకందు=జాంబవంతుఁడు.

చ॥ అలఁతల నార్చఁగాఁ దగిన • యట్టి జేగా యిలదారి, గాలికం
దలయక తేఁగ దాన, నిల • నల్పటఁ జెందిన రాచదండ్ల, రా
నెలజేతఁ దేర్చె; నయ్యెడన • నెట్టన రాయనిఁ జేరి, యార్కి, రా
నెల! యిఁక లంకరాయఁ డని • నేలఁ గనం దెదనేర్చ నంగదల్॥ 91

టీ—ఇలదారి=భూధరము, (సంజీవికొండ) రానెలజేతన్=రామలక్ష్మణులను, ఆర్కి=సుగ్రీవుఁడు, అంగదల్=కష్టములు.

శా॥ కానం, గిత్తిడి లంకఁ గాల్చ నతఁడా • కాలంగనైనట్టి లం
కానం జోలక దండ్ల నిం దవిచి, తాఁనంతంత నేతెం చేనం
గా నం తం, దన దండ్ల తేఁడనిచె, నాఁకాల ర్లఁటం గిత్తిడం
గా నంతం దెగఁగాలె లంక; యడఁగంఁగన్ సన్నకాంద్రా యెడన్ 92

టీ—కిత్తు+ఇడి = నిప్పునుంచి, లంక+ఆనన్+చోలక = లంకను బొందనేరక.

క॥ ఏఁటికి సీతం దెచ్చె ని। కేఁటికి రాజేనిఁ దాఁకె • నేద్దెర నకటా!
నేఁటికి సీతసి దెలిచినఁ। గాఁటికిఁ జేరఁదగెనని సెకంజేచ్చిరఁటన్. 93

టీ—ఏద్దెరన్=యుద్ధమందు, నేఁటికి=ఈ దినమునకు, తెలిచినన్ కొలిచిన.

శా॥ డెందానం గలకేర్చ నంతఁ దనకం • టెం జిన్నరాకాసి సం,
తందానం గని యన్నలార! యనియం • దయ్యాం, దగం, రాల్చి,యం
తం,దానం గడతేరియేగ కిట నిం • డ్లం గాల్చనై, రెల్లరీ
చేందానం, గలఁగించి రండనియనెం, • జోలత్తిరా దాయలన్. 94

టీ—చిన్నరాకాసి సంతున్+అంబానన్+కని = చిన్నవాఁడగు కుంభకర్ణకొడుకులను జెక్కఁగాజోచి,అయ్యన్=మీతండ్రియైన కుంభకర్ణుని, చోలత్తిరా=పంక్తిశిరుఁడగు రాజును.

మ॥ అనినం దా రజదాలనెక్కి, నెఱప • ర్లాలేళ్ళఁ జెక్కాడఁగాఁ
జేనిన ట్లాయిలజేని దండ్ల, నని రాఁల్చం జేరి, రాదండ్ల కి
ట్లని రిక్కావలఁ గాయలేరితిని తిఁన్న ట్లం, దడంగంగ లే
కని, దాయల్ కయిరాలనేల? నకటా! • యాసల్ దెగంగా నిటన్.

టీ—నెఱపర్లు=సింహములు, రాదండ్లన్ = రాజసైన్యములను, అందున్=ఆయడవులలో, అడంగంగలేక=చోవలేక, (అక్కడచావలేక యని విసుగుతోనన్నట్లు) కయిరాలనేల=చేతిలో జచ్చుటెందులకు!

క॥ తన యాలికినై యీరలఁ। దనజేతగా, నడఁచేఁదలఁచెదండ్లారా! ల
చ్ఛనయన,'జేతలేని దిచేఁ।జేనఁ డిలజేఁ'డనెడి సడియొసఁగనిల లేదా?

టీ—లచ్ఛనయన=లక్ష్మణునన్న రాముఁడు, ఆలికినై=భార్యకై, "జేత......జేఁడు" రాచేవాఁడు తోఁకులేక చేవఁబోఁడు, అనెడి సడిణ=అను సామెతయొక్క చెప్పుడు ఇలలేదా=భూమిని లేదా?

సీ॥ చెకచెకజేని యెక్క ♦ సన్ననికఱచెట్ల
గట్లదీటెడి హత్తి ♦ దాట్లెకాని,
యెనఁగన రహినాడి ♦ చెనక జింకలదండ్ల
గాలి నెన్నఁగలతే ♦ జీలకాని,
గరగరఁ దినవెక్కఁ ♦ గల ససి చేల్లట్ల
తిన్ననైన కడాని ♦ తేర్లెకాని,
చెరచెరఁ జేనిదాఁట ♦ నెరనీటి జోల్దార్ల
కడలేని నల్లజే ♦ క్కఱలకాని,
తే॥ రేగి యాలించె తెక్కడా ♦ రితెగ సద్ద
సారె తెంచేలాగిననారి ♦ సద్దెకాని,
కాన నీరేడ? రాకాసి ♦ కల నదేడ
చేక నిల్చెదరెటకైనఁ ♦ జేన్నసన్న॥ 97

టీ—గట్లణ=కొండలను, హత్తిదాట్లె=హస్తి (ఏనుగుల) సమూహములే, ససి=పైరు, నీటిజోల్దార్ల=నీటి కాల్వలు బోవుదారుల, ఈరేడ=మీరెక్కడ? కలను+అది+ఏడ=యుద్ధమెక్కడ? చేక=చేవక, సన్నణ=తిన్నఁగా, చేన్నణ=వెళ్ళిన.

మ॥ అనిలేలెం, డిలజేనిదండ్లతెగ, గం ♦ డారంగ నారంగ, నీ
యని రారా జేదిరించినం జెనర కీ, ♦ రాగంగ రేగంగ, జేం
డ్రి నిగాగా, నెదిరించె, రార! యని దం ♦ డ్లం రేచి తారేచి, నిం
గిని, జేజేల్ గన నీఁటెలం గలఁచి రా ♦ గిట్టల్ నెరాజెట్టలణ॥ 98

టీ—గండు + ఆరంగణ=గండుతన మొప్పునట్లు, ఆరంగణ=నాశనముకాగా, రారాజే=రాజరాజే, (రాముఁడు) ఈరు+ఆగంగణ=మీరడ్డగించేగా, అనిణ=యుద్ధమందు, జేండ్రు=రాజులు, (రామలక్ష్మణులు) రేగంగణ=విజృంభింపఁగా, తారు=వారు, ఆగిట్టల్=ఆచిన్నవాండ్రు.

స్రగ్విణి॥ అయ్యెడం గాలికం • దార్కి యాయిద్దఱం
జెయ్యనం దాకి యే • చేంగఁ జేగట్లచే
డయ్యె గట్లన్ని చెం • డాడ గాఁకంట్లఁ గ
న్నయ్యనే చేర్చిరా • యయ్యలే చెట్లచే॥

టీ__గాలికందు=హనుమంతుఁడు, అర్కి=సుగ్రీవుండు, ఆయిద్దఱన్=ఆకుంభకర్ణ కొడుకులిరువురను, గట్లన్ని=కొండలన్ని, డయ్యెన్=అడంగఁగా, ఆయయ్యలు=ఆ హనుమత్సుగ్రీవులు, రాకంట్లన్=రాజవిరోధులగు నారాక్షసులను, చెట్లచేన్=వృక్షములచేత, కన్నయ్యన్+ఏ=కన్నతండ్రి కుంభకర్ణుని జేరునట్లు.

—* మకరాక్షుని యుద్ధము *—

ఉ॥ అత్తెఱఁగెల్లఁ జోత్తలల • యాతని కాతనిలెంక లాడఁగా,
నత్తఱి నాతఁ డింత యెద • నంగదఁ గాంచి కడంక నీటిరా
తత్తడి కంటి రక్కసిని • దాయల నార్చఁగ నాడి యంచేఁగా,
దత్తడి, హత్తి, లెంకతెగ•దండన రాఁజె నె నాతఁ డన్కినై. 100

టీ—ఎదన్=మనస్సునందు, అంగద=కష్టము, కాంచి=పొంది, నీటి...సిని=అప్పతి (వరుణుని) యొక్క గుఱ్ఱమైన మొసలికన్నులవంటి కన్నులుగల రాక్షసుఁడు, అనఁగా మకరాక్షుఁడు, దాయలన్=శత్రువులైన రామలక్ష్మణాదులను; అన్కిన్+ఐ=యుద్ధమునకై, ఆతఁడు=ఆ మకరాక్షుఁడు.

చ॥ ఛేని, నెఱనారసాలఁ దన • చైఁగల సింగిణిఁజేర్చి, నారిఁగా
గి,నిగిడి తేనిదం డడలి • కేకల తేనిని జేక నేసి, గ్రా
యని దరికేగి, జెంక కనె • నక్కట! రాయఁడ! సన్నకాండ్ర, నాఁ
డణచితి నంచేదం జెలఁగ • కయ్యెది నాదరి సాగిరా దికన్. 101

టీ—తేనిదండు=రాజసైన్యము, అడలి=భయమంది, కేకలన్=కేకలచేత సన్నకాండ్రన్=కొద్దివాండ్రను, నా. దరిన్=నా చెంతను.

సుగంధి॥ డాఁగి యేయ నైద్రినిం, గ•డాని దప్ప యాసనాఁ
డాఁగి యేర్చ లేడినిం, గ•యాళియం చేడంచే ని
న్నాఁగి నట్టి తాటకం, గ•యానకై యెదిర్చి నీ
సాఁగి యేగనీని రాచే • జాతిదాయఁ గా నిదే. 102

టీ—డాఁగి=చెట్టుపాటునఁ బొంచి (వాలిపొందిన, శివుని వరము ప్రకారముగా, నెదుటనిలిచి యుద్ధముఁ జేసిన వానికి సగము బలమీయ వలసివచ్చునని దాఁగి) ఇంద్రినిన్=వాలిని, కడానిది=బంగారు చాయగలది గయాళి=గయ్యాళియొక్క రూపము, కయానకై=కయ్యానకై (యుద్ధమునకై) రాచజాతిదాయ=పరశురాముని, కాను=కాను.

కII అని నిన్నడఁచేఁగ నేతెం। చిన రక్కసి నెఱసరి, నని♦ చెదర కెత్తిగి న
న్ననిఁ గెల్చితేని నెఱసరి। యనియొక నని నారిలాగి ♦ యల్లతఁ డేసెన్.

టీ—రక్కసి నెఱసరిన్=రాక్షసశూరుండని, అల్లు=బాణము.

ఉII ఏసినఁ గిన్ని సింగిణిని ♦ నెక్కటి చిల్కుడి, నారిలాగి, తేఁ
డేసిన రక్కసీఁ డుసు ♦ ఘేటిక చిల్కుడగించి, నారసా
లేసిన గాయఁ డన్నిఁటిని ♦ నెక్కటి చిల్కుడిరాల్చి, చిన్న రా
కాసిని డాసి సాహిణిని ♦ గ్రిచ్చిరపొచ్చుడి దాన రాలిచెన్. 104

టీ—సింగిణి=విల్లు, ఎక్కటి=ఒక్కటి, సాహిణి=రథముతోలువాడు.

ఉII రాలిచి, తేరిడాల్నెర, స♦ గాత్రైగ నేలనరాల్చి, చించితే
జీలఁ, గడింది గాలిచెలి ♦ చిల్కుడరించి యడంచె రక్కసిన్,
రాలక, చెంతకంతఁజేని ♦ రక్కసిలెంక లదెల్లఁ జొత్తలల్
గ్రాలఁగఁదాల్చినాతనికిఁ ♦ గాదన కాడి రెడందఁ గందగన్. 105

టీ—తేరిడాల్=రథముటెక్కెము. గాలిచెలి=వాయుసఖుఁడైన యగ్ని యొక్క, చిల్కు=బాణము, అనగా నాగ్నేయాస్త్రము.

—* ఇంద్రజిత్తువధ *—

కII దరి గనని యాగడల చాలఁటి తింగల యొరచిదిండి ♦ యంతటనెంతే
దెఱఁగంటి తేనిఁ గెలిచిన। నెరజాణం జేరఁజీరి♦ నెటి నిట్లనియెన్. 106

టీ—చాలఁటి...దిండి=సంక్లిశిరుఁడను మాంసభోజి, తెఱ......జాణన్=దేవేంద్రుని గెల్చినమేఘనాథుని, చీరి=పిల్చి.

చII చెక్కనికంప! నిన్నకిఁ ♦ జెయ్యెన నంచెద నన్న నాయెదం
డ, క్కడ రెంగదయ్య!, యని ♦ డక్క సీవినతండ్రి ఘేగఁగా
నక్కట! నే, నెటారసిన, ♦ నంచేక తీర దిఁకేదిచేసె, డా
చెక్కనితేండ్రిఁ గండడఁచి ♦ చేయ్యనఁ జేరగదయ్య టెంకికిన్. 107

టీ—నీచినతండ్రి=నీచిన్నతండ్రియైన కుంభకర్ణుఁడు, లెంకకుఁ = లంకకు.

క॥ అని యెడఁద హత్తి తండ్రీ! యనిఁ గెలిచెద, కేలమోగ్చరా! యనఁగా నా
యన చెఱరని కడఁకం జేయొయ్యనఁ దండ్రి కెఱఁగి దండ్గ • నడరి చియనికిన్.

టీ—ఎడఁదహత్తి=ఱొమ్మున కదుముకొని, ఎఱఁగి=నమస్కరించి.

చ॥ కలఁగని కత్తలానిఁ జేతఁ • గట్టిన, గట్టి కడాని తేరిని,
స్థలఁ గని సింగిణీలఁ, గల • నంగెలియం దగినట్టి నారసాల్,
కలఁచినఁ జన్గకే తనరఁ • గ్రాలెడి యంగిని జేర్చి, తన్నెదం
దలఁచిన యంత సాహిణి త • నర్చిన, తేరి నెక్కె యాదటన్. 10

క॥ తత్తడి తెగ సకిలింతల్, హత్తి తెగల్ కేక, లెల్ల • యఱదాల్పడి, రే
కెత్తి నెఱదండ్ల కేకలు హత్తి, కడల నింగిఁ జాల • నడలఁగఁ జేయన్. 110

టీ—హత్తి=ఏనుగు, (హస్తిశబ్దభవము) హత్తి=కలిసి, కడలు=దిక్కులు.

క॥ తాలిచిన నగఁ జిగి, యడిదాల జిగిం గలిసి నింగి • పరిసి నెఱెనిదాఁ
గ్రాలఁగఁ దెఱఁగంట్లఱగం ట్లెలిఁ జెలఁగంగ నింగి • యఱదాల తెగన్.

టీ—నింగి=ఆకాశము, తెఱగంట్లు = అనిమిషులు, అఱగంట్లు+అయి=సగముకన్నుమూయఁగా, ఇంద్రజిత్తు ధరించిన యాభరణముల కాంతి మిరుమిట్లు రెప్పవ్రాల్పి, నింగి...తెగన్=ఆకాశవిమానములయందు.

క॥ అసికేగడి తన్ననిచే యొయ్యన నటఁగల యట్టిరీతిఁ ద • హల్యనెనసి నా
తనిఁ జీరఁగ, నెలదారిసి జెనకఁ జేసెడి చేకొనయ్య • సిరి జేసెడినన్॥

టీ—అహల్యనెనసినాతనిన్=అహల్యాకాముకుఁడైన యింద్రుని. నెల...సిరిన్=చంద్రధరుఁ గెలువజేను మన్మథు విభవము చేత.

సీ॥ ఇంద్రజిత్తనికి నిం • ట్లేగి యయ్యెల కెన్న,
జాలచెంగటి కాఁటి • నేలకఱఁగి,
యొదిరిఁ జేరఁగనీక • యెల్లకాలరి తెగ
నరగఁ దన్నన్ని దోసలన కాయఁ
దిగతల లఁరంగఁ • దిన్నియ నలంరించి
దానియందగ్గిని • దరియఁ జేసి
యొఱనల్ చేలల • నెఱెఁదాల్చి తలకాయ
నిలచి యోఱచి, నల్ల • నేయి తోడి

గీ॥ కట్టె( గ్గినినిడి "కడకత" నని నల
దారిరాఁదెల్చి యుగ్గించెఁ • దడయకంద
కలిగెఁ గల్లరి స_త్తి జేగా,లడలఁగఁ
గలిగి తనచేతనాతని • నలినడిగిన 113

టీ—అయ్యెలకుఁ=ఆయుద్ధభూమికి, కాఁటినేలకుఁ=ఒలికిమిట్టకు, కాలరితెగ=భటసమూహము, తలకాయఁ నిలచి =తలక్రిందికిబెట్టికాళ్లు పైకుంచి నిలువఁబడి, ఎఱచి=మాంసము, నల్ల=నెత్తురు, కడకతఁ+అని =అధర్వణవేదముఁపఠియుంచి, నల=నల్లరూపాంతరము, నలదారిరాఁ= నల్లనిమార్గముఁగలయగ్నిని (కృష్ణవర్త్మ ప్రభువు) కల్లరిస_త్తి=మాయాశ_క్తి, తనచేతఁ=తనపనిని,

తే॥ ఇాదర్జి, త్తైదసంతసి • ల్చేచి దాని
దనజేతనఁజేర్చి నింగికి • దాఁటి కడిఁది
నేలరాదండ్ల నెవకిన్క•నిండఁ గలఁచె
నారసాల్జడి జేడినీఁటి • దారి, దారి. 114

టీ—ఇంద్రజితు=మేఘనాథుఁడు, దానిఁ=ఆశక్తిని, నారసాల్జడిఁ=బాణవర్షముచేత, జేడినీఁటిదారి=వర్షాకాలమేఘము, దారిఁ= వలె, లేక వరుసగ.

చ॥ కలఁచిన, రాచేదండ్లడరి • గట్లతెగం జెద, లంటనేసి, చే
_త్తలల గమాళికం దెడఁదఁ • దాఁకఁగ నేయఁగలేక, రా, నతం
డల యిలదార్ల నన్నిఁటిని • నామెడ రాలఁగఁజేసి, నారసా
లలరఁగ నాఁటె రాచనెల•లం దలరాయని దండ్లయందఁటఁ. 115

టీ—గట్లతెగఁ = కొండలగుంపును, చేదలంటఁ=ఆకాశము దాఁకఁగా, చే_త్త...కందెడఁదఁ=ఇంద్రజిత్తు ఱొమ్మునందు, అల...నన్నిఁటిఁ + = అభూధరము (కొండ) లన్నిఁటిని, రాచేనెలలందుఁ= రాజచంద్రులందు.

చ॥ సడలక నేలతేఁడతని • స_త్తిని, నాతనిచిన్న తండ్రిచే
నడర నెలింగి, నింగితల • యాతని పిల్చ్రఁడి, దాయస_త్తినిం
గడఁక నడంచే, దాయ యిలఁ • గ్రచ్చుఱ డిగ్గి కెడింది యీానిపం
జెడర నెలంగఁగా నడిచి • చిచ్చరరాయని దండ్లదాసి రాఁ. 116

టీ—నేలతేఁడు=భూభర్తయైన రాముఁడు, అతనిసత్తిన్=ఇంద్రజిత్తు మాయాశక్తిని, అతని చిన్నతండ్రిచేన్=వానిపినతండ్రి విభీషణునిచేత, సింగితలయాతెని=ఆకాశకేశుని (శివుని) యొక్క, చిల్కు=పాశుపతమును, దాయసత్తినిన్=ఇంద్రజిత్తు శక్తిని, డాసి=వగ్గరఁజేరి.

శా॥ సన్నన్ గల్గిన దిట్టలందఱు నెఱా • సత్తిం జెడన్ నారసా
లెన్నన్ నాఁటిన, నంత నాచెనెలదం•డింతంతటాల్ చెట్లచేఁ
దిన్నంగాఁ దననారసాలఁ బంచి యెం•తేనార్చ, రాదాయ, ల
చ్చెన్నం, దండ్లఁగలంచి యీఁటియల నా•ర్చాలం, జెగానత్తిచేన్.

టీ—సన్నన్...దఱు=పేరుగల్గిన ధీరులను,టాల్ చెట్లచేన్=టాళ్ళుచెట్లచేత, రాదాయ = రాజశత్రువు (మేఘనాథుఁడు) జెగానత్తిచేన్=శ్రేష్ఠమైన శక్తిచే.

ఉత్సాహ॥ కాఁటినేల కఱేఁగి, తిరిఁగి • గాలినేస్తకానినిన్
నేఁటలంగఁ దెలిచియగ్గి • నెఱయఁజేయ నల్లడల్
గాఁటియగ్గి యేర్చఁగాంచి • కడఁక నతని చిన్నతం
డ్రేఁటికింక నితనికడఁక • యింతనెగ్గ సీతనిన్. 118

టీ—గాలినేస్తకానినిన్=అగ్నిని, అతని చిన్నతండ్రి=విభీషణుడు, ఇతనికడక=ఈయింద్రజిత్తు ప్రయత్నము, నెగ్గన్=నెరవేరిన.

ఉత్సాహ॥ తాతయేని యనినెదిర్చి.• తాఁకెఁ జోలఁ డన్న, నా
సీతరాయఁ డంతఁ గడిఁది • సింగిణీల నారసాల్
చేతికిచ్చి, వండ్లఁ జెంతఁ • జేర్చి, దాయనార్చి రా
నా, తఱిం, గడంక నంచె • నండఁ గన్న లచ్చనన్. 119

టీ—తాతయేని=బ్రహ్మరైవము, దాయన్=మేఘనాథుని,

—• లక్ష్మణ మేఘనాథుల యుద్ధము •—

చ. అనిచిన నేఁగి రేచేఁ దన • యండనకల్గిన దండ్లఁ, దా రటం
జెని, చినరక్కసీని నెఱ•జన్నియ యగ్గిని నార్చి, దాయదం
డణఁచిన, నాతఁడేఁచి తన•యండన కల్గిన రాచదండ్లయం
దణఁచిన, నాగ కక్కడలి • యగ్గికిఁ దీఁటను క్రొలి సింగిణిన్. 120

టీ—రేచేన్=కవ్వించేఁగా, రారు=వారు, చినరక్కసీని=చిన్న రాక్షసుని (మేఘనాథుని) యొక్క, జన్నియ =యజ్ఞసంబంధమైన, అగ్గిని=అగ్నిని, కడలియగ్గికిన్=బడబాగ్నికి.

క॥ కఱకైన నారసాల । న్నెఱిఁజేరిచి నారిలాగి • నిండారంగాఁ
జెఱకెల్ల హత్తితనకై । నఱకినజేత నఱికె నేల•రాయని దండ్లన్.

టీ—హత్తి=ఏనుఁగు, తనకై =తనతొండముతో, నఱికిన జేతన్=నఱికినకరణి.

క॥ అంతట లచ్చన నెదిరిచి। యంతటఁగాడ నడిదాల • నాయన నేయం
గ్రంతల నలరఁగ రక్కసి।జంత, యెడద, తేఁడ, నార•సాలన్నాఁటెన్॥

టీ—అంతటన్=తరువాత, అంతటగాడన్=శరీరమంతట నాటునట్లు, తేఁడ=ఱ జేగు లక్ష్మణుఁడే, నారసాలన్=బాణములను.

ఉత్సాహ. సారె నారసాలఁ దరక • సొనదీసినది, జేగా
తీ, రెసంగ సింగిణిం గ•దించినది, కడంక నిం
డార నారిలాగినది, త•డాల్న దాయ గుండెదం
జీర నేసినది, తెలియక • సింగిణీల్ కనం దగన్. 123

టీ—సారె=తేపకు, తరకసానన్=అంబుల పొదినుండి, చీరన్=చీకకొని పోవునట్లు.

ఉత్సాహ॥ తేరి కండ్ల కరణిఁగ్రొ్ల • దిట్టలైన తా, రనిం
దేరి కనెడియట్టిరికిఁ గ•దించి కంటి సంతసాల్
చేరి కడిఁదిరిక్కరక్క•సీఁ, డతనికి దాయరై
చేరి కలిగి నతని కరణిఁ • జేసి రనిఁ జెలంగఁగాన్. 124

టీ—తేరికండ్లకరణిన్=రథచక్రములవలె, అట్టిరికిన్=అటువంటివారికి, కంటిసంతసాల్=నేత్రసంతోషమును, రిక్కరక్కసీఁడు=తారకాసురుఁడు, అతనికి=ఆ తారకాసురునకు, దాయరై=విరోధియై, చేరి రుద్రవీర్యము పార్వతియందు జేరఁగా, కలిగినతనిన్=పుట్టిన కుమారస్వామియొక్క, కరణిన్=విధమున, కుమారతారకులవలె లక్ష్మణమేఘనాథులు,

సీ॥ ఇంద్రజి త్తీడచి • ల్కేసిన లచ్చన
తాఁ్రఁచెల్లడర నేసి • దానినార్చెఁ
దాఁ్రచె, ల్లతండేయ • రానెల తెక్కల
నారిరా చిల్కేసి • దానినార్చె,
రాఁకాకి, తిగదెస • ఘాయనిచిల్కేయఁ
జేయరాచిల్కేసి • రాయఁడార్చెఁ

నీటచే రక్కసీం • డిలజేని దాచినఁ
గత్తిచే రాయఁడా • కడఁకనార్చె,
తే॰ నీకరణి నని నాయిద్ద • జేవి చేయ
నంత లచ్చన కిన్కచే • నంది నార
సాలచే, దాయతేరిని • జెక్కడంచి
సింగిణిం జిల్కడరఁజేర్చి • చెలఁగియట్టె

టీ—ఈదచిల్కు=హయాస్త్రము, తాఁచేల్లు=ఉరగాస్త్రము, తెక్క...చిల్కు = గారుడాస్త్రము, తిగ......చిల్కు=వారుణాస్త్రము, చాయ ... చిల్కు = పతంగాస్త్రము, అట్టె=ఆశ్చర్యముగా,

ఉత్సాహ. సీత కడిఁది గరితయైన • సీతరాయఁ డంగదల్
చేతనైనఁ గల్ల ననని • జెట్టియైన నేరి, కీ
చేతి, లగ్గె, యిడెడిదైనఁ • జెనఁటిదాయఁ జీల్చెడిం
గాతఁ, జిల్కటం చెదిరి, ని•గాఁగఁ గాంచియెద నిడెఁ. 126

టీ— గరిత=పతివ్రత, కల్లఁ= అనృతము, అనని=పల్కని, లగ్గె=మేలే, నిగాగఁ = లక్ష్యదృష్టితో, చెనఁటి = చెడ్డవాఁడైన, దాయఁ=మేఘనాథుని.

పంచచామరము.

జగా లడ ల్గనంగ నార•సాని నిల్లిడంగ, నా
జగా, కడింది చిల్కెసంగ • సాఁగియేఁగి, దాయఁ, దా,
నిగా, నడంచి, నేలఁజేరి • నీటనాడి, చేన్న, చో
యగాఁదగంగఁ దర్కసాన • నంతఁజేరె నెంతయేఁ. 127

టీ— జగాల్=లోకములు, జగాకడిందిచిల్కు=శ్రేష్ఠమైన గొప్ప బాణము, తాఁ=తాను, దాయఁ=విరోధిని, నిగాఁ=సూటిగా, నేలఁజేరి=పాతాళగంగనుజేరి, నీటఁ=జలములను, ఆడి=స్నానముచేసి,తర్కసానఁ=అంబుజపాదియందు.

క॥ అచ్చెనఁటిఁ జెక్కడఁచి చేసి। లచ్చన యన్నకడఁ గలని•లాఁగన నాతం
డచ్చిలిన సంతసానన్ । లచ్చెన నగ్గించె; జోల్త • లలతేని కఁటఁ.

టీ—అచ్చెనఁటిఁ=అదుర్నిగ్రహుఁడగు మేఘనాథుని, చెక్కడఁచి =చంపి అన్నకడఁ=రామునిదగ్గర, అఁటఁ=లంకయందు, చోల్తలలతేనికిఁ=రావణునకు.

ఉ॥ రాలక చిక్కినట్టి, రని ♦ రక్కసికం దణఁగారి నంపెనం.
జాలక మొట్టకేల, కన ♦ పాగఁగఁ గందనగాయ చక్కనై
చేల, కడంకఁ గంటికడఁ ♦ జేరిచి యింద్రజిశే చ్చెనంగ, నా
కేలకడింది లచ్చియని? ♦ యేడిచె రక్కసిరాయఁ డెంతయున్. 129

టీ—రాలక=చావక, చిక్కినట్టి=మిగిలిన రాక్షసులు, రక్కసికందు=రావణుపుత్త్రుఁడు, కందనగాయ=గుండెకాయ,

ఆ. అంత నెట్టకేల ♦ కా, చొల్తలలదిట్ట
దిట్టలెల్లఁ దేర్ప ♦ దేరి యెడద
నింత దరిని గనని ♦ యీసేర్చ దనదండ
దండ్లడరఁగ ననికి ♦ దరిసె నంత. 130

టీ—ఈసు=అసూయ, అనికిన్=యుద్ధమునకు, దరిసెన్=దగ్గరియెను.

—♦ రావణు ప్రథమయుద్ధము ♦—

మ॥ నెఱిఁ గై సేసిన తేరినెక్కి యని కే ♦ తే నాతఁ డప్లేగి గ
ద్దఱియై కాఁ రిదండ్లరేచి, యిలరా ♦ దండ్లం గలం చేడ్చచేఁ
గఱకై నట్టి పరాల సింగిణిని జో ♦ క్కం జేర్చి సద్దంతట
స్నైఱయన్నారని లాఁగి యేసి నెఱిగం ♦ డ్రించెంగ సాగెం దగన్ 131

టీ—కై సేసిన=అలంకరించిన, ఇలగాదండ్లన్=రాముని సైన్యమును, గండ్రించెంగన్=ఖండించుటకు. సాగెం దగన్=ఒప్పునట్లు పూనె.

స్రగ్ధర.

చించెం, జేకత్తిచేతఁ ♦ జెదరనెడదలం, ♦ జిద్రులై యేగఁగాఁ, గం
డ్రించెం, జేగాళ్ళఁగిళ్లం ♦ దిగిచి నెఱికలం ♦ డ్రెంచి, తల్కాయలం, ద్రె
ళ్ళించెం జేగట్ల చాల్ రా ♦ లిచె, దఱఁగనకే ♦ లేచితర్లంగఁ, గా
లించెం జేఁగారఁగాఁ నే ♦ లిక నెఱపరిరా ♦ లెంకచాల్ నల్లమొంతేన్.

టీ—ఎడదలన్=ఱొమ్ములను, చిద్రులై=తుంపులై, నెఱికలన్=వెండ్రుకలను, చేగట్లచాల్=చేతుల కొండలను, ఏలిక...నల్ల=రాజసంబంధులైన శూరశ్రేష్ఠులైన భటసమూహముల నెత్తురు, చేగారగాన్=నఱికినప్పుడు చేతినుండి కారుచుండఁగా, గాలించెన్=వెదకెను.

లయగ్రాహి.

అక్కడిదిచేతులల ◆ రక్కసి గయాళి, నెఱ ◆ రక్కసితనాననెవ న ◆ క్క-
టిక లేకే । చక్కడచె, నీకరణి, ◆ లెక్కనిడరాకజగి ◆ ద్కక్కఁదెగగానయి
న ◆ తెక్కతెగచేతం । జిక్కక చేసంగఁ గని ◆ తెక్కలియట్లం చేడరి ◆
చెక్క, నలగారఁగల ◆ డెక్కయిన కాళ్యం । దక్కనియ, కేఁచె, నిల ◆
చెక్కతెగతేనిదెస ◆ కెక్కనయి, రేలికయ ◆ దిక్కనఁగ లెంకల్. 183

టీ—రక్కసితనానన్ = రాక్షస కృత్యముచేత, అక్కటిక = దయ, తెక్కలి = దొంగ, ఇల...దెసకున్ = భూమండల భర్తదగ్గరకు.

మ॥ తనదం, డ్లి, ట్లడలంగ రాచెనెల యం ◆ తం గాలికం డైంద్రికం ·
దొలేవట్టి కడిందిగట్లఁగయి నెం ◆ తేఁదాల్పనై, రాగ, ల
చ్చిన సింగాణిని దాల్చిరాగ; గడఁగెం ◆ జోలత్తి రాకాసిదం
డ్ల, నడంగించేఁగ, హత్తి, జెక్కు, దణి, తేంర్లం, జెక్కు, చెక్కాడఁగాన్.

టీ—తనదండ్లు=తనసైన్యము, ఇట్లడలంగన్ = ఈవిధిభీతిల్లగా, రానెఁ=రాజచంద్రుఁడు (రాముఁడు) గాలికందు=హనుమంతుఁడు, ఐం ద్రికందు=వాలికొడు కంగదుఁడు, జెక్కు=గుట్టముల యొక్క.

స్రగ్ధర.

చెండించెం గత్తిఁగేళ్యం ◆ జెదరఁగ నడఁగిం ◆ చెం దలల్నారసాలన్
నిండించెం, గండనల్లల్ ◆ నెఱకల జెడిగా ◆ నెట్టనం, గారఁగాఁ గీ
ల్లం, డించెం గట్టియాఁటె ◆ ల్కఱకఱనెఱక ◆ ల్గాడఁగాఁ గిట్టయాఁటె
ల్పిండించెం గండనల్ల ◆ న్నెఱి, నిలఁదినఁగ ◆ న్దెక్కదార్లెల్లనాపన్.

టీ—నల్లల్=నెత్తురులు, నెఱకలు=వొడ్రికలు, తెక్కదార్లు=పక్షులు, గిట్టయాఁటెల్=కుఱచయాఁటెలను.

చ॥ ఆపటఁ జేతులలల్గల గ ◆ యాళి నెదిర్చి సరాల్పన ద్రైస
ల్నాదిన, గాడనేసి తెగ ◆ నార్చి కలంచి యలంచి చించేఁగా,
నాదన, రక్కసీఁ డడరి ◆ యయ్యిలరా యడిదాలఁ, రాల్చి, యెం
తే, దిగ, నారసాలనెదఁ ◆ దేఁటగ నాఁటి కలంచె నంతటన్. 186

టీ—చేదల్=ఆకాశము, దెసల్ = దిక్కులు, నాదు+ఇడఁగాఁ= శబ్దమీయఁగా, ఇలరా=భూపతియైన రాముఁడు, దిగన్=నాఁటగ.

శా॥ రారాయం డడిదాలఁ, జాల, నిడఁగా, రాకాసి రారాల్చెఁ; న
ట్టారా కాసి నగాల గాడ, నిసఁగా నాతేఁ డడంగించె, న
ట్టారాయం డలరక్కసీఁ డసిని జేయన్ సాగి రేఁడైన జే
జేరా, రక్కసిరాయలట్ల, యలజేజేలెల్ల రగ్గించఁగాన్. 137

టీ— రారాయండు = రాజరాజైన రాముఁడును, రాకాసిరా = రాక్షసరాజైన రావణుఁడును, ఏదు+ఐనజేజేరా = శ్వేతవరాహమైనదేవశ్రేష్ఠుఁడు (విష్ణువు) రక్కసిరాయలు = రాక్షసరాజైన హిరణ్యాక్షుఁడు, అగ్గించఁగాన్ = స్తోత్రముచేయఁగా.

ఉ॥ ఇట్టనిఁ జేయఁజేయ, నల యొక్కటి రక్కసి కల్లసత్తినిం
జెట్టన జేనియం, దిడినఁ జాలదాల్గలజేనికం, దెదం
గిట్టి, కడింది తేజెడరఁ గిత్తడిదాన, నడంచె దాసి; నా
జెట్టిని నడ్డగించి యనిఁ జేయఁగ వచ్చిన తాఁకె రక్కసిన్. 138

టీ— ఇట్టు+అనిన్ = ఈప్రకారము యుద్ధమున, కల్లసత్తినిన్ = మాయాశక్తిని, చాలదాల్గలజేనికందు = పఙ్క్తిరథునికొమారుఁడైన రామునియొక్క, ఎరన్ = ఎఱ్ఱనైన, కిత్తు = అగ్నిసంబంధమైన, అడిదానన్ = బాణముచేత.

— లక్ష్మణునిమూర్ఛ. —

ఉ॥ తాఁకఁగ రాచెదాయ, యడిదా లదరించిన రాల్చి, నారసాల్
దాఁకఁగనేసి రక్కసి, కతం డట సాహిణిజెక్కుజెంటనేల్
దేఁకఁగరాల్చి, డాలడఁచి తేరి నడంచినఁ గిన్కరక్కసీఁ
డాకడఁ దేరిఁడిగ్గి, చెయి యందలి కత్తి నదల్చి వచ్చెనన్. 139

టీ— రాచెదాయ = రాజశత్రువగు రావణుఁడు, సాహిణిన్ = రథముతోలువానిని, జెక్కుజెంటన్ = గుఱ్ఱముల రెంటిని, నేల్ దేఁకగన్ = నేలరాయఁగా, డిగ్గి = దిగి.

ఉ॥ రెచ్చిల దాఁక లచ్చన దరిం జిగిచేఁ దనకంటెఁ జిన్నతం
డెచ్చిల నిల్చి చిల్కుడఁగ నెక్కటిరక్కసిరాయఁ డల్కచేఁ
గ్రొవ్వెర నాలినిం గవిన రక్కసి యిచ్చిన సత్తి నేయఁగాఁ
జెచ్చెరఁ జిన్నరక్కసిని జించి కలంచఁగ నద్ది డాయఁగాన్. 140

టీ— రెచ్చిలన్ = హెచ్చునుగాంచెగా, లచ్చనదరిన్ = లక్ష్మణు దగ్గర, తనకంటెఁ జిన్నతండు = తనకంటె చిన్నవాఁడగు విభీషణుఁడు,

అలివిన్=భార్యయైన మండోదరిని, కవినరక్కసి= పిన్న రాక్షసుఁడగు మయుఁడు, ఇచ్చినసత్తిన్=ఇచ్చిన శక్తితో, చిన్నరక్కసిన్=విభీషణుని.

ఉత్సాహ॥ అన్న చేతఁ గాయనైన • యట్టిడిచేట నన్న కై
యన్న చేతఁ జేచ్చెడి నని • యంతఁ జిన్న రాచ తేఁ.
డన్నతని నడ్డగించి • యెదిరిసత్తి తాఁకఁగాఁ
గ్రిన్ననతని నేలఁ జొరఁగఁ జేరిగించె నద్దితాన్. 141

టీ__అన్న......యట్టిఁడు=రాముని చేత రక్షింపఁబడిన విభీషణుఁడు, అన్న కై=రామునికొఱకు, అన్న చేతఁ=వానిసోదరుఁడగు రావణు చేత, చిన్నరాచ తేఁడు=చిన్న వాఁడగు లక్ష్మణుఁడు, అద్ది=ఆశక్తి, అతనిన్=లక్ష్మణుని.

క॥ లచ్చన్న నేలజొరినఁ।గ్రచ్చెర, నాలచ్చెవన్నఁ • గారించెంగా
నచ్చెన్నఁటి రక్కసితే ;।డెచ్చినకిన్కనల నేల•యేలిక యంతన్.

టీ__లచ్చన్న=లక్ష్మణుఁడు, లచ్చెవన్న=లక్ష్మణాగ్రజుఁడు (రాముఁడు) నేలతేఁడు=రాముఁడు.

మ॥ కలుకైనట్టి సరాల సింగిణిని జోక్కంజేర్చి చేఁటిత్తిరాన్
నెఱకల్ గాడఁగనేయ, నాయనతల•ల్నిండన్ సరా, ల్వాళలే
కతిగెంజెచ్చెర లంకకాతఁ; డిటఁతేఁ • డాలచ్చెవంజేరి చె
న్నటినాకై యిలజొనవయ్యెఁగద కట్టా? తండ్రి! యంచేడిచెన్.

టీ__చేఁటితాన్=పంక్తికంఠుఁడను ప్రభువును, నెఱకల్గాడఁగన్=పోదుగ్రకలుదూరగా, అతఁడు=రావణాసురుఁడు, లంకరున్, అటిగెన్=వెళ్లెను, తేఁడు=రాముఁడు, తండ్రి! నాయనా!.

—* రాముని విచారము. *—

ఉ॥ రాయని, దండఁజేరియన • రాయని, చేక్కని రాచజాతిరే
రాయని, దాయ యెట్లడఁచె • రాయని, దాయనడంచేలేచిరా
రాయని, తల్లికెట్లనెద • రాయని, నా, రతనాలతిట్టకా?
రాయని, దాయనేచేఁగల • రాయని, యెంతటికస్తి రాయనేన్. 144

టీ__రాచేజాతిరేరా,=రాజవంశచంద్రా! అని, కస్తి=కష్టము.

ఉ॥ డాయనిదేల? చేలివతఁ • డా!యని, తిన్నని చిన్ని నేలతేఁ
డాయని, నన్నెతెల్చినతఁ•డా!యని, నన్గనకేగ కంద కాఁ

డా!యని, కన్నడించె నగ•డా!యని, నాజేత రాచేరిక్కతే
డా!యని, యన్న కాంచేఁ దగ•డా!యని, యెక్కటిరాయఁడాయనెఁ.

టీ__చాలినతఁడా!=సమర్థుఁడా? రాచేరిక్కతేఁడా=రాజచంద్రా! ఎక్కటి=ఒక్కఁడయిన.

ఆ॥ కన్న తండ్రి యడఁగఁ • గస్తిఁ గానలఁడాఁగ
గతితలఁగియేగెఁ • గడ కిటనిల
నిట్టికిస్త్రిచేరె • నెట్టన నక్కటా!
యిజ్జెగాలతేని • నేది యనెడ. 146

చ॥ అనియడలంగ, దాశరథి • నయ్యెడ డగ్గరి తారతండ్రి తీ
రనియడలార్చి, తేర్చి, తన•రారఁగ గాలికిఁగ్గినట్టిడిం
గని; యలఁతల్ తలంగ నిడఁ • గ్గిన గ ట్టిటఁదెచ్చి, చిన్నరా
యని, యలతం దలంగ నల•రారఁగ నెట్టిక నాంజనేయ!నాఁ. 147

టీ__తారతండ్రి=తారయొక్క పెంపుడు తండ్రియైన సుషేణుఁడు, అలతల్=ఆయాసములు, తలంగఁ=తొలగగా, ఇడఁగల్గిన=పెట్టఁజాలిన, గట్టు=కొండ, (సంజీవిని పర్వతము) నాఁ=అనగా.

శా॥ అంతం, గేసరికం దిదే చేసెద న•య్యా! దానికెసల్పితం
చేంతేఁ, దిట్టతనాన నేగె; నీట, నీ•యిక్కట్ల నగ్లేలికం
జెంతం, గానఁగలేక యేగెననఁగా • జేజేలకం ట్లెన్నగా,
నంతం, జాయనెలంతరా, కడలియం • దంతంత జారెందగఁ. 148

టీ__కేసరికందు=కేసరియను వానరునికొడుకు హనుమంతుఁడు ఇక్కట్లు=కష్టములు, జేజేలకంట్లు=సురవైరులు (రాక్షసులు) చాయనెలంతరా=ఛాయాకాంతాభర్త (సూర్యుఁడు).

ఉత్సాహ॥ అక్కడింది చొత్తల ల్గ•యాలి, యాన నాయెడం
దక్కరీని చేతలెల్లఁ • దనయెడం దగం జేడల్
పెక్కఁదాల్చినిల్చినట్టి • సన్నకాని, గాలికం
డక్కరణిని నేగిదారి • నలగఁ గాంచ నెంతయేఁ. 149

టీ__కడింది=గొప్పవాఁడు, చొల్లలల్గయాలీ=వరుసతలలు గల ధూర్తుఁడు (రావణుఁడు), సన్నకానిఁ=కొంచెపువానిని (కాలనేమి యనువానిని)

సీ॥ కని, దారిఁ దలఁగితి • నని యెంచి, యల, జేడ
దారిరాయని చేత • దారిఁ దెలిసి
చేనిఁ గెడ, నని యాత • నిని, జేరి, తన తెఱఁ
గతని కెఱింగించి • యతని చేత
దగ నడంచెడి నీటఁ • దగినట్టి నీటిన,
ట్టెఱిఁగి నీరానఁగా • నేగిదానఁ
దన్నెదిర్చిన తాఁకిటిఁ • దాల్చిన రాజెక్క
జెక్కాడి దానిచే • జేడలదారి
తే॥ తెఱఁగెఱింగి దాయం దాకఁ • దెలిసి యాతఁ
డట్టె తెక్కలదారిగా • నంజన కఁట
గలిగినట్టి డడరి దానిఁ • గండడంచె
నయ్యెడల నదినెఱసరి • నైయెదిర్చె. 150

టీ—దగ=దప్పిక, నీటఁదగినట్టి=నీటిచే నొప్పినట్టి, నీటినట్టు=జలాశయము (కొలను), తాఁకిటిఁదాల్చిన, రా=పాశధరుఁడైన ప్రభువు (వరుణుఁడు) జెక్క=వానిగుఱ్ఱము (మొసలి) దాయన్=పగతుని, తెక్కలదారి=పక్షి, నెఱసరి=సింహము.

పంచచామరము.

ఎదిర్చినంత రాచెలెంక • యేఁచియార్చి దానిఁ గై
వదల్చి తాఁచి నేలరాయ • నార్క్కయై చెలంగి, యం
చేఁదల్చినట్టి చేతయాగెఁ, • జెక్క నల్తతీరఁగాఁ
గదల్చెలంగెఁ జిన్నరాచె • కం; దికేల? గట్టిదే. 151

టీ—రాచెలెంక=హనుమంతుఁడు, కైవదల్చి=చేతితో వదలించి తాఁచి=తన్ని, నేలన్=భూమినిబడవైచి, రాయన్=రాచి నలుపఁగా, ఆర్క్కయై=(అర్కసుతుడు) సుగ్రీవుని వేషమూని, అంచ..యాగెన్=పంపఁదలంచిన కార్యమాగిపోయినది, చిన్నరాచెకందు = లక్ష్మణకుమారుఁడు, అల్తతీరఁగాన్=ఆయాసము తీరిపోఁగా, కదల్చెలంగెన్ = కదలి ప్రకాశించెను.

ఉత్సాహ॥ కడిఁది రాచెడిట్టి నిండ • గంగఁ జేరెనన్న; చా
కడిఁది రాచె లెంక కలఁగి • కల్లకక్కసీని గా

ర, డిది, యంచెఱింగి యతని • రాల్చె నెట్టకేల, కా
కడిఁదిచెట్ల, గట్లహత్తి • కణితి నణఁచి నట్లనిక్. 152

టీ—కడిఁది రాచేదిట్ట=గొప్పవాఁడైన రాజధీరుడు (రాముడు), గారడి+ఇద్ది+అంచుక్+ఎఱింగి ఇదిమాయయని తెలిసి, హత్తి=హస్తి, కణిలి=కణితి మెకము.

ఉ॥ రాలిచి, చేగకానిదెసఁ • గ్రిచ్చేరఁజేరి, కడింది యల్లతెల్
గాలిచి, తేర్పఁగాఁ దగిన • గట్టలరంగని, యల్లలార్పఁగా
జాలిన తీఁగలం దరసి • చేకృఁగఁ గాంచఁగలేక గట్లరాఁ
దేలికజేతఁ దాల్చియట • దిట్టలెదిర్చిన రాల్చి కైసిరిక్. 153

టీ—చేగకానిదెసక్=త్యాగశీలుఁడైన కుబేరునిదిక్కును, అల్లతెల్గాలిచి=బాధలను తెల్లును కాల్చి, తేర్ప......గట్టు=హాయి నీయఁగల కొండను (ద్రోణాద్రిని), అల్ల......తీఁగలక్=సంజీవికరణి సమూహములను, కైసిరి=బాహుసంపద.

ఉ॥ రానెలఁ జేరఁగాఁ దలఁచి • రా, నడిదారిని దాకి నట్టిరిక్
గైసెఱి లచ్చిగద్దియల • కాడల నేనిక గిల్లి నట్లనిక్
దా, నడఁగించి, రాచెనెల • దగ్గఱ జేరఁగ నల్లలార్పఁగల్
జా, నయినట్టి తీఁగజిగి • జానకిఱేఁ డఁటఁగాంచి నెట్టనక్.

టీ—తాకినట్టిరిక్=ఎదిరించినవారిని, ఏనిక=ఏనుఁగు, లచ్చి... దల=లక్ష్మీనివాసపీఠములగు తామరపూలక్రింది కాడలను, జానకిఱేఁడు=జానకియొక్క భర్త, తీఁగజిగిక్=సంజీవకరణి కాంతిని.

సుగంధి॥ చాయరాయఁ డం చేడల్చఁ • జైఁ గదించి సింగిణిక్
దాయ నేగి తార తండ్రి • దాశరథికి దానిలాఁ
గియ దం చేనంగ, నంత • హెచ్చిలంగ గాలికం
దాయనం దడాల్చఁజేరె • నందతెన్నఁ దన్నఁటక్. 155

టీ—చాయరాయఁడు=ఛాయాభర్త (సూర్యుఁడు) తారతండ్రి=సుషేణుఁడు, ఈయది+అంచుక్+అనంగక్=ఈలాటిదనిపల్కఁగా, గాలికందు=హనుమంతుఁడు.

ఉత్సాహ॥ నేర నంత నల్ల లారి • చెడి కడింది తీఁగచేఁ
దారతండ్రి చిన్నతేని • దనరఁ దేర్చి, నంత గ...

.. ట్టారఁదెచ్చినట్టి యెడన• యల్ల గాలికం దిడెం,
దారలసట లారఁదీర్చి • తారసిల్లి రవి కఁటక. 156

టీ—అల్ల......తీఁగచేక=బాధల నివారణఁజేయు సంజీవకరణి చేత ఉన్న తేనిక=లక్ష్మణుని, తెచ్చినట్టియెడక=తెచ్చినచోఁటు.

మత్తకోకిల॥ తారసిల్లిన లంకరాయఁ, డె • దం దలంకి, కలంగి, చె
న్నార నల్కఁతలిచ్చి నట్టిడి • నయ్యగారిని జేరి, తీ
రాగఁదెల్పి కడిందిదాయల • నార్చఁగాఁ దగినట్టి కీ
లార నడ్గిన నాతఁ డిట్లనె • నల్ల రక్కసిఱేనికిక. 157

టీ—లంకరాయఁడు=రావణుఁడు, నల్కఁత...గారిని = నాలుగు వేదములిచ్చిన గురువగు శుక్రుని, కీలు = ఉపాయము, ఆతఁడు = ఆ శుక్రుఁడు.

ఉ॥ రక్కసిరాయ! గట్టియెద • కాఁ్రలఁగఁ దాలికచేతనిల్చి నే
నక్కరచేత నీకవిన • యట్లల యేడికజక్కిరాయనిం
జెక్కఁగఁదెల్పి, తీరయిన • జన్నియ సాగఁగఁజేసి తేని ని,
న్నెక్కలనక నెలందలఁగ • లాతఁడయేని యెదిర్చిరాఁ డికక. 158

టీ—తాళికచేతక = మనసు నిలుకడ చేత, ఏడికజక్కిరాయనిక మేషవాహనుని (అగ్నిని) జన్ని య=యజ్ఞము, నెల...యేసి=శంకరుఁడేని.

—* రావణుని పాతాళహోమము. *—

తోటకము॥ అనియత్తెఱ గాతని • కాడి కడం
క, నిటంచినఁ జొల్తల • కాయలఱేఁ
డనలేని నెఱెంగని • యేగి, తగం
దనరారఁగ నా, సత • నాల్కలరా. 159

టీ—చొల్తలక యలఱేఁడు=పంక్తిశిరుఁడు, సతనాల్కలరా=సప్తజిహ్వుఁడు (అగ్ని).

తరల॥ కలిగి నట్టెడ కట్టె యేగిజే • గా నెతొ యెఱదండలం
గలికె యెఱ్ఱనిచేలలం దగఁ • గాఁ్రలఁదాలిచి తిన్న యం
పలికె తిన్నని జిడికట్టెల • నగ్గిఁకేర్చి, రగిల్చి, నే
చిలికి జి, డ్డెఱవల్ల, నె, త్తెఱ•గా, దనళ్ళఁ గడిందికక. 160

టీ—నేచిలికిజిడ్డెఱవల్లె... జిడ్డు=పాలు, ఎఱవల్లె=ఎఱవిరెత్తము ... రెండు కలు, ఎఱచికి=మాంసపుముసు, తనళ్ళక=నెత్తెలను.

సుగంధి॥ తెక్కదార్ల లేళ్లఁ, దేళ్ల, • రెచ్చిలంగ నేసి, యం,
డక్క డింది నల్లదారి • యయ్య కిన్న; నత్తఱిం
జెక్క, రాచేదిట్టఁగాంచి • సారె చిన్నరక్కసీఁ
డక్కటా! కడింది జన్నె • నన్న చేసె నద్దియేఁ. 161

టీ—నల్లదారియయ్య=కృష్ణవర్త్ముఁడు (అగ్ని) చిన్నరక్కసీఁడు=విభీషణుఁడు, రాచేదిట్టఁ=రామునిని, జన్నె=యజ్ఞము.

ఉత్సాహ॥ చెడక నెగ్గనేని యతని • జింకదారియే ననిం
గడఁకఁ దాఁక లేఁడటన్నఁ • గన్న నతని జన్నియం
జెడ, నడంచె లెంక తెగలఁ • జీరి రాయఁ డంచె దా
రడర, లంకకేగి కలఁచి • రన్ని యెడల; నాదటఁ. 162

టీ—చెడక=(రావణుఁడు సేయు పాతాళహోమము) చెడకుండ జింకదారి=మృగధారి (శివుఁడు) రాయఁడు=రాముఁడు.

తే॥ నేలడాగిన రాకాసి • నెట్టనఁ గని
జన్నె నేలగలంచి యా • చెన్నటీని
దాకి యింతంత యనరాని • దారి నలఁచె;
నాతఁ డింతైనఁ గదలక • యడరె నంత. 163

టీ—నేలఁ=పాతాళమందు, ఆతఁడు=ఆ రావణుఁడు.

సీ॥ క్రిన్న నరాకాసి • కంసాలి కన్నియ
కడ కేగి, తారకం • దశలనాకె
చెన్నెర సికచేతఁ • జేర్చి యీడిచి తెచ్చి
రక్కసిరాదండ • రహిని జేర్చి
గారించె, నాకె చే • నగ్గట్ల, కన్నీ, ళ్లీళ్ల
కరణిఁ జొట్టంగ • గంటఁ జేలఁ
జేర్చియేడిచి యిందఱిజిత్త, ట్లడంగఁగా
నా కంగదల గీతఁ • నాఁటె నంచె



తే॥ డంద గాడంగఁ దనతేని • జెందనాడ
సరఁగఁ జొత్తలల గయాలి • జన్నె చెడఁగ
లేచి కత్తిని నేయఁగా • లెంక లెల్ల
చిక్కకేగిరి యిల్ సేరె • రక్కసి నెల. 164

టీ—రాకా...కన్నియ=రాక్షసశిల్పియైన మయునికూతురు (మండోదరి) తారకందు=తార యొక్క కుమారుఁడు (అంగదుఁడు) రక్కసిరావండఁ = రాక్షసరాజైన రావణునిదగ్గర, ఆకె=అమండోదరి యొక్క, చేన్గట్లన్=స్తనపర్వతములనుండి, కన్నీళ్లు= దుఃఖజలము, ఏళ్లకరణిఁ = నదీప్రవాహములోయన, అంగదలగీత=కష్టపువ్రాత, జన్నె=యజ్ఞము.

క॥ జన్నియఁగలంచి దాయం।దిన్నంగాఁ జెప్పిలంక • నేలం; దనదం
డ్లెన్నఁగ రాగా రానెల। కన్నా, కగ్గించెఁజాలఁ • గా,లెంకతెగఁ.

టీ—జన్నియఁ=యజ్ఞమును,దాయం=రావణుని,రానెలకన్నాకు=రాజచంద్రులయందు శ్రేష్ఠుఁడగు రాముఁడు, లెంకతెగఁ=భటసమూహమును, అగ్గించెఁ=పొగడెను.

—• మండోదరి భర్తను బోధించుట •—

ఉ॥ రక్కసిరాయఁ డక్కరణి • రాణిజేతం దనలెంకిఁజేరి, నే
నిక్కసి తీర నెక్కరణి• నేలిక నేద్దెఱఁ గెల్పెదం, చేదం
డక్కసియాడ, దండ నెల•నాగ నెఱం గని కల్కి! హత్తిరా
రక్కసి దాయ చెండఁగనె•రక్కసిరాయని, నింక నేటికిఁ॥ 166

టీ—ఏలికఁ=రాజైనరాముని, ఏద్దెఱఁ=యుద్ధమందు, ఎక్కరణిఁ=ఏవిధముగా, గెల్పెదఁ+అంచుఁ+ఎదఁ=జయింతునా? యని మనస్సున, డక్కు=భయము, అసియాడఁ=తూగాడగా, హత్తిరా రక్క.సి=గజేంద్రునకుని యొక్క, దాయ=విరోధియైన యీశ్వరుఁడు, రక్కసిరాయనిఁ=రాక్షసరాజగు రావణుని. (నన్ను)

క॥ ఈనాఁడ, రాచేదిట్టల। నే, నాలాన నడఁగించి • నెఱి ల గ్గిడెదఁ
నే, న ట్లడఁచేక నిల్గిన। జానకి నడఁగించి యగ్గి • సరగఁ దిగఁగదే.

టీ—ఈనాఁడ=ఈదినముననే, రాచేదిట్టలఁ=రాజశ్రేష్ఠులైన రామలక్ష్మణులను, అగ్గిఁ=అగ్నియందు, సరఁగఁ=తొందరగా, దిగఁగదే=దిగుమా (సహగమనము చేయుము).

తే॥ అనిన నాతని కిట్లనె • నన్నెలంత
కడల రాయలఁ గెల్చిన • కరణి రాచె
నెల, నడంచెద ననకాతఁ • డిలఁ జెనంట్ల
నలఁచెఁ గల్గిన "హరి"యని • తలఁచెడంద. 168

టీ__తిగఁబోఁగాఁ తాయి=ముల్లోకముల తల్లియైన ప్రకృతి, (సీత) ఆఁకడిది చెలికిన్=దశరథుని పెద్దభార్య కౌసల్యకు, ఒచ్చినన్న=లక్ష్మణాగ్రజుఁడు (రాముఁడు) దెస=దిక్కు, ఎఱచి...తేఁడ! =మాంసాశనుల రాజగు రావణుఁడ!

ఉ॥ కాలికిఁ జేయిసాచి రహిఁ • గాంచెనెఱిం, గిఁక నేలతేని యి
ల్లాలికి, నల్లనానెడి గ•యాళితెగ, జ్జడి సీటిదారి చాల్
గాలికి, నెల్లనేలతెఱఁ • గంట్లైవల న్నిరియిండ్ల తేఁటికిం
జాలి, కిలా, రిలంగఁ, దగ • సాకెడికల్కి జగాలతల్లికిన్. 172

టీ__నేల...లికి=భూనాయకుఁడైన రాముని భార్యసీతకు,నల్ల...గాలికిన్=రక్తము ద్రాగుధూర్తులగు రాక్షససమూహమను వర్షాకాల మేఘములకు మహావాయువైనదానికి, ఎల్ల...తేఁటికిన్=సమస్తభూసురహృదయపద్మ భ్రమరికి, కాలి...గిఁక=చేయిముడిచిమ్రొక్కు.

ఆ॥ కన్నతండ్రి చిన్న • కన్నెరయై యెన్నాళ్ల
కడఁగకట్టె నిల్చె • దన్నుకతన
నగ్గిఁజేరఁ జాల • నక్కటా? నాతేఁడ!
యన్నఁ జొత్తలల గ•యాళియసియె. 173

టీ__కన్నతండ్రి=కన్నవాఁడైనమయుఁడు, అగ్గిఁజేరఁజాలన్=సహగమనము జేయఁజాలను, చొత్తలల గయాళి=దశశీర్షుఁడు.

శా॥ జేజేలందఱగెల్చి కైసిరిని, జే•జేలంది జేజేలచే,
జేజేరాయనికం, టడంగ, సరిజే•జేకం, ట్లిలందెళ్ళ, నేల్
జేజేరాయల జేరినట్టిడిని, రా • జేజేల రాఁ జేరఁగా
జేజేలంద ఱిసీ యిసీ! యనర? యా • సిగ్గేర్పఁదే, నెచ్చెలీ! 174

టీ__జేజేలు=దేవతలు, జేజేలు=నమస్కారములు, అంది=పొంది, జేజేరాయనికంటు=ఇంద్రజిత్తు, జేజేకంట్లు=రాక్షసులు, నేల్ జేజేరాయలు=భూసురశ్రేష్ఠులు, రాజేజేలరాన్=రాజేంద్రుని.

ఆ॥ అల్లరాచె చేక్క • నయ్య, జేజేజియ్య
యని యెఱింగి, చెడని • యట్టికడిఁది
లగ్గెసంగ నంద • ఒలి, నతని, సెదిర్చి
నాఁడ, జెంక కింక • చేడెదంట. 175

టీ—రాచేచక్కనయ్య = రాజమన్మథుఁడగు రాముఁడు, జేజే జియ్యా=వేలుపులవేల్పు, చెడని...నందన్=నశించనిపరవస్తువుజెందుటను, చేడెదంట! = స్త్రీరత్నమ!

క॥ రాచేనెల, రాల్చి, రక్కసి। రాచేసిరింజెంద నన్నె।రసి దదికాదే౯
రాచేనెల నన్నె రాల్చిన। రాచెలి! నెలలేని రేయి।రహిని ల్చెదిటన్.

టీ—రాచేనెలన్=రాజచంద్రుని,(రాముని) రక్కసి...జెందన్=రాక్షసరాజ్యసంపదను చెందినచో, నన్నున్=రావణుడనైననన్ను, ఎరసెదు=కఱసికొనెదవు, నెలలేని=చంద్రుఁడులేని, రేయిరహిన్=రాత్రివలె, ఇటన్=ఈలంకయందు (నిల్చెదు.)

క॥ అననెయ్యది యనఁజాలక। తననిక్కట్టుల్ దినఁగఁ।దాతయ, కలిగించెనని, యెదనెంచి,నేనఁజే।య్యన నచ్చెలియతని కెఱ గి।యు టగదలితగన్

టీ—తనన్=మండోదరియైనతనను, ఇక్కట్టుల్=కష్టములను, తినగన్=కుడుచుటకు, తాతయ=బ్రహ్మయే, కలిగించెన్=పుట్టించెను.

—• రామరావణయుద్ధము •—

సీ॥ అంతట, నిందజి।త్తయ్య చేయ్యన నని
కేగ నగారాల। నెల్లప ద్ద
డరఁగఁ, దట్టించి, క।డానిచేలల, రత
నాలఁ గ్రాల్నగలఁ గం।దాలఁ దాల్చి
సింగిణీల, సరాలఁ। జేరిచిన కడాని
తరకసా, లంగీలఁ। దనరఁ జేర్చి
తిగటెక్కియాలచేఁ। దేజీలగంటలఁ,
గైసేసిన కడాని। కలికితేరి

తే॥ దంటసాహిణి తాఁదెచ్చి। దండనిడిన
నెక్కి, తత్తడి తెగలచే। నేనికతెగ
చేతఁ, గాల్గల తెగచేతఁ। జెలఁగి, క్రిక్క
లేయొసఁల, లంకరాయ! జే।జే! యనంగ. 178

టీ—కడాని చేలలన్=బంగారుబట్టలను, శిరశిరద్దభవము, సరము, దాసిబహువచనము సరములు, దానిరూపము, సరాలు = బాణములు, రత్నశబ్దభవము, రతనము, తిగ=మూఁడు,సాహిణి=రథముతోలువాఁడు, క్రిక్కలు=వందిజనము, జే, జే=జయము, జయము.

తే॥ గాలిదిండి నెఱకల రాకాసిదిట్ట
గాలినెచ్చెలి చాయ రాకాసిదంట
కత్తి,తేళ్ల నెఱకల రాకాసిజెట్ట
లండగా దండ, రా నేగె నాతఁ డనికి. 179

టీ__ గాలి...దిట్ట=సర్పరోముఁడు, గాలి...దంట=అగ్నివర్ణుఁడు కత్తి, తేళ్ల......జెట్టలు= ఖడ్గరోమ, వృశ్చికరోములు, అండగాన్=సహాయముగా, దండన్=దగ్గరగా, రాన్=రాగా, ఆతఁడు=ఆ రావణుఁడు అనికిన్=యుద్ధమునకు, ఏగెన్=వెళ్లెను.

ఉ॥ ఇట్లని కేగినట్టి యెకయొక్కటిరక్కసి దండ్లఁ గాంచి, చే
జెట్లఁ గడిందిగట్లనిడి చెట్లదిరింగెచి దండ్లఁ దాఁగి గాఁ;
జెట్లనిలంగఁ జాల్కడిఁది జియ్యల రక్కసి దిట్టలెక్కుచే
నట్లనిఁదాకి చీలిచిరి యక్కఱకైనపరాల నీటెలన్. 180

టీ__ ఎక్కటిరక్కసిదండ్లన్=సహాయములులేని రావణసైన్యమును, గట్లను=కొండలను, చెట్ల...జియ్యల్=వృక్షచరులగు గొప్ప ప్రభువుల.

ఆ॥ హత్తి, తత్తడీల, నఱదాలదాకించి
కాళ్లఁ గేళ్ళఁ, గీళ్ళఁ గత్తిరించి
నట్లచెక్కడంచి నలరాచెదండ్లస్సి
యలిగి రక్కసితెగ నలిచి రంత. 181

టీ__ హత్తి=హస్తిశబ్దభవము, ఏనుఁగు, తత్తడీలన్=గుఱ్ఱములను

శా॥ రాలం గాలరిదండ్ల గండడఁచి తేర్లంగట్లచే నార్చి, తే
జీలం జెట్ల,నడంచి, చావయిన జేజేదాయ చేయీఁటెలన్
గ్రాలం జెక్కడఁగించి, యేసికల, నారాకాసి రేరాయనిన్
జాలంగా, నలయించి చించి, యిలరాచేం దెన్న దానెంతయేన్. 182

టీ__ కాలరిదండ్లన్=పదాతిసమూహమును, చావయిన=చావనైన జేజేదాయచేయీఁటెలన్=రాక్షసులచేతి యీఁటెలను, రాకాసిరేరాయనిన్=రాక్షసరాజచంద్రుని, ఇలరాచేందు=భూనాయకచంద్రుఁడు, చించిరి=విదళించిరి.

ఉత్సా॥ ఏచినేల, రాయఁగిచి యెగిరి కొండ దాఁచి నేల్
రాఁచికేలఁ జెఱచి కఱచి రాఁ నలంచి యెదిరి కాల్

దాఁచినేలఁ జిక్కినట్టి • దానినెత్తిచీల్చి రా
రాచనెలల లెంకలెదిరి • రక్కసి నెల లెంకలన్. 183

టీ—ఏఁచి=విజృంభించి, లోఁచి=త్రవ్వి, లెంక=భటుడు, రాచనెలలలెంకలు=రాజచంద్రులయిన దాశరథులభటులు, ఎదిరి=విరోధియైన రక్కసినెల=రాక్షసచంద్రుని యొక్క.

—* యుద్ధవర్ణనము *—

సీ॥ తలకాయలానల్లు • దాసరి తెగగాఁగ
నెఱిగెల్లి గాలిదిం • డితెగగాఁగ
నఱుదాల తెగలెల్ల • నరిది కలాల్గాఁగ
లలినరాలాయెఱ్ఱ • ల, తెగగాఁగ
గడితీగ కండల్ నె • గళ్ళతెగల్గాఁగ
జెతలేని నల్లయే • ళ్ళతెగగాఁగఁ
దత్తడి తెగలెల్లఁ • దరఁగ తెగల్గాఁగ
నెఱిహత్తితెగల, తి • న్నెతెగకాఁగ
తే॥ నెసఁగదయ్యాలసడియె, యే • ళ్ళసడిగాఁగ
జేక్కనని నేల కడలికి • సాటిగాఁగ
గానఁగానయ్యె, నయ్యెడఁ • గత్తినెఱక
లఁ దగి నాతఁడ గాలికం • దెదనతాఁక. 184

టీ—నల్లదాసరి=తాచేళ్లయొక్క, తెగగాఁగన్ = సమూహము కాగా, గాలిదిండి = పాములయొక్క, కలాల్=ఓడలయొక్క, ఎఱ్ఱల= పెనపాములయొక్క, నెగళ్లు=త్రాఁటివలె నీఁటదిరుగు పొడుగైనజంతువులయొక్క, నల్ల=రక్తప్రవాహము, తత్తడితెగ = గుఱ్ఱములగుంపు, హత్తితెగ = ఏనుగులగుంపు, అనినేల=యుద్ధభూమి, కత్తి...నెడ=ఖడ్గరోముఁడు, గాలికంగెదరన్=హనుమంతు లొమ్మునను.

సీ॥ తాఁకిన, నాతని • దనచేతిగట్టసి
యిలరాల్చి గాలికం • దేచియార్చె
గాల్దిండ్ల నెఱికలఁ • గలరక్కసీఁ డేసె
జెట్టసి తూరకం • కట్టగార్చె
గడిఁదెనోళ్ల నెఱికె • ల్గల చెన్నఁడిని, కలంచె
నగ్గికం దాతని • నడచియార్చె

..రవిఁగాలి చెలిచేయ • రాకాసితాఁకిన
నేలరాయం డాతఁని, గడతేర్చె,
ఆ॥ నంత లంకరాయఁ • డానేల రాఁదాఁకె
నవేట గట్టినట్టి • రహాహాయనగ
నల్ల, నెఱసరి యయి • నట్టి జేజేదాఁకి
నట్టిరక్కసి తెగ • జెట్టి సరిగ. 185

టీ—గట్టు+ఏసి=కొండను వేసి, గట్టిండ్ల...సీఁదు=సర్పరోముఁడు, గాలికందు=హనుమంతుఁడు, తారకందు=అంగదుఁడు, అగ్గికందు=నీలుఁడు, తేళ్ల...చెన్నఁటి=వృశ్చికరోముఁడను కుచ్చితుఁడు, నెఱ...జేజే=శూరుఁడగు వేల్పు (రాముఁడు).

క॥ తాఁకితనదిట్టకై సిరి। రా, కన్నాకెన్నగా, సఁరఁగ ననె, తేఁడా!
రాకాసి సన్నకాండ్రిఁ। డీకడఁగ నడంచి తనకఁసిల్సరిగ ననిన్. 186

టీ—రా, కన్నాకు=రాజశ్రేష్ఠుఁడగు రాముఁడు, అనిన్=యుద్ధమున, సరిగన్, సిల్=నిలువఁబడుము.

సీ॥ అడరఁజేర్చఁగఁ జెట్ల • నడయాడఁగల జెట్లు?
తత్తడి యేనిక • ద్రాటైకాని,
యాలించె, జేడదార్ల • యల నల్కతలసద్ద?
నాకేళ్ళ సింగిణీ • ల్నాదకాని,
తొక్కి, యిట్టట్టాడ • నీవ రక్కలసంత?
తిన్ననైన కడాని • తేర్లు, కాని,
తాళ్లఁ జెట్లంగట్టి • రవిఁదాట, నీరిట్ట?
కడిఁది రక్కసిదండ్ల • కడలికాని,
తే॥ కన్న యతఁడేఁగఁ, దవకంటెఁ • జిన్నయాఁతఁ
డడరి రాలచ్చిఁగని కాన • కంచె, రాణి
కానఁ డిగనాడి చేన, గాయ • గస్తులదిని
డీకెడఁగనిల్క, నన్నేల • తాఁకితయ్య? 187

టీ—జెట్లు+అ=జెట్లా=మొనగాండ్రా! (శోత్రులా!) సద్దు+అ=చెప్పుదా? ఈఁద, రిక్కలసంతు+అ=వాయుపుత్రుని యొక్క, నారదయొక్క సంతానమా (ఆంజనేయాంగదులా?) నీరిట్టు=జలరాశియా?, కన్నయతఁడు=

దశరథునుండు, చిన్నయంతఁడు=చిన్నవాఁడగు భరతుఁడు, రాల్దిప్పి=
రాజ్యసంపద, రాణి=సీత.

—• నిందాస్తుతి •—

చ॥ కడలి నణంగినం, గడిది • గట్టెదఁజేరిక, నేలడాఁగినం,
జేడెన తాల్పుకన్నుఁ, గయి•సాచిన, నేత్రైఅఁగంటిమైనఁ, గా
నల, నడయాడినఁ, గడఁక • నాగిరిఁ దాల్చినఁ, జెట్లనిల్పినం
గడ కికఁ గల్కియైన, నెద•గట్టి, నిగాఁగని గండడంచెదన్. 188

టీ—కడ...నన్=మత్స్యమైన, కడి...రిన = మందరముక్రింద
కూర్మమైన, నే...నన్=వరాహమైన, జేడ...గన్నున్ = నరసింహమైన,
కయిసాచినన్=వామనుఁడైన, నే...న=పరశురాముఁడైన, కా...నన్=
రాముఁడైన, నా...న=బలరాముఁడైన, చెట్ల...నన్=బుద్ధుఁడైన, కల్కి=
కల్కిమూర్తియైన.

ఉ॥ రక్కసిరాయఁ, డిక్కరణి • రాయని నాడిన నాలకించి, యా
యొక్కటిరాయఁ డంత నగి•యేటికిఁ జొలఁగఁ, గాల్దిఁటాడఁగా
రక్కసిర య! యల్ల యిల•రాయలదాయ కడిందిదాయ, ని
న్నెక్కటిరాయ లెన్నఁ జెలి•సిద్దది, యైందిరికత న్నెఱింగితిన్ 189

టీ—ఇలరాయలదాయ=ధరణీశులవైరి (పరశురాముని) యొక్క
కడిందిదాయ=పెద్దపగవాఁడు (కార్తవీర్యుఁడు)

క॥ సీయడిగినట్టి క్రిచ్చిడి।యాయెడ, నక్కటికఁ గాచి•నట్టిడయిన యా
రేయెండ రాచదారియ।కాయంగారాని నిన్దు•గంగ నడఁచెదన్ 190

టీ—క్రిచ్చు=కోరిక, అట్టిడు=అటువంటివాఁడు, రేయెండరాచ
దారియ=వెన్నెలతేఁడైన చంద్రధారి (శివుఁడు) యే.

క॥ అనికడ్డైన నరాలం।దనసంగా నెదిరియెడద • నాఁటిన, నాతం
డెనలేని నారసాలం। గణకం దాశరథియెద ని•గాఁ గనియేసెన్.191

టీ—ఎదిరి=విరోధి రావణుఁడు, దాశరథి=రాముఁడు.

మత్తకోకిల.

ఏసి రక్కసిరాయఁ డంతట • నెన్ని యేని కడాని నీ
దీఁసినట్టి సరాల దాశర•థిం, గలంచిన, నేలఁ తేఁ
డేసె, నట్టినరాల రక్కసి • యేలికం దల లన్నిటం
డాసి, గాడఁగ నెఱ్ఱలన్నిఁట • నల్లయేర్లయి కారఁగాన్. 192

టీ—కడాని=బంగారు, రక్కసియేలిక=రావణుఁడు.

సుగంధి॥ రాఁచేదిట్టదాయ, కానరానికాల్సరాల, నా
రాచేదిట్టగాలిదిండి • రాఁచెదాయ నారసాల్
గాచి,దాయఁ దీసియేచి • గం,పడంచి చెక్కఁగా
దాచినట్ల తర్కసానఁ • దాచిరెల్ల రెన్నఁగాన్. 193

టీ—రాఁచేదిట్టదాయ=రావణుఁడు, కానరాసికాల్సరాలన్=సర్ప బాణములను, రాచేదిట్ట=రాముఁడు, గాలి...నారసాల్=గరుడసంబంధ బాణములను, కాచి=పొంచి, తర్కసానన్=తరకసమునన్, అంబులపొదియందు.

## —• మాతలి రాకడ •—

మత్తకోకిల॥ అత్తఱిం దెలిఁగంటిరాయని•యానఁ గల్కికడానితే
రెత్తఱిం జెడనట్టిసింగిణి • నేఁచిదాయలఁ జెండజాల్
సత్తిఁగన్నసరాల సాహిణి • సక్కఁదెచ్చి యిడంగ, రా
సత్తితేఁడల తేరినెక్కెదె • సల్ చెలంగ జగాజగిన్. 194

టీ—తెలిఁ...యానన్=దేవేంద్రునాజ్ఞచేత, సాహిణి = రథము తోలువాఁడైనమాతలి, రాసత్తితేఁడు = రాజసామర్థ్యముగలరాముఁడు.

శా॥ జేజేరాదెస గట్లతేని నెఱజే•జేయెక్కి నట్లెక్కి తేర్
జేజేరాయని, యంగిసింగిణిసరాల్ • జెన్నారఁగాఁ దాల్చి రా
జేజేరా, సరితేఁడితండనఁగ జే•జేలెన్న, రాకాసి రా
జేజేరాయనిఁ దాకె, నేనికలరాన్ • సింగాల గండట్లనిన్. 195

టీ—జేజే...తేనిన్=ఇంద్రదిశయందలి పొద్దుపొడుపు కొండలతేనిని, రాకాసి...రాయనిన్=రాక్షసరాజేంద్రుని, ఏనికలరాన్ = గజేంద్రుని, సింగాలగండు=సింహములమొనగాఁడు, అనిన్=యుద్ధమున.

ఆ॥ నెఱిని హత్తిహత్తి • నెఱసరినెఱసరి,
గిత్తగిత్త, సత్తి•సత్తి, గట్ల
దిట్టగట్లదిట్ట • దిట్టతనానన
కడఁగినట్ల యిద్ద•ఱడరి రనికి. 196

టీ—హత్తి=ఏనుఁగు, నెఱసరి= సింహము, గిత్త = ఎద్దు, సత్తి= శక్తి, గట్లదిట్ట=గట్లతేఁడు (శైలపతి) దిట్టతనానన=ధైర్యముచేతనే.

ఉ॥ ఇద్దరి తేరిగాండ్లసడి • యిద్దరి సింగిణియల్లెతాళ్లనా
దిద్దరి దంట్లవండిసడి • యిద్దరి నిద్ద రదాప్చి నట్టి స,
ద్దిద్దరి కత్తలాన్లసడి • యింతయు, నంతయు నేంచి యెల్లెడల్
వద్దరిలంగం జేయ, నని • దండిగం జేసిరి కచ్చెలెచ్చెంగాన్. 197

టీ—తేరిగాండ్లసడి=రథచక్రముల చప్పుడు, సద్దు, సడి=చప్పుడు, కత్తలాన్ల=గుఱ్ఱములయొక్క, కచ్చె=కక్ష.

శా॥ ఆకై సీకయి తేరికండ్లనంగన్ జెన్నారంగ సింగాణిదం,
డాకై దండలం దీసి, లాంగి, యిడిన• ట్టైనం గనన్ రాక, చె
న్నై కైదంటతనానినిం దెలియం జే•యంగల్గి, రాయిద్ద బా
హా! కైలచ్చి ననిం గడానిజిగి నీ•టైనట్టి నారాసాలచేన్. 198

టీ—కై = చేయి, తేరికండ్లనంగన్=రథచక్రములోయన్నట్టు, సింగాణిదండు=విండ్లగుంపు, కైలచ్చి=బాహుసంపద, కడాని=బంగారు.

ఉ॥ చేసిరి క్రాలం,దా, రెదలం; • జించంగ నేసెడి నారసా లెదల్
గాసినిం జెందంగాం గలంచి, • కందనగాయ, లగల్చి, న ద్దెసల్
గాసిలంజేసి నింగియిల • కానంగరాక చేసంగం జోలంగాం
జేసి చెలంగిరన్న, నింకం • జేసెడిదేది? తలంచి కాంచినన్. 199

టీ—కందనగాయ=గుండెకాయ, అగిల్చి=పగులంగొట్టి.

ఉ॥ సింగిణి గట్లదాయ, నెఱ•సింగిణిగాంగ, సరాలచాయ, లె
న్నంగన తీంగడాలయి త•నర్చంగ, నల్లియతాళ్లటినా దెసం
గం,గడి సీటిదారి సడి•గా, నిలయేలిక నీటిదారి, నిం
చెం, గలంగన్ సరాలజేడిం • జెన్నంటి రక్కసి గట్లయేలికన్. 200

టీ—సింగిణి=విల్లు, గట్ల...గాంగన్=ఇంద్రధనువుకాగా, సరాల చాయలు=బాణకాంతులు, తీంగ...ర్చగన్=తీగమెఱపులుకాగా, అల్లి ...సడిగా=గుణధ్వని మేఘధ్వని కాగా, ఇల...దారి=రాజమేఘుడు, చెన్న...యేలికన్=చెడుగరి రాక్షసరాజ పర్వతపతిమీద, కలంగన్=కలతపొందునట్లు, సరాలజేడిన్=బాణవర్షమును, నించెన్=నింపెను.

—• శ్రీరామ హనుమద్వయ సంభాషణ •—

సుగంధి॥ ఈయనైనం దిండ్కికైన • నేగె దేవ నేనటం
చే, యనిం గలంగి జారె • దేల? యన్న డాకయిం

దాయఁజేరి కేరియంత • దాని జంటకైయనెం,
"దాయనార్చనా? తడాల్న;•తాళియింకఁజెక్కఁగాఁ"॥ 201

టీ—ఈయఁ+ఐనఁ=మంచి పదార్థముల దానముజేయుటకుఁగాని, తిండికైనఁ=మంచివస్తువులఁ దినుటకుఁగాని, డాకయిఁ=ఎడమచేతిని

పంచచామరము.

"కలంచి చించి డస్సినంత, • గం, డడంగఁ గాఁ దలల్
నలంచిచెండనా!" యటంచే•నంగ నేలతేనికిఁ;
దలంగినట్టిదానఁ, గాని • దాయఁ గాంచి యళ్కినే
తేఁంగ నం చేది ర్నదల్చె • దానిరాయఁ డెన్నఁగఁ॥ 202

టీ—తలంగి=తొలంగి, దానిరాయఁడు= రాముఁడు, అనగా, నిందిద్రియాధినాథుఁడు.

ఉ॥ రక్కసిరాయఁ డక్కరణి, • రాచేసరాలజేడిం గలంచనై,
యక్కసి, నారసాలనిడి • య గ్గడిచీఁకటి నించె రాయనిం,
జెక్కని నేలతేఁడనెడి • చాయనెలంతలదంటతేఁ డటం
జిక్కని నారసాలజిగి • చేతఁ గలంచి చెలంగె నెంతయేఁ. 203

టీ—రాచే... జేడిఁ=రాజేగు రాముని బాణవర్షముచేత, నార......నించెఁ=బాణములనింపి చీఁకటిఁగలుగజేయఁగా, చెక్కని ......తేఁడు=అందగాడైన రాజమార్తాండుడు, నారసాలజిగిచేతఁ=బాణప్రకాశముచేత.

సీ॥ చాల్తలలగయాళి • చేలియిక్కచిల్కయ
గాలిదిండిసరాన • నేలి కార్చె,
గాల్దిండి చిల్కఁఖుఁ•గా, దాయ; రాయఁడ
ద్దాని కం, టల్గేసి • దానినార్చె,
దాయ, యన్నిఁటిదిండి•రాయని చిల్కయ
దానికం టల్గేసి • దంటయార్చె,
జింకదారి సరాన • లంకరాయఁ డలంచె
సిరితేని చిల్కసి • జియ్యయార్చె,
తే॥ నెన్నితెగల సరాలేయ • నన్నితెగల
నారసాలేసి యన్నింటి • నాయఁడార్చె

లంకతేనికి నిలతేని ♦ కంకిలింత
లేక కలనయ్యె సతనాళ్ళ ♦ దాఁకనిట్టె. 204

టీ—చేలియిక్కచిల్కు = వాయవ్యాస్త్రము, గాలిదిండి సరానక్=సర్పాస్త్రము చేత, గాల్దిండిచిల్కు=సర్పాస్త్రము, దానికంటల్గు=దానివిరోధియైన గారుడాస్త్రము, అన్నిఁటి దిండిరాయని చిల్కు=ఆగ్నేయాస్త్రము, దానికంటల్గు=వారుణాస్త్రము, జింకదారిసరానక్=పాశుపతాస్త్రము చేత, సిరితేనిచిల్కు=నారాయణాస్త్రము.

—* అగస్త్యునిరాకడ. *—

తే॥ కడలి నీ రఱచే, దాఁటి ♦ కదలనీఁక
చేర్చితాగిన నేల జే♦జేలదంట
రాచరేతేని నాయెడ ♦ రహినిఁజేరి
చాల లగ్గందఁగా నాడి ♦ సరగ నంత. 205

టీ—కడలి,..దంట=సముద్రమునీరంతయు నాచమనము చేసిన భూసురుఁడగు నగస్త్యుఁడు.

క॥ తిన్నని తెఱఁగంటితనా । న్నన్నడయాడని కతనఁ, గఁణఁక నేరయినం
జెన్నలర నన్న దాఁకం । దిన్నంగాఁ,దెలియ దీరి♦తెఱగీ రలకే. 206

టీ—అన్న దాఁకక్=నీవుశక్తిసమగుడవైన పరబ్రహ్మ వస్తువనిపలికినదనుక, ఈరి=మీయొక్క, ఈరలకుక్=మీకు.

తే॥ రాచరేతేఁడ! తిగజగా ♦ ల్రహినిగల్గఁ
జేసి, తగఁగాచి, రాలఁగాఁ ♦ జేసినట్టి
దిట్టలీరయి తెలియని ♦ తెఱఁగడరఁగఁ
గ్రాలఁగాఁజేన్నె? యన్నన్న! ♦ కడఁకదక్కి. 207

టీ—తిగజేగాల్=ముల్లోకములను, అన్నన్న=ఆశ్చర్యము.

క॥ నీ తెఱఁగిట్టె దటంచేని । నా తెఱగంట్లయ్యగారి ♦ కలజేతనాల్కల్
జాతినెఱసరికిఁ దెల్లని।నాతినెరసి నట్టిడికిని♦నలిఁ దెలిసెడినే. 208

టీ—తెఱగంట్లయ్యగారికిక్=బృహస్పతికి, జేత=సరికి, రెండునాల్కలున్న పాములజాతియందు శూరుఁడగు నాదిశేషునకు, తెల్లనినాతినెఱసినట్టిడికిక్=సరస్వతినిగలిసినవానికి. (బ్రహ్మ)

ఉత్సాహ॥ కానజాతిజేనిఁజోయ ♦ కల్కిఁతేని నింతడెం
దాన నానఁగాఁదలంచి ♦ నందలంచినట్టి తీ

రైనయట్టిచేతలైన ♦ నైతనర్చికేల నం
చానవాడి యేగెనంత ♦ నల్లజేన్నిగట్టిపేర్. 209

టీ—జాతిజేనిక్=వంశభర్తయైన, చాయకల్కిజేనిక్=ఛాయాకాంతాభర్తను, అల్లజేన్నిగట్టు=అబ్రాహ్మణుఁడగు నగస్త్యుఁడు.

ఉ॥ ఏగిన యంతరాచెనెల ♦ యొక్కటి చాయనెలంత జేనికిన్
సాగిలి చాలసాల్లెఱిఁగి ♦ చెక్కని తే, జెడరంగఁదాల్చి, త
న్నాగినరక్కసీని వని ♦ నాగియెదిర్చి, సగాల నేయఁగాన్
సాగిననెల్లడల్ కలఁగ ♦ సాగిన దాయనికేల తల్చఁగాన్. 210

టీ—రాచెనెల=రాజచంద్రుఁడు, దాయన్=రావణుని;

ఉత్సాహ॥ అంటరాని జేనిసాటి ♦ యైన నారసాల, రా
దంట సాహిణీని, జేరిఁ ♦ దత్తడీలఁ గాఁడఁ, జె
న్నంటి లంకరాయఁడేయ ♦ నఱికి యన్ని నేలతేఁ
డంటి యగ్గి నారసాన ♦ నాచెనంటి నేయఁగాన్. 211

టీ—అంటరానిజేని=ముట్టుకొనవీలుగాని ప్రభువగు నగ్నితో, రాదంట=రాజులయందు నేర్పరియైన రాముని యొక్క, అగ్గినారసానన్=ఆగ్నేయాస్త్రముచే.

## —♦ రావణుమూర్ఛ ♦—

ఉ॥ రక్కసిజేని నద్దిఁ యెదఁ ♦ గ్రిన్నఁ గాఁడఁగఁజేయ నంతటన్
రక్కసిదం డ్లడల్ గనఁగ ♦ రక్కసిరా నడగట్టనంగ, న
ట్లక్కడి తేరఁజేరె; నఁట ♦ నాతని సాహిణిదంట తేరిసిం
డక్కడరం, దలంగ నిడ ♦ డస్సినరక్కసితేరి యిట్లనెన్॥ 212

టీ— అద్ది=ఆయాగ్నేయాస్త్రము, నడగట్టు= నడచుకొండ యోయనగా,

చ॥ ఎఱిఁగి, యెఱింగి నాదయిన ♦ యేడ్తెఱనెల్ల ఱిసీ! యిసీ! యనం
జెఱిఁగిఁచి తేరి సిఁదిడిలి ♦ సాహిణి! యియ్యెడ సి న్నిఁకేడియం,
దఱిఁ గినఁ గల్నలగ్గెకద? ♦ యంచేతఁ డయ్యిలకన్నె జేనికిం
దరి గఁ,దడాల్నతే రడరఁ ♦ దాచఁని తార్చిన జేనిఁదాకినన్॥213

టీ—నడ్డైఱి=యుద్ధక్రీడము, కల్నన్=యుద్ధమునందు, అఱిఁగినవాఁ=(మరణించిన) పోయిన, లగ్గెకద=మేలేకద?, తార్చు+అని=దాకొల్పుమని.

సుగంధి॥ ఎన్నఁజాలనట్టి గట్టి • యేడ్త్రైఅయ్యె నయ్యెడం
గన్నునం గడానిచాయ • గ్గినట్టినారసా
లెన్నియేని లచ్చెనన్న • యెక్కినట్టి తేరి,సిం
డ, న్నిలంగ నీకయేసె • డయ్య, రక్కసీఁ డహా॥ 214

టీ—ఏడ్త్రైఅ=యుద్ధము, కడాని...సాలు=బంగరు కాంతులీను బాణములు, లచ్చెనన్న=రాముఁడు, డయ్యేఁ=అలయునట్లు

ఉ॥ ఏసిన నేలతోఁ డడరి • యేడ్త్రైఅ నగ్గిని దీటఁజాల్న రా
లేసి, నలంచి యన్ని; యతఁ • డెక్కిన తేరిన సాహిణీ నటె
యేసినఁ డన్నెఁ జాల్న లల • యేలిక; యావట రక్కసీఁ డెదం
గాసి నలంగ నల్లజేడి • కాతాఁ గడిందిగ నక్కలాచేఁగాఁ॥ 215

టీ—రక్కసీఁడెదఁ=రావణుఁడు మనస్సునందు, గాసిఁ=కలత చేత, నల్లజేడి=రక్తవర్ణము, నక్కలాచేఁగాఁ=జంబుకము లఱువగా.

ఉ॥ చెన్నడఁగంగఁ గీఁడిడెడి • చిన్నెల కెడ్డఁ దలంక కింతయేఁ
జెన్నఁటి రక్కసీఁడడరి • చేయఁగ సాగె నవిం, జెలంగఁగా;
నెన్నఁగ నెక్కటీఁ డయిన • యేలిక కిద్దియ చిన్నెకాక, తా
నన్నక నన్నజారెడినె? • చచ్చిన నండెడికాక లగ్గహా?॥ 216

టీ—కీఁడిడెడి చిన్నెలకుఁ = అమంగళములైన గుఱుతులను, ఆద్దియ=రావణునకుఁగనుపడు, నశుభచిహ్నమే, ఏలికకుఁ=రామునకు, చిన్నెకాక=శుభ చిహ్నముకాక, లగ్గు=మేలు.

సీ॥ ఆదట నేలతోఁ • డడరి రక్కసితేని
చేదండల నరాలఁ • జేర్చిచేర్చి,
యీాదదిం డ్లేలిక • కెనయైన నార్సాలఁ
దలకాయలన్నిఁటఁ • దార్చితార్చి,
తెఱఁగంటి చాకత్తి • తెఱఁ గంటిన నరాల
నల్లకీళ్లంజేర్చి • యేర్చియేర్చి,
తెల్లని రాయని • తెగకంటి కెనయైన
త్తి చే నెక నన్ను • గార్చి కార్చి,

తే॥ యొక్కటీఁడవజెల్లిన • రక్కసీని
చె, న్నడంగఁగ నెంతేని • జించిచించి

కలఁచి కఱకైన నారాచాల • గఱికఱతెగ
నేసెఁ దలకాయలం గెల్ల • నెంచియెంచి॥ 217

టీ——ఈదదిండ్లేలిక=సర్పరాజు, తెఱఁగంటిరాకత్తి=ఇంద్రునివజ్రము యొక్క, తెల్లనిరాయనితిగకంటికిన్=తెల్లనిప్రభువగుశివునిమూఁడవ నేత్రమునకు.

క॥ తెగనేసినతలకాయ । ల్తెగ, కైతెగ, లట్లేకల్గఁ • దెలిసియతఁడ నేన్
దెగఁజేయఁజాలకేగెన!। తగలకయేగెన? సర్వాజ్జ • తల్కున నకటా!॥ 218

టీ——కైతెగలు=చేతులగుంపులు, అట్లేకల్గన్=వెనుకటివలె కలుగఁగా.

క॥ అరసికని తిరిగి, యఱనెల । సరాల రాకాసితలలఁ • సందిళ్లజేతల్
కఱకఱ, నఱకినఁగనఁగన। నఱకినయెడఁదిరిగి కలిగె • నలి నక్కరణిన్ 119

టీ——అఱనెల...... సరాలన్=అర్ధచంద్ర బాణాలచేత, కనగనన్=చూడఁజూడఁగా.

క॥ ఆకరణిని దెగనేయఁగ । నాకై, తలకాయ లట్లె • యలరారంగా
సీకరణిజేరిగె దరిదం।డ్లాకలిగెడి చిట్టఁగాంచి • యడలందంగాన్.

టీ——కై తలకాయలు=చేతులు,తలలు, అట్లె=ఆవిధముగ,జేరిగెన్=కొంతసేపరిగ.

క॥ తెగినతలల్, తెగెడితలల్ । తెగిగ్రద్దల్లన్న నింగి • దేల్ తలకాయల్
తగినట్ల కలిగెడితలల్ । జిగిఁగ్రాలెం గారడీని • చిట్టాటయనాన్. 221

టీ——నింగిఁదేల్=ఆకాశమునఁదేలియాఁడు , చిట్టాఁటయనాన్=చిత్రమగునాటయనఁగా.

క॥ తెగియెగిరెడి తలకాయ। ల్తెగ, లేలిక నారసాల • తెగ, లాగ్రద్దల్
తెగలెల్లఁ జేదల నెఱయం।దగి చీఁకటిచేతఁ జాయ • నాయని దాచెన్.

టీ——చేదలన్=ఆకాశమున, నెఱయన్=వ్యాపింపఁగా, చీఁకటి చేతన్=వానియొత్తిడిచేఁగలిగిన చీఁకటిని, ఛాయనాయనిన్=ఛాయానాయకుని.

క॥ తెగనేసియేసి, తలకేళ్ళగ, డెఁదంగాంచి, రాయఁ • డంతట నానన్
జిగిఁదరిగియత్తఱిని జే। యఁగఁ దగినది కానరాక • యట్టె,నిలంగన్. 223

టీ——నానన్=సిగ్గుచేత, జిగిదరిగి = కాంతిహీనమై, చేయగ... రాక=కర్తవ్యమెఱుఁగఁజాలక,అట్టె=ఆశ్చర్యముతో,నిలంగన్=నిలువఁగా

ఉ॥ రాయని, చెంతఁజేరి చిన • రక్కసితేఁడనె, తేఁడ! చేల్తలల్
రాయనియంద, తాతతన•రం,దగఁ గల్గినచాయ, నాదెసల్
రాయఁతిండి కల్గె,నది • రాఁకరక్కసిరాలఁ డన్న,నేల్
రాయల,డంచె,దాని జిగిఁ•గ్రాలెడి చిచ్చెర నారసానసే. 224

టీ___రాయనిచెంతఁ=రాముని దగ్గర, చిన...డనె=చిన్న వాడగు విభీషణుఁడు, చేల్త...యంద=రావణునందె, తాత...చాయన్ = బ్రహ్మబుట్టిన ఒప్పునట్టి నాభిప్రదేశము, అదెసల్...కల్గెన్=దిక్పతులయాహారము (అమృతము) అదిరాలక=ఆయమృతముపోకుండ, రక్కసి = రావణుఁడు.

అ॥ ఈకరణినడంచి • యేఁచి, తెల్లనిచాన
తేని,నింగి,రేయి • తేనినినిడి
లెక్కయిడిన నెన్ని • లెక్కయ్యె నన్నిసా
ర్లాట్లెతలలఁ గేళ్ళ•నడఁచెనంత. 225

టీ___తెల్లని చానతేనిన్ = బ్రహ్మసంఖ్యననఁగా తొమ్మిదిని, నింగిన్=ఆకాశసంఖ్యననఁగాసున్నను, రేయితేనిని=చంద్రసంఖ్యననఁగా నొకటి (109) నూటతొమ్మిదిబాణములను.

కం॥ జేతకైదండలచే, నఱజేతతలచే రక్కసితరి • సత్తిని నేసెన్
జేతకాని జిన్నరక్కసిఁజేతనం దనలాఁగెదిరి కొఁసఁగ ననె ననితాన్॥

టీ___జేత...చే=రెండు చేతులచేత, అఱ...చేన్=ఒకతలకాయచేత, సత్తిన్=శక్తిచే చిన్ని...నని=విభీషణుఁడు తనమరణక్రమము రామునకుఁ దెల్పెనని.

ఉ॥ ఏసిన రాచేదిట్ట తగ • నేచి, కలంచి యలంచెసత్తిఃరా
కాసినలంగిత్తైన జత•కై గఱకైన సరాలనేయఁగా
డాసినఁగాంచి, సాహిణిఁ ద•డాల్ననడంచె కిదేల? తేఁడ! నిం
దాసిన దాఁక నిల్చితనఁ, • దాటకఁ జెండినరాయఁ డంతటన్. 227

టీ___రాచేదిట్ట=రాముఁడు, ఏఁచి=విజృంభించి, సాహిణిన్=సూతుని.

ఉత్సాహ॥ తాతచి ల్కెసంగ నేర్చి, • తాకగా నెదిర్చిగా
చేతఁ గాంచి, యేయనద్ది • చెచ్చెరఁ జేని యెంద తేన్
జేత సాకిరితెగ కెనగఁ • జెలఁగి లంకరాయనిం
గాతనేసి నీటనాని • కలసె దఱకసానసే. 228

టీ॥ తాతవిల్కు=బ్రహ్మాస్త్రము, ఎదిరి +నిగాచేతన్=విరోధి రావణుని లక్ష్యదృష్టితో, చేతసారిరి=కర్మసాక్షు (సూర్యుల) లయొక్క తెగకున్=సంపురను, ఎరగన్=సమానముగా, లంకరాయనిన్=లంకా పతిని (రావణుని) గాత=ఘాతుకత్వము చేసి=చంపి, నీటన్=నీళ్లయందు ఆని=తృప్తిగా మునిఁగి, తలకసాననే=అంబులపొదియందే, కలసెన్= అస్త్రములజేరెను.

కం॥ ఆడిరి జేజేకాల్గిం । ట్లాడిరి, తేఁడంపేఁదగిన • యనఁగని, జేపదా ర్లిడేరిచె నంగదలని నా, డేరిచెలంగ నిడిరి•నన లలజేజేల్. 229

టీ__జేజేకాల్గింట్లు=దేవతాస్త్రీలు, ఆడిరి=నాట్యముచేసిరి, జేడ దార్లు=ఋషులు, ఆడిరి=పల్కిరి, అంగదలు=కష్టములు, ఈడేరిచెన్= తొలఁగించెను, నాఁడు=రావణసంహార దినమున, జేజేలు=దేవతలు, ఏరి=చెట్లనుండియేరి, ననలు=పూలు.

చ॥ అనిఁదెగినట్టి చేవ్రాల్తలల • యాతని నాతనికంటెఁ జిన్నతం
డనిచిన నాగనట్టి నెర•యంగదఁ దగ్గరఁజేరి, యన్నా! నే
యనినటె చేయకిట్లడఁగ • నయ్యెనె? ఋయ్యెడ నక్కటక్కటా!
యని తెగయేడ్వ నన్నదరి • నాతనిచేడియ లండ నెంతయేన్. 230

టీ__అనిన్=యుద్ధమందు, తెగి...తనిన్=వేచ్చినపంక్తిశిరుఁడైన రావణుని, ఆత...తండు=వానికంటెజిన్న వాఁడైనవిభీషణుఁడు, అనిచినన్ =అడంచుకొన్నను, ఆతనిచేడియాలండన్ = వానిభార్యలగు మండోదరి మొదలైనవారిచెంత.

క॥ ఏఁడిచిన నంతనెచ్చెలిఁ । జేడియలం గనికరానఁ• జెన్నారంగాన్
తేఁడలరఁదేర్చి, రక్కసి।తేఁడల జేజేలతెంకి • రెచ్చిలజేరన్. 231

టీ__తేఁడు=రాముఁడు, నెచ్చెలిన్= స్నేహితుఁడగువిభీషణుని, చేడియలన్=రావణుకాంతలను, జేజేలతెంకి = స్వర్గము, రెచ్చిలన్= హెచ్చుగ.

మ॥ చెలిచేఁజేయ్యన నగ్గిచేత లలరం•జేయించి, అన్నేన్నా!; నె
చ్చెలికండంజేని లంక, కాతనిని తేన్ • జెన్నారఁగాఁజేసి, రా,
చెలిజేటం, దనరారలనం చేనిచినం • జేజేలకంట్లండనాఁ
జెలియల్చుక్కనియయ్యె, లచ్చెన చేనెం•జెన్నైన యాలంకకై. 232

టీ__చెలిచేఁ=(రాముఁడు) స్నేహితుఁడైన విభీషణుచేత, లంకకుఁ=లంకానగరమునకు, నెచ్చెలిదండఁ=స్నేహితుజెంట నేగి, ఆత... జేసి=వానిని ప్రభువునుజేసి, రా=రమ్ము, చెలి...యయ్యా=రమణీమన్మథుఁడగు, లచ్చ్పన=లక్ష్మణుఁడు, చేనెఁ=వెళ్లెను.

శా॥ ఆలచ్చ్పన్న యి టేగి యెల్లఁగల నీ•రానాఁడె తేఁజేసి, క
యాక్యాలం జెన్నటినట్టి లంక గయిసే•యంజేసి, యద్దాలచే
గాలిలంగక్లీవ సజ్జేఁ గల్కిరతనాల్ • గద్దెం జెలిం జేర్చి, జే
జే, లగ్గించేఁగ నెళ్ళనీ ర్జిలికి రా•చిన్నెల్ జిగిం జెల్లఁగాఁ. 233

టీ__కయ్యా...లంకఁ=యుద్ధములచేత నందము జెడిన లంకను, సజ్జేఁ=మేడయందు, కల్కి...జేర్చి=రత్నాలగద్దెమీఁద స్నేహితునిఁ జేర్చి, చిన్నెలు=చిహ్నలు.

క॥ రాచనెఱిచేఁ గడానినె। తాచేక్కనితేఁ కడరఁగ•రహిఁగట్టియటఁ
రాచనెలకత కెనగ నేలిచేక్కనియిల, ననియతఁ•డేలికఁ జేసెఁ. 234

టీ__రాచనెఱిచేఁ=రాజధర్మమునననుసరించి, కడాని...గట్టి=మొగమునబంగారు రేకుగట్టి, రాచనెలకతకుఁ=రాజచంద్రుని(రాముని) కథకు జతగా.

ఉ॥ చేసిన సంతసానఁ జెని • చీనఁగడాని జేరిని జెక్కఁగా
నేసిన చేలలం, జిగిని • నిండినరాల్నగలం గడింది తేం
డాసి, నలంగినట్టిదిని • డాచితి కాచితటం చెడంగ, రా
కాసి, నడాన నంటి యిల • కన్నియతేఁ డలచేలల న్నగల్. 235

టీ__(లక్ష్మణుండు) చేసినఁ=(విభీషణుని) రాజుగాఁ జేసినతోడనే, చీనఁ=చీనాదేశమున, డాచితి=డాఁచినాఁడవు; కాచితి=రంక్షించినాఁడవు, ఇల...తేఁడు=రాముఁడు, అల...నగల్=ఆవిభీషణుఁ డిచ్చిన బట్టలునగలు, నడాననంటి=మధ్యను జేతితో ముట్టుకొని;

శా॥ జేజేరాయనితేరి సాహిణికిఁ జే•ర్చెం, జేర్చి యంపేంగ నా
జేజేటెంకికి నేగె నాతఁ డిఁట రా • జేజేలతేఁడంత, నా
జేజేదాయలతేనిఁ గాంచి చెలి! రా • సింగారి నీనేలకై
తేఁజేయంగదె యన్న నాతఁ డెద నెం•తే సంతసానం జేనెఁ. 236

టీ__(ఆనగలను, బట్టలను) జేజే...ణికిఁ=ఇంద్రిసారథిమాతలికి, చేర్చి=ఇచ్చి, అంపేంగఁ=పంపఁగా, ఆతఁడు=మాతలి, జేజేటెంకికిఁ

స్వర్గమునకు, ఇటన్=ఇక్కడ, రాజేజేలతేఁడు=రాజేంద్రుఁడగు రాముఁడు, చెలి!=స్నేహితుఁడ! రాసింగాన్=రాజకాంతయగు సీతను, ఈనేలకై=ఈసమరభూమికి.

—* విభీషణుఁడు సీతనుదోడితెచ్చుట. *—

చ॥ చేని, యిలకన్నెఁగాంచి నెఱి • సాగిలి యన్న యడంగినట్టి లాఁ
గని,తనచేడియాల్ తనర • నచ్చెలియం గయినేయ నంతటం
దనియఁగఁ జీరలన్ నగలఁ • దా నిడి చెక్కనియందలాననే
తనరఁగఁజేర్చి రాచేనెల • దగ్గరజేరిచె నెల్ల రెన్నఁగాన్. 237

టీ—చేని=విభీషణుఁడువెళ్లి, ఇలకన్నెన్=భూమికన్యయైనసీతను, అందలానన్=మేనాయందు, చేర్చి=యుంచి, రాచే...జేర్చెన్=రాముని కడజేర్చెను.

—* సీత యగ్నిం జేరి శుద్ధురాలగుట. *—

ఉ॥ చేరిచి నంత రాచేనెల • సిగ్గిలి తన్నడఁ గన్న సి గ్గెదం
జేరి,చిరా కెసంగఁ గనఁ • జేయఁగఁ జేడియఁ గాంచికల్కి! ని
న్నేరిచినట్టి చెన్నఁటిని • నేడ్తెఱ దంటతనాన నెంతయే
నారిచినాఁడ, రాచనెఱి • నాఱడి జెందఁగ నీఁక నీయెడన్. 238

టీ—సిల్లు=కష్టము, నిన్నే......చెన్నఁటిన్=నిన్ను బాధించిన రావణుని, రాచేనెఱిన్=రాజధర్మమును, ఆరడి=నీఁటిబోనీక, ఆరచి నాఁడన్=చంపితి.

ఉ॥ కాన, నెలంత! యిచ్చ్వ యెటఁ • గల్గిన నచ్చోటి కేఁగ జెల్లనం
గా, నవె సీత, రాచనెల! • గట్టిగ విన్నెద నచ్చితింక నీ
కైన నెలంత నేనేచేటి • కైన నటింగినఁ జెల్లటయ్య! యా
కానన డించియేగినది • గాక, యిఁటాడఁగఁ జెల్లెనే కటా! 239

టీ—నెలంత=ఓకాంత!నచ్చితి=నమ్మితి, చెల్లెనే!=తగియుండెనా?

ఉ॥ ఈరికి సందియాం లెడద • నీయెడ నాఁటివ నగ్గిఁజేరెదం,
చేరికినైన జాలియొద • నేర్చఁగ నాడిన నన్నయాన, నే
ద్దారికి వింత దగ్గరఁగ • లచ్చిన యగ్గి రగిల్చి, సీతనే
ద్దారికి నగ్గి కట్లెఱఁగి • తానఁట నగ్గిని జేరెఁ జేరిన్. 240

టీ—ఈరికి=మీరు, (ఈరు శబ్దము యొక్క షష్ఠీవిభక్తి ఈరికి) (సందేహ శబ్దభవము సందియము) దానిబహువచన రూపము, సంది

యాలు=సందేహములు, అన్నయానఙ=రామాజ్ఞను, నేల్దారికిఙ=భూభృత్తునకు=రామునికి; అగ్గిని=అగ్నియందు, చేరెఙ=చొచ్చెను.

ఆ॥ గాలినేస్తి సీత • గజితత తనానికిఁ
జాల్కఁజెంకి యట్టె • చెల్లనయ్యె,
నేలకన్నె యెట్టి • అాలనడాని క
డాని జిగిసలాక • గాసె చెలఁగె. 241

టీ—గాలినేస్తి=వాయుసఖుఁడగు నగ్ని, సీతగజితతనానికిఙ=సీతపాతివ్రిత్యమునకు, నేల...... చెలగెఙ=సీత కెంపుఁనడిమి బంగారు సలాకవలె ప్రకాశించెను.

క॥ అయ్యెడ దచ్చికడలరేం। డెన్గఁయ్యెడఁ, దెల్చిజేతరాఁగ• నెల్లజేగాలఙ
జేయ్యనఁజేసియడంచెడి। జియ్యల్ రానై రి నేల•జియ్యకడ కహా. 242

టీ—అయ్యెడఙ=ఆసీత పరిశుద్ధురాలైన సమయమున, ఎల్ల... జియ్యల్=సమస్తలోకములను పుట్టించి గిట్టించు బ్రిహ్మరుద్రిలు, దచ్చికడలతేండ్రి = అష్టదిక్పాలకులు, తెల్చి=కొల్చి, నేల జియ్య=భూభర్త రాముఁడు.

క॥ ఏతెంచి యీకరణి నిల। రాతెఱఁగంట్లతెగజియ్య•రహిఁగనిజేజే
చేతకయి కలిగి చొల్లల। లాతనిఁ గడతేర్చినట్టి•డా!యనియెంతేఙ.

టీ—(బ్రిహ్మరుద్రిలు) ఏతెంచి=వచ్చి, ఇల...జియ్య=రాజేంద్రి, జేజేచేతకయి=దేవకార్యమునకయి, చొల్త...డా!= రావణునిజంపినవాఁడా!

క॥ నెఱిచేతనెన్ని తేఁడా!। తెఱగంట్లంగాయఁగల్గి•తిరిగద, యీరల్
కఱిజేజేకాదా? సిరి। గజితయకాసీత? యింక • గలఁగెడిదేలా? 244

టీ—ఈరల్=మీరు. కఱిజేజేకాదా=విష్ణువుకాదా? సీత, సిరిగజితయకాదా?=లక్ష్మికదా?

క॥ అనిగజితల తలకెక్కైతనలర యీనేలకన్నెఁ• దగనెల్లజేగాల్
దనియించఁగలసినెనగదె। నెన గారఁగ నేలఁదగిన•నేల కలరఁగఙ.245

టీ—గజిత...రిన = పతివ్రితాశిరోమణియై యొప్పిన, ఏలఁదగిన నేలకుఙ=అయోధ్యకు.

సీ॥ అని, తెలుఁగట్లతేం • డ్రిత్తేఁగిన తేఁడంత
నానేలకన్నె చే • యంటితిగిచి
జంటఁజేరిచి తన • కంటెఁబన్నాతని
దరిఁజేర్చి, యార్కి. ని • దారకన్న
య్యాతని, దాతక • న్నాతని, గాలిక
న్నాతని, నగ్గికి • న్నాతని, నల
రాకాసిరాయని • రాణదలిచేరంగ
హత్తి ననలనన్న • యందలానఁ
తే॥ జేరిటెంకిణిఁ జననెంచి • దారిఁజెట్ల
గట్లఁ, గానల, జడదారి • గఱితలతెగఁ
గాంచియేగెడి తఱిఁదన • గఱితకడలి
నీటినానిన జడదారి • నెలఁతఁగనగ. 246

టీ__ తెలు...తేండ్రు=బ్రహ్మరుద్రాదులు, తేఁడు=రాముఁడు నేలకన్నె=సీత, తన...న్నాతని=లక్ష్మణుని, ఆర్కిఁ=సుగ్రీవుని, తార...తనిఁ=అంగదుని, తాత...తనిఁ=జాంబవంతుని, గాలి...తనిఁ=హనుమంతుని, అగ్ని...తనిఁ=నీలుని, అలరాకాసిరాయనిఁ = రాక్షసరాజగువిభీషణుని, హత్తి=కలిసి, తనగఱిత=తనభార్యసీత, కడలి...నెలఁతఁ = సముద్రోదకమునాచమనముజేసిన అగస్త్యునిభార్యలోపాముద్రాదేవిని

ఉ॥ ఏఁగఁగ నెంచినట్టితఱి • నిట్లనెనేలిక, యింతి! లంకకే
నేఁగఁగ నెంచియక్కడలి • నెక్కటిగట్టితటం బెటాడరా
దాఁగఁగఁజెల్లదేల! యన • నచ్చెలితేఁ డలనీటితిట్టనాఁ
డాఁగఁగఁజేసి త్రాఁగెనన, • నాతనిసత్తిని నెన్నరాదిదే? 247

టీ__ ఏలిక=రాముఁడు, ఇంతి!=ఓసీత!, లంక...టంచుఁ=లంకకేఁగదలచి సముద్రమునకు గట్టుగట్టితని, ఆఁగఁగఁజెల్లు=చెప్పకుండనూరుకొనదగును, అచ్చెలి...త్రాఁగె=లోపాముద్రపెనిమిటి సముద్రము నాఘ్రాంతిఁజేసెను.

చ॥ అనియతఁ డంచెనీతచెని • యక్కడ నజ్జడదారి చేడియం
గని యిలతాఁక సాగిలి త • గంగ నెఱుంగి, యడింగి లగ్గటం
దనియఁగ నంత నగ్గఱిత • తన్నెఱిచేకఁగ నెంచి యంచెఁగాఁ
జని యిలతేనినిం గలయఁ • జెయ్యనఁ దారట-సాగియేఁగఁగన్. 248

టీ—అజ్జెడదారి చేడియఱ = ఆయగస్త్యమునిపత్నిని, సాగిలి=పాదములబడి, ఎఱంగి=నమస్కరించి, తార=ఆసీతారామలక్ష్మణాదులు.

తే॥ గాలికందంత తేడంచెఁ • గానఱింగి
నందినానగరం గైక • కందలరఁగఁ
గాంచి యేతెంచె నీయన్న • గారటన్న
జాలఁగా, నాతఁ డెదనింత • సంతసిల్లి.

టీ—గాలికందు=హనుమంతుండు, నందినానగరఱ=నందిగ్రామమనుపల్లె యందు, కైకకందు=భరతుఁడు, నీయన్నగారు=మీయన్న రాములు,

శా॥ చెన్నారఁ, న్నగరెల్ల సంతనగఁ గై•సేయించి తేర్లఁజేగా
జన్నింగ ట్లల నల్కత ల్కడఁక నం•పేంతంతరా సత్తినిం
గన్నాతం డెనలేనితేజేడర రా•గా, జంటఁ దేరెక్కి త
న్కన్నుం జిన్నతఁ డెంతయేని సిరిరా•గా, నెక్కి రాహత్తినిఱ. 250

టీ—నగరెల్ల...సేయించి= అయోధ్యనలంకరింపించి, తేర్లఱ=రథములందు, జన్నిం...రాఱ=బ్రాహ్మణులు నాల్గువేదములఁపఠింపుచు బ్రిక్కలరాగా, సత్తి...తండు=శక్తినిగన్న వసిష్ఠుఁడు, తన్కన్నుంజిన్నఁతండు=తనకంటెఁ జిన్నవాఁడైన శత్రుఘ్నుఁడు, రాహత్తినిఱ=రాజెక్కిడిపనుగను.

ఉ॥ హత్తినినెక్కి దండ్లతెగ • లండలరాఁ, జని యన్న నిచ్చ, రే
కెత్తఁగఁ గాంచి హత్తిఁడిగి • హెచ్చియెఱంగ, నెఱంగెఁ జిన్నతం,
డత్తఱి రాచేదిట్ట నెన• రారఁగ నిద్దఱనెత్తె; నాదటఱ
సత్తినిఁగన్నయాతనికిఁ • జెక్కఁ నెఱంగిరి సీత, రానెలల్. 251

టీ—అన్నఱ=జ్యేష్ఠుఁడైన రాముని, హెచ్చియెఱంగఱ=(భరతుఁడు) అతిశయించి నమస్కరింపఁగా, చిన్నతండు= చిన్నవాఁడయిన శత్రుఘ్నుఁడు, ఎఱఁగెఱ=నమస్కరించెను, సీత, రానెలల్=సీతారామలక్ష్మణులు, సత్తి...నికిఱ=వసిష్ఠునకు, ఎఱంగిరి=నమస్కరించిరి.

తే॥ కైకకందంతఁ దనయన్న•గారిల, గ్గ
డింగి, యాయన తన లగ్గ•డింగిన నని,
అన్నఁజిన్నల సత్తినిఁ • గన్న యతని
నెన్నఁదనహత్తి నెక్కించి • యేఁగ నగర. 252

టీ__లగ్గు+అడింగి=క్షేమమడిగి, ఆయన=ఆరాముఁడు, అని = పలికి, అన్నన్=రాముని, చిన్నలన్=లక్ష్మణుని, శత్రుఘ్నుని, సత్తి... తనిన్=వసిష్ఠుని, నగరన్=పట్టణమునందు.

ఉ॥ తిన్నని జాతిజొన్నగలఁ • దీర్చి, సరాలఁ గదించి కీల్జడన్.
సన్నని చీరఁగట్టి, జిగిఁ•జెల్లెడి రిక్కలతైఁకఁదాల్చి, కం
తన్నని యెన్నఁగాఁదగిన • యట్టి నెలంతలదంట సేరె నా
కన్న,నిలం గలారె నెతె • గన్నియలం చెలతేనిఁ గాంచేఁగాన్. 253

టీ__రిక్కలతైఁక=చుక్కలతైఁక, కంతు+అన్ను+అని=మన్మథు భార్యరతియని,

ఉ॥ కాళ్లఁగడాని యందెల జే•గాజిగి గాగర నాఁగి తేఁగి హె
చ్చెల్లఁగఁ, జిట్టచాయలిడి • చేఁదడి యార్చెడి నెల్లిచీఁకటిం
జెల్లఁగనెట్ట, సజ్జెకడఁ • జెక్కఁగ నిల్చెనెలంత, తేని రా
ణిల్లఁగనంగ రాచేసిరి • నేటిల నిట్టిఁట, నిల్చెనా? యనన్. 254

టీ__కడానియందెల=బంగారందెల, గాగర=లంగా, చిట్ట=చిత్రమైన, నెల్లిచీఁకటిన్=వెండ్రుకలచీకటిని, సజ్జె=మేడ, రాచేసిరి = రాజ్యలక్ష్మి.

సీ॥ ఇతఁడటే! రాకాసి • యేలికఁజెండాడి
రాకల్కినెనసిన • రాచేదిట్ట
ఇతఁడటే!తనయన్న • నిలకన్నియందెల్చి
కర్చేర్చెందనిల్చిన • కడిఁదిజెట్టి
ఇతఁడటే! లెంకచే • నిలకన్నె నరయించి
కని,తేనికెతిగించేఁ • గన్నదిట్ట
ఇతఁడటే!తనయన్న • యెగ్గాడి రాతేని
కడఁజేరినట్టి రా•కాసిజెట్టి

తే॥ అని కలికి సీతతేని, ల•చ్చన్న,నార్కి,
లంకరాయని నెంచి నే•లంతలెల్ల
ననలఁజిల్కిరి సజ్జెలం • వనర నిర్చి
జేసికీలితి రేయెండ • లీసినట్ల.

టీ__సీతతేనిన్=రాముని, లచ్చన్నన్=లక్ష్మణుని, అర్కిన్=సుగ్రీవుని, లంకరాయనిన్=విభీషణుని, ఎంచి=ప్రశంసించి, తేని=రాముని

యొక్క, కీరితి=కీర్తి, సజ్జలం=మేడలందు, నెలంతలు=స్త్రీలు, నవలఁ=పువ్వులను, చిల్కి=చిమ్మవైచిరి లేకచల్లిరి.

ఉత్సాహ॥ రాచదారి నిట్లతెంగి • రాచ తెంకిఁ గాంచి యా
రాచహత్తి, హత్తిడిగ్గి • రహినిజేరి తెంకిని,
న్గాచినట్టితల్లికెఱఁగి • కడఁకఁ జిన్న లెఱఁగఁ గై
సాచియెత్తి, ల గ్గడింగ • సారెసారె కానటఁ॥ 256

టీ—రాచదారి = రాజమార్గము, రాచ తెంకి = రాజగృహము, రాచహత్తి=రాజ కుంజరుఁడు, లగ్గు=మేలు.

ఆ॥ సీత యత్తలకడఁ • జేరిజేజేలఁ,జే
యంగఁ దారెదల సెసంగఁజెలఁగి
రంత సంతసాన • నాకె చెల్లెండ్రింద
తెఱఁగ లగ్గడింగ • నెత్తికేల॥ 257

టీ—అత్తలకడఁ=కౌసల్యా సుమిత్రా కైకలదగ్గర, జేజేలఁ=నమస్కారములను ఆకె=ఆసీత యొక్క, చెల్లెండ్రిందలు=ఊర్మిళా,మాండవీ, శ్రుతకీర్తులందలు.

—* శ్రీరాముఁడు పట్టాభిషిక్తుఁడగుట. *—

సీ॥ అంతట నేలతేఁ • డల,సత్తిఁగన్నట్టి
నేలజేజేయాన • నీళ్లతిట్ట
లందలి, జేక్కఅ • లందలి నీటిని
దేఁజేసి నల్నీళ్ల • తిట్టల నడి
నేలఁగల్గిన తేండ్ల • నేలజేజేదండ్ల
జేడదారి దంటల • నడరఁ జేర్చి,
నాగటి చాల్నన్న • నాతి,తాఁదగఁజేరి
లెస్సతగ్గని నాఁట • లెస్సయయ్య
తే॥ లానఁ జేడలసడల్చి, నీ • రాడి,చీని
చేలలఁ రతనాల సరాల నగలఁ
దాల్చి తానెలనాగ, గండాలలంది
కడఁకసిరిగటిజేజేల • కరణినిల్చి. 258

టీ—నేలతేఁడు=రాముఁడు, సత్తి...యానఁ=వసిష్ఠుని యాజ్ఞను, జేక్కఅలు=నదులు, నాఁగ...నాతి=సీత.

చ॥ నెఱసఱి గద్దె డాకడన ♦ నెల్తలదంట నెలంగ నిల్పి, జ
క్కఱితెగనీటనింగలికి ♦ కల్కికడాని కడింది తాఁటి ని
ద్దఱికట జన్నిగట్లడర ♦ దంటతనాన నెసంగఁ గట్టి, న
క్కఱఁగని నేలకన్నె కెన ♦ గాఁ గయిదండల నేలఁ దాలిచెన్. 259

టీ— నెఱసరిగద్దెన్=సింహాసనమందు, డాకడన్=వామభాగమున, కడాని...తాఁటినిన్=బంగారు పట్టలను, కైదండలన్=బాహుదండములందు నేలన్=భూమిని, తాలిచెన్=ధరించెను.

ఉ॥ చేలల దండల న్నగల ♦ జిడ్డిడఁ జాలిన యాలనిచ్చి, జే
జేల కడింది తిండికెన ♦ జేయఁగఁ జాలిన తిండి నేలజే
జేల కడింగి నట్లయిడి ♦ చెచ్చెరనట్టిరి కెల్లతెన్న జే
జేలకడంకనిచ్చె, నిల ♦ చేడియ గాదిలికన్నె తేఁడహా!. 260

టీ— చేలలన్=వస్త్రములను, జిడ్డిడ......యాలన్=పాలిచ్చుగోవులను, జేజే......తిండికిన్=అమృతమునకు, నేలజేజేలు=భూసురులు, ఇల......తేఁడు=భూమికన్యాభర్త.

ఉ॥ రక్కసితేని కార్కికిని ♦ రాణఁ దలిర్చెఁ గడానిచేలలం
జెక్కని దండల న్నగల ♦ సంతనగానిడి, నింక నట్టిరై
చిక్కినయట్టిరిం గడఁకఁ ♦ జేరఁగదీసి కడానిచేలలం
జెక్కనిదండలిచ్చి నెఱఁ ♦ సాగఁగ నంచెఁగ నేగి, రయ్యెడన్ 261

టీ— రక్కసితేనికిన్=విభీషణునకు, ఆర్కికిన్ = సుగ్రీవునకున్, కడానిచేలలన్=బంగారు బట్టలను, అట్టిరు=అటువంటివారు, చిక్కినయట్టిరిన్=మిగిలినవారిని.

సీ॥ తలయెత్తఁగా లేక ♦ తలఁకి నీటండాగ
నైనట్టి నలదాస ♦ రీని దెగడి
నెఱసరికిం జంకి ♦ నీరేయడం గాఱి
చెడి హత్తిరాయల ♦ చెడ్డనెంచి
నెఱకలంతటఁగల్గి ♦ నెఱఁదెల తెలచేన్న
యేఁదేటికనిచాల ♦ నీసడించి
కనలేక, చెవలేక ♦ కైసిరియాలేక
నేలదాల్చినతేని ♦ నెఱని దెగడి

తే॥ కదలి చేనలేక నిల్చిన • గట్లనెంచి
దిట్టయై నెఱసరియయి • తేజడరఁగ
నైనసిరింగల్గి, నటయాడఁ • గల్గినట్టి
తనకయిం జేర నిలయేలెఁ • దనర జియ్య. 262

టీ—నలదాసరినిన్=కాబేలును, (ఆదికూర్మమును) నెఱసరికిన్=సింహమునకు, హత్తి రాయల = గజరాజేలయొక్క, (అష్టదిగ్గజముల యొక్క) నెఱకలు=వెండ్రుకలు, ఏఁదు=తెల్లనిపంది (శ్వేతవరాహము) నేలఁదాల్చినతేనిన్=భూమిధరించినవానిని (ఆదిశేషుని) గట్లన్=కులగిరులను, దిట్ట=ధీరుఁడు, నెఱసరి=శూరుఁడు, జియ్య=ప్రభువగు రాముఁడు.

క॥ సిరిచేఁ, జేక్కనినెఱకై । సిరిచే, జేతలేనికాచే • సిరిచే, రేరా
సిరిఁజేఁజేరచెడి కీరితి । సిరిచే, దాశరథి నేల • చేడియ నేలెన్. 263

టీ—సిరి=సంపద, రాచేసిరి=రాజసంపద, నేలచేడియ=భూమి.

చ॥ సిరిఁదెఱఁగంటితేని దెసఁ • జెల్లఁగ గాలికి గల్గినట్టి, డా
సిరికెనగాఁగ డాకడన • సీత తనచేరఁగ, నీటిరాదెసన్
సిరిఁదెగడంగ నెల్లికయిచే నిల లచ్చన, యెల్లరండఁ గై
సిరి సెలగంగఁ గ్రాల, నిల • చేడియఁ జెడగ నేలె తేఁడహా! 264

టీ— తెఱఁ...దెసన్=పూర్వదిశను, గాలి...నట్టిడు= హనుమంతుఁడు, డాకడన=వామభాగమున, సీత=జానకి, నీటిరాదెసన్ = పశ్చిమమున, ఎల్లికయిచేన్=ఛత్రహస్తముతో, గొడుగుబట్టినవాఁడై, లచ్చన=లక్ష్మణుఁడు, ఎల్లఱు=అందఱు, (భరతశత్రుఘ్నులు,మొ॥) క్రాలన్=ప్రకాశింపఁగా, తేఁడు=రాముఁడు, ఇలచేడియన్=భూమిని, చేడెగన్=భార్యగా, ఏలెన్=పాలించెను.

చ॥ నెఱినడ లేళ్లయంద, కఱ • నెత్తల కీల్జడలంద, యాగడా
లెఱచిఁదినంగలారియెడ • నెద్దడి యెద్దడియంద, కల్కలా
గతితల యెడ్డలంద, కనఁ•గాఁదగఁ గిరితి కల్కి నంతట
న్నెఱయఁగఁజేసి, యక్కటిక • నిండఁగ రానెల నేల నేలెఁ దాన్.

టీ—నెఱినడ=వంకరనడక, కఱ=నల్పు, ఆగడాలు=ఆగడములు, ఎఱ...యెడన్ = మాంసభక్షులునైన రాక్షసులందును, ఎద్దడి= దరిద్రము, ఎద్దడియంద=దరిద్రముననే (లేమిలేమియందే యున్నదనఁగ దరిద్రములేక భాగ్యమెకలదనుట) కల్కలు=కలకలు, గతితల......లంద=

అడుఁవాఁటవ నన్నులందె, తగిఁ=ఒప్పునట్లు, కీరితికల్కి=కీర్తికాంతను, నెఱయంగ=వ్యాపింపఁగా.

క॥ ఈకరణి నెల్లతెన్నుఁగ। రాకన్నాకెల్లకడల • రహిఁగెల్పియటఁ
డీకడనఁజేసి జేన్నా। లేకడఁ దనయాన లడర • నేలెఁ నేలఁ. 266

టీ—రాకన్నాకు=రాజశ్రేష్ఠుఁడు, కడలఁ= దిక్కులను, జేన్నాలు=యజ్ఞములు, ఆనలు=ఆజ్ఞలు, నేలఁ=భూమిని, ఏలెఁ=పాలించెను.

—* రాముఁడు హనుమంతునకుఁ దనతత్త్వముదెల్పుట. *—

చ॥ తనచెలిదంటకై కడలి • దాటి కడిందిగఁ గన్గొఁజెందె నీ
యన చెలియైన సంతయిన • నారయ నందక నన్నుఁ దెల్పెఁ, నం,
చని తెలి చూనఁజేసిసిరి • నందెడి క్రిచ్చేడి; యాంజనేయ! నే
నని తెలియుంగదయ్య తిగ • యయ్యలకాదరిజియ్యనం చెదఁ. 267

టీ—(రాముఁడు)తనచెలిదంటకై=తనరమణీమణిసీతకొఱకు, ఈయన=ఈహనుమంతుడు, చెలియైన=భార్యయైన, నంతయిన=సంతానమైనను, అందక=పొందక, నన్నుఁ=నన్నె, తెల్పెఁ=కొల్చెను; అంచు+అని=అనుకొని, తెలి...సిరిఁ=భవిష్యత్ బ్రహ్మాధిపత్య సంపదను, అందెడి, క్రిచ్చు=కోరిక,ఇడి=ఇచ్చి,తిగ...జెయ్యఁ=మూడుమూర్తులపై వాఁడనగుపరబ్రహ్మమును, ఎదఁ=హృదయమున, నేనని...దయ్య=నేనని తెలియుము.

సీ॥ నా సీడ యనియెడి • నాగటిచాల్కల్కి
నిడఁ జెఱ నే నని•యెడి చెనంటి
చాల్తులలగయాలి, • చేయ్యన నద్దిసీ
యెదయయ్యగారి చే • నెఱఁగి యార్కి
జానైన దారిక•లాన, నిల్లా ల్సంత
నెడి కడలిందాటి • నెఱని లంక
యనియెడికాల్సేయి • నలరఁగల్గినదాని
జేరి నేననియెడి • చెడ్డరక్క
తే॥ సీని తలలెల్లఁజెండాడి • సీతసీడఁ
జేర్చినాయంద యేరికి • నేర్చరాని
జెట్టినైన నేఁజేరితిఁ • జెడనిటెంకి
నని యెఱింగెద రెక్కుఁగలట్టి • రెదల. 268

టీ__ఎఱుకగలట్టిరు=ఎఱుకగలవారనఁగా, దమను దా.ఘెఱింగి నవారు, నేన్ అనియెడి=అహంకారమనెడు, చెనంటి...యాళి=వరుసతల లచెదుర వనుడు, నా=రాముఁడనైననాయొక్క, నీడ...కల్కిన్= నాఛాయయైన సీతను, అనగా నాప్రకృతి కాంతను, చెఱన్=చెఱసాల యందు, ఇడన్=పెట్టగా, అద్ది=ఆపెట్టుటను=నీ...నెఱిఁగి=నీహృదయగు రుబోధచేఁదెలిసికొని, ఆర్కి...కలానన్=సుగ్రీవుఁడనెడి నౌకామార్గ మున, ఇల్లా...దాటి=కుటుంబసముద్రము దాటి, లంక...దానిజేరి= లంకాపట్టణశరీరముజేరి, నేనని...చెండాడి=అహంకార రావణునిజంపి, సీతనీడన్=సీతయను (నాప్రకృతిని,) ఛాయను, నాయంద=నాయందె, చేర్చి=ఉంచి,పరికి నేన్=ఇట్టివాఁడనని యెవరికి దెలియఁబడనినేను,చెడ నిటెంకిన్=చెడనిపరబ్రహ్మస్థానమును,చేరితిన్=చేరినానని,ఎదలన్=మనస్సులందు, అని యెఱింగెదరు=అని తెలిసికొందురు.

క॥ కలఁకలేఁక నేల?కందా! యలతిగజేజేలకంద ♦ నట్టిదయిన "త"
ళ్కులరంగ "నేన" యనియెదఁ। దెలియఁగదయ్యాయని లెంకఁ♦ దేరిచెనచ్చేన్

టీ__కందా=బిడ్డా!, అల...యిన = మూఁడుమూర్తులకుజిక్కని తళ్కు=వెలుఁగు, నేన=రాముఁడనైననేనే, లెంకన్=భటుని, తేరిచెన్.

క॥ ఈకరణిఁదెలియనాడిన । నాకప గేసరికిఁగల్గి♦నట్టిడలరి తా
నాకడిదిరాయఁడనియెద । దాకంగాఁదెలిసి హాయిఁ♦దసరం గాంచెన్

టీ__కేసరికికల్గినట్టిడు=(హనుమంతుఁడు) ఆంజనేయులు, తానా ...దెలిసి=తానాపరవస్తువయిన రాముఁడనేనని, హాయి...గాంచెన్=సంతసించెను.

క॥ అనిదిండిజేడలదారి యిట్టని తెలియంజేయఁజెక్కు♦నాలించి రహిం
దనిసి, తగసంతసిల్లెం। గణంకఁ గాల్దిండ్లటెంకిఁ ♦ గలిగి నతఁ డెదన్.

టీ__అని...దారి = కలహాశనముని (నారదుఁడు) గాల్దిండ్ల... నతఁడెదన్=వల్మీకభవుఁడగు వాల్మీకిమనమున, సంతసిల్లెన్=సంతోషించెను.

—* ఫలశ్రుతి *—

క॥ ఈకతనాడినఁజేసిన । నేకడనాలించినన్ రహిని, లగ్గిడెడిన్
డీకలర నేలకన్నియ । రా, కలకలఁదీర్చిచేర ♦ రాఁదీసితగన్. 272

టీ__ఈకతన్=రామాయణమును, ఆడినన్ = చెదివిన, చేసిన =

గ్రంథరచనగావించిన, ఆలించినన్=వినిన, నేలకన్నియరా=భూకన్యాభర్తరాముఁడు, లగ్గున్=మేలును, ఇడెడిన్=ఇచ్చెడిని.

క॥ ఆలించేక లగ్గీయని। తేలికతెల్గునెద ఱిద్ధి • తెలియక యేరేన్
దేలికగ నేలకన్నియ। యేలిక నన్నట్టెఱంద • రే! లగ్గింతేన్. 273

టీ—ఆలించేక=సరిగావినక, ఏరేన్=ఎవరైనను, తేలికతెల్గు+ఆనెదరు=తేలికగ్గైనతెనుఁగుమాట లేకపియందును.

## —• విజ్ఞాపనము •—

క॥ చేతనయినట్లు యల్లితి। నీతఱి నెఱి, సెన్నక కన•రే! కయిరాయల్
కైతల నల్లిన నెఱకయి। తాతలదారి నిటకన్నె•దారినెఱేతన్. 274

టీ—కయిరాయల్=కవిశ్రేష్ఠులు, కైతల......దారిన్=కవిత్వముచెప్పిన కవిబ్రహ్మల మార్గమున, ఇల......కతన్=రామునికథను నెఱసు=తప్పు, ఎన్నకకనరే=ఎంచకుండ జూడుఁడు.

## —• ఆశ్వాసాంతము. •—

క॥ సీకంటెలాతియైనది! యేకడ నరయంగలేక • యొక్కఁడఁగన్నన్
దాకంగనిలిచి యొల్లెడ। లేకలకల నందనీక • యేలెడిదిట్టా!. 275

టీ—లాతి=ఇతరము, కలకలన్=కల్లలను, దిట్టా=శ్రేష్ఠుఁడా!.

మాలిని॥ చెడ కడరినదంటా! • చెడ్డరా కాసికంటా!
అడ లడఁచెడిగండా! • యంతటం గల్గతండా!
చెడని సిరిఁ గలాఁడా! • సీత కాల్గంటిఱేఁడా!
అడఁగని జిగికాఁడా! • యార్కికిన్ సంగడీఁడా!. 276

టీ—దంట=నేర్పరి, కంటా=పగవాఁడా!, గండా=మొనగాఁడా, కలాఁడా=కలవాఁడా, సంగడీఁడా!=చెలికాఁడా!.

## —• పుష్పమాలికాబంధము. •—

సి గిఁ గా సె రి, జా
చ॥ సి రి సీతజి కిల్స కిఁ దాసరి నం,గస కిన్న లి కాల్
గే ల్లుఁ, తా జే ర్ది, నే

సి గ నే ద గిఁ దం
హా రి, సంత న గాంచి న గద్ద రి, నన్ను ద గాచె డి రా!॥ 277
డా ల్లు యై జే న్నె దం

—• గద్య •—

తే॥ ఇద్ది యయ్యరాజేనియెడి • యింటఁసన్న
దగిన శేషయ్యకందుఁడు • తనరినట్టి
యాంజనేయాఖ్యఁ జెలఁగిన • యతనిచేత
నెసఁగె "దాశరథిచరిత్ర" • నిదికడకత. 278

టీ—అయ్యరాజే=అబ్బరాజు, శేషయ్యకందు=శేషయ్యకొమారుఁడు, ఆంజనేయాఖ్య......చేతన్=ఆంజనేయులపేరుచేఁ బ్రకాశించెడు హనుమంతరాయ శర్మ పాకయాజిచేత, దాశరథి చరిత్రన్=రామాయణమందు, ఇది=ఈ గ్రంథభాగను, కడకత=చివరకథ (తృతీయాశ్వాసము) ఎసంగెన్=ఎక్కువగా వ్యాపించెను.

గద్య

ఇది శ్రీమత్సుగ్రీవ పట్టాభిషేకాద్యనేకాంధ్రగ్రంథనిర్మాణ చాతురీ ధురంధర సదస్యశోబంధురకౌండిన్యసగోత్ర కలితాపస్తంబసూత్రచతుర్విధ కవితామతల్లి కాబ్బరాజాన్వయ పయఃపారావార రాకాకైరవమిత్ర నృసింహామాత్యపౌత్ర, భార్గవవర సుబ్బకవిరాయ దౌహిత్ర శ్రీద్వైతా
ద్వైత మతప్రతిష్ఠాపన నందిరాజ లక్ష్మీనారాయణదీక్షిత ద్వితీయ
దౌహిత్ర ప్రియ మంగాంబా శేషాచలామాత్య తనయ
సుధీవిరాజి హనుమంతరాయశర్మ పాకయాజి ప్రణీతం
బైన శ్రీమదచ్ఛాంధ్రనిరోష్ఠ్య నిర్గద్య
దాశరథి చరిత్రంబునందు
దృతీయాశ్వాసము.

---

సర్వేజనాస్సుఖినో
భవంతు.

---

తే॥ గీ॥ కబ్బము నొనర్చినటువంటి • కవిని సాయ
ముంచుకొనుచుఁ డీకను వ్రాసి • యున్నవాఁడ
"సుజనరంజని" నాఁబేరుఁ • జూపినాఁడ
తప్పులెన్నక కైకొనఁ • దలఁచినాఁడ
"నబ్బరాజు సీతారాముఁ"• డనెడు వాఁడ.



## అచ్చు కానున్నవి.

1. అచ్చాంధ్ర నిరోష్ఠ్య-నిర్గద్య నృగచరిత్ర.
2. శ్రీ నందిరాజ లక్ష్మీనారాయణ దీక్షిత చరిత్ర.
3. తైత్తరీయస్మార్త బ్రాహ్మణ హస్తభూషణము.
4. అభిమన్యుఁడు. } (వచనము.)
5. కళాపూర్ణుఁడు. }
6 నిరోష్ఠ్య ధనంజయ తీర్థయాత్ర (రూపకము)
7 ఆంధ్రమాఘ మాహాత్మ్యము. }
8. ఆదినారాయణ శతకము. }
9 ముద్దుమురారి శతకము. }
10. శ్రీ త్రికూటాచల చరిత్ర. (యక్షగానము.) } మదీయ జనకులైన అ. శేషాచలముగారి కృతము.
12. అంబరీష చరిత్ర.
13. కవికర్ణ పేయము.

వలయువారు —

అ॥ హనుమంతరాయశర్మ పాకయాజి,
ఆంధ్రపండితుఁడు
బి. హెచ్. స్కూలు, పెరవలి (పోస్టు.)
వయా, తెనాలి, గుంటూరుజిల్లా.



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA111B130 |
| పుస్తకం పేరు | దాశరథిచరిత్ర |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 177 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 10,13, |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | vedavathi |
| పేజీలు విడదీసినది | vedavathi |
| స్కాన్ చేసినది | Haseema |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | NIL |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |